# చతుర

సంపుటి : 9 అక్టోబర్ 1986 సంచిక : 9

## ఈ నెల సమగ్ర నవల

తను ఈ దుర్మార్గ ప్రపంచంలో, ఈ అసమానతల సృష్టిలో ఓ పిపీలికం!
మానవత్వం లోపించినవారి పదఘట్టనలకింద నలిగిపోయే ఓ చిన్న చీమ, ఓ అల్పజీవి తనకు జరుగుతున్న అన్యాయం గురించి ఎవరితో మొరపెట్టుకుంటుంది?
మరి, తనూ అంతేనా?
తనకు జరిగిన అన్యాయాన్ని ఎవరూ పట్టించుకోరా?
చీకట్లో జరిగే ఈ ఘోరాలన్నీ చీకట్లోనే కలిసిపోతాయా?
ఆడదాని ఆక్రోశం ఈ చీకట్లోనే కరిగిపోతుందా?
ఇంత దయలేనిదా ఈ లోకం?
ఇంత నిర్దాక్షిణ్యమా ఈ లోకానికి?
అనాదిగా స్త్రీత్వానికి శాపంగా పరిణమించిన అన్యాయానికి గురైన ఆమె ఓ యువకుడిపై దోషం ఆరోపించి న్యాయస్థానంలో నిలబెట్టింది.
దాని పర్యవసానం?
అపై ఆమె జీవితంలో ఎలాంటి అనుభవాల్ని చవిచూసింది?

పాలకోడేటి సత్యనారాయణ రావు

కలం ఆసక్తిదాయకంగా మలచిన రచన

# దోషి...?

ఈ నెల చతుర వెలువరిస్తున్న సమగ్ర నవల



కవర్ పేజీ ఫొటోగ్రాఫర్ : సురేశ్ చంద్ర బచావత్

# చమత్కార ప్రపంచం

## రచనా రహస్యం!

ప్రఖ్యాత మరాఠీ రచయితల్లో ఒకడైన గురునాథ్‌నాయక్ ఈమధ్య తన 700వ నవలను ప్రచురించి రికార్డు సృష్టించాడు. అతను ఆ 700 నవలలనూ కేవలం 13 ఏళ్ళల్లో రాశాడు. గ్రామస్థులు మొదలుకుని నగరవాసులదాకా గురునాథ్‌కి అభిమాన పాఠకులు కావటం ఓ విశేషం. అతను తన రచనల్ని సాహసగాథలుగా అభివర్ణిస్తాడు గానీ నిజానికి అవన్నీ సస్పెన్స్ థ్రిల్లర్స్ కోవలోకి వస్తాయి. అతని నవలలు వివిధ సాహసకృత్యాలకు సంబంధించినవే అయినా కథ నడిపే తీరు సస్పెన్సుతో కూడి వుండటంతో అతనికి విశేష పాఠకాదరణ లభించింది.

13ఏళ్ళ క్రితం గురునాథ్ రచనా వ్యాసంగం మొదలుపెట్టినపుడు కొత్త వరవడిని చేపట్టకపోతే పాఠకులను ఆకర్షించటం కష్టమని గుర్తించాడు. అందువల్ల అతను మొదటి నవలకు ఎన్నుకున్న కథ, కథ నడిచేతీరు, సంఘటనల కూర్పు, నేపథ్యంలో వీలైనంత కొత్తదనాన్ని ప్రవేశపెట్టి కృతకృత్యుడయాడు. చిన్న వాక్యాలు, చిన్న పేరాగ్రాఫులు వేగంగా చదివింపచేసేలా, సాహసం మూర్తీభవించిన పాత్రలతో తన మొదటి నవలతోనే ఆవిధంగా పాఠకులను ఎంతోగానో ఆకట్టుకున్నాడు గురునాథ్. 'తర్వాత ఏమవుతుంది?' అనే ప్రశ్న పాఠకుల్లో రేకెత్తేలా తన నవల్లో ప్రతి అధ్యాయాన్ని ముగిస్తాడు గురునాథ్. అతని నవలల్లో మరో ముఖ్యమైన గుణమేమంటే ... [illegible] తను చదువుతున్నది వాస్తవ [illegible] ఏమాత్రం అనిపించదు.

ప్రస్తుతం నవలా రచనే వృత్తిగా జీవిస్తున్న గురునాథ్, [illegible] పత్రికల్లో పనిచేశాడు. జర్నలిస్టుగా వున్న కాలంలో అలవరచుకున్న తక్కువ వ్యవధిలో ఏదైనా రాయగలిగే నేర్పు, ఇప్పుడతను విరివిగా రచనలు చేసేందుకు ఎంతో తోడ్పడుతోంది ... గురునాథ్ నెలకు 5లేక 6 నవలలు రాస్తాడు.

అతనికి ఏదైనా ఒక్కసారి రాయటం అలవాటు. కనీసం ఓ పేరాగ్రాఫుని కూడా తిరిగి రాయడు. "నాకు జీవితంలో ఎదురైన సంఘటనలు, తారసపడిన అనేకమంది వ్యక్తులే నా నవల్లో జీవం తొణికిసలాడుతూ కనబడే పాత్రలకి ఆధారం!" అంటాడు గురునాథ్.

## వేవేల అబద్ధాలు

'అబద్ధాలకోరు' అన్పించుకోవటం ఎవరికీ ఇష్టం లేకపోయినా నిత్యజీవితంలో మనిషి అబద్ధాలు చెప్పకుండా వుండలేడు. సగటున మనిషి సంవత్సరానికి వెయ్యి అబద్ధాలాడతాడని ఓ పరిశోధన అంచనా. ఒక్కో మనిషి రోజుకి 200 దాకా అబద్ధాలాడుతూ సంవత్సరానికి 73 వేల అబద్ధాలు చెబుతాడని మరో పరిశోధకులు అంటున్నారు.

మగవారికంటే ఆడవాళ్ళు అబద్ధాలాడటం ఎక్కువ. కాగా ప్రపంచంలో [illegible] నాయకులే. [illegible]



డాక్టర్లకి కూడా రోగులతో వారి ఆరోగ్య పరిస్థితిగురించి ఒక్కొక్కసారి అబద్ధాలు చెప్పడం తప్పదు. మిగిలిన వృత్తుల్లోని వారికంటే ఆర్కిటెక్టులు, సైంటిస్టులు, ఇంజనీర్లు అబద్ధమాడటం తక్కువ.

అబద్ధాలు సాధారణంగా అప్పటికప్పుడు అల్లబడినవే అయివుంటాయి. మగవారికన్నా ఆడవారే ఎక్కువ నమ్మించేలా అబద్ధాలు చెప్పగలరు. మగవాళ్లు హానికరం కాని అబద్ధాలు 15 నిముషాలకి 3 చెబితే, ఆడవాళ్లు 4 చెబుతుంటారు. అంతేగాక ఇతరులు చెప్పింది. నిజమా, అబద్ధమా అనేది కనిపెట్టడంలో కూడా ఆడవాళ్ళే దిట్టలు.

అబద్ధం చెబుతున్నవారిలో అప్పటికప్పుడు అనేక మార్పులొస్తాయి. కంఠంలో కొద్దిగా మార్పు కనబడుతుంది. గుండె కొట్టుకునే వేగం పెరుగుతుంది. రక్తపోటు పెరగటమేకాక అనవసరంగా చెమటపడుతుంది. ఒకచోట దృష్టి నిలపకుండా కళ్లు చంచలంగా కదులుతాయి.

అబద్ధం చెబుతున్నవాళ్లు ఊరికే మొహంపైనో, మెడ వెనకో చేత్తో తడుముకుంటారు. కంఠంలోనూ, బదులు చెప్పడంలోనూ తటపటాయింపు కనబడుతుంది. ఎందుకంటే, నిజం వెంటనే చెప్పవచ్చుగాని, అబద్ధం కల్పించి చెప్పాలి గనుక. ఆ సమయంలో మామూలుకంటే ఎక్కువగా పొడినవ్వులు ఒలకబోస్తారు. అనవసరంగా దగ్గడం, తుమ్మటంలాంటివి చేస్తారు. అబద్ధాలాడుతున్నప్పుడు మామూలుగా మాట్లాడేటప్పుడు చూసినట్లు కళ్ళలోకి చూడలేక చూపు తప్పిస్తారు. సరైన కారణం లేకుండా భుజాలు ఎగరేస్తారు. ఎదుటివాడికి సమీపంలో వుండకుండా కొంతదూరం నుంచి మాట్లాడతారు. అబద్ధమాడేటపుడు కంఠస్వర స్థాయి కూడా పెరుగుతుంది. చెప్పిందే మరోసారి చెప్పటం జరుగుతుంది. చివరగా, "నేను నీ దగ్గర అబద్ధమాడను" అని చెబితే, ఆ వ్యక్తి నిస్సందేహంగా అబద్ధం చెప్పినట్టే!

*




# వాగ్దానాలు... వాగ్దానాలు–నేటి టెలివి
# ఇంతకీ నిజంగా వీళ్ళలో మాట నిలబెట్టు

ఎవరు చూసినా మా టీ.వీ. కొనండంటే, [illegible] కొనండని–వాళ్ళదే ఎందుకు కొనాలో చెప్పరేం అవి ? ఎవరు చూసిదా మా టెక్నాలజీయే అన్నింటికన్న గొప్పదంటే మాదే గొప్పదనీను, అదేమిటో వివరించి చెప్పరేం మరి ?

అసలు సంగతి –వాళ్ళసలు చెప్ప [illegible] గనక. ఎందుకంటారా, టీ.వీ. తయారుచేసే చాలామంది అసలు, టీ.వీ. [illegible] తయారుచేయరు నిజానికి. అక్కడ [illegible] యిక్కడ నుంచీ, వివిధ పార్టుల్ని [illegible]కొచ్చి ఒక చోట సమకూర్చి [illegible]స్తారు–అంతే.

[illegible]బించండి ఒక్కసారి మీరే.అలాకాకుండా [illegible]సి, మన దేశ పరిస్థితుల్ని దృష్టిలో [illegible]కుని, ప్రత్యేకంగా అచ్చంగా మీ కోసం [illegible] దేశంలో డిజైను చేసిన టీవీ.ని నమ్మి [illegible] దీన్లో పెడతారా ? అందుకే గదా [illegible]డదాకా మన దేశంలో మూడు లక్షల [illegible]బాలు ఈ.సి.టీవీ. సెట్లును కొనుక్కుని [illegible] వాడుతున్నది ? టీ.వి. సెట్టంటే [illegible]వీ.కొట్టిపారెయ్యలేరిక.

ఎందుకంటారా, గత పది హేనేళ్ళుగా ఈసిఐఎల్ వాళ్ళేగదా భారతదేశంలో అసలు టీ.వీ. టెక్నాలజీని ప్రవేశపెట్టి, ముందంజ వేసినవారు ? కలర్‌లోనూ, బ్లేక్ అండ్ వైట్ టీవీ ల శ్రేణిలోనూ ఒక ఉత్కృష్టమైన స్థాయీ, స్థానాన్ని తెచ్చింది వీరేగదా ? పేచీపెట్టని తీరులో ఏళ్ళ కేళ్ళుగా మీ టీవీ. పనిచేస్తున్నది అందుకేగదా ?

దీన్లో ప్రతి పార్టుకీ, ప్రతి సర్క్యూట్‌కి, ప్రతి విడి భాగానికీ సరియైన మేళవింపు వుంది— దాంతో ఎలక్ట్రానిక్ టెక్నాలజీలో విస్మయమైన సంపూర్ణ సమగ్ర చిత్రం రూపొందుతుంది. దాంతో అత్యంత స్పష్టమైన సొంపైన చిత్రాలు కనిపిస్తాయి. అత్యంత శ్రావ్యమైన, యింపైన ధ్వని. మీకు ఎప్పుడూ యిబ్బంది పెట్టకుండా పనిచెయ్యడం.

అంతేకాదు, ప్రతి ఈ.సి.టీవీ. సెట్టు వెనకా దేశ మంతటా విస్తరించివున్న అత్యంత సమర్థవంతమైన సేవా సౌకర్యాలున్నాయి. ప్రత్యేకమైన **30** ఈ.సి.టీవీ. కేంద్రాలు. **400** మంది నమ్మకమైన డీలర్లు. మరంటే మీరొక్క ఫోన్ కాల్ కొడితే చాలు–అంతే.




# జిన్ మార్కెట్‌లో ఎడాపెడా ఎన్నన్నని ?
# కునేవారెవరని !

మీకింకా ఏమేం యిస్తామో తెలుసుకోవాలని వుంది కదూ, మీ ఈ.సి.టీవీ. డీలర్‌ని కలుసుకోండి. తెలుస్తుందప్పుడు మీకిక యీ చెప్పిందంతా పొల్లుబోదని, మేం, అంటే ఈ.సి.టీవీ. మాట నిలబెట్టుకుంటుందనీను.



ECTV

దీనిని అనుకరించడం ప్రతి టీవీ ప్రయత్నం.

---

Karishma EC2 1722TI

# "అమృతతర్పణం" నవలపై



# చతుర సమీక్షలు



**ఆగస్ట్ 'చతుర' నవల 'అమృతతర్పణం'పై పాఠకుల నుంచి మాకు అందిన 'చతుర సమీక్ష'లలో ఉత్తమంగా వున్న మూడింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. ఈ శీర్షికలో ఉత్సాహంగా పాల్గొన్న పాఠకులందరికీ మా కృతజ్ఞతలు! బహుమతులు పొందిన ముగ్గురికీ మా అభినందనలు!**

## సరికొత్త ఇతివృత్తం

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

ఒక మంచి నవలకు ప్రధాన లక్షణం- ఆ నవలను చదవడం పూర్తిచేసింతర్వాత పాఠకుడికి అంతకుముందు అనుభవంలోకి రాని ఒక కొత్త లోకాన్ని కళ్ళముందు నిలిపి, గుండెలో ఆర్ద్రతను ప్రోది పరచిఆలోచింపచేయడం. 'అమృతతర్పణం' నవలలో శ్రీ కొమ్మిరెడ్డి విశ్వమోహనరెడ్డి ఈ లక్షణాన్ని సమర్థంగా సాధించారు.

ఒక అవిటి బతుకులోగల ఆశల్నీ, కోరికల్నీ, అనుభూతుల్నీ, తిరుగుబాటు మనస్తత్వాన్నీ, భయాన్నీ, బీదరికాన్నీ- అన్నింటినీ భూతద్దంలోలా చూపించారు. ఆ అవిటి బతుకు ఓ స్త్రీది కావడంతో రాజ్యం మరింత సానుభూతిని దోచుకుంది. పాత్రపోషణలో ముఖ్యంగా స్త్రీ పాత్ర పోషణలో, ఆ పాత్రకు వాడవలసిన సంభాషణలలో రచయిత లోకపరిశీలనా తత్వం కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది.

స్త్రీ పాత్రల్లో ముఖ్యంగా ఆకర్షించేవి లలిత, రహ్మత్ పాత్రలు. లలిత వాగుడు కాయగా కనిపించినా, తొందరపాటుపిల్ల అనిపించినా నిజానికి ఆ రెండు గుణాలూ ఆమెకు ఆభరణాలుగానే కనిపించాయి. ఒక విధంగా లలిత రాజ్యానికి గార్డుగా ఉంది. ఎప్పటికప్పుడు సహాయపడుతూనే సలహాలిచ్చింది. సుబ్రహ్మణ్యాన్ని చేసుకోడానికి ఉవ్విళ్లూరిన రాజ్యానికి మంచి చెడులు విచారించి ముందుకు కదలమని బ్రేకులు వేస్తూ, మళ్ళీ ప్రోత్సహిస్తూ ఆ సుబ్రహ్మణ్యం అసలు రంగు బయటపడగానే రాజ్యం కుప్పకూలిపోకుండా, ధైర్యం చెప్పి మళ్ళీ మామూలు మనిషినిచేసింది. అదేవిధంగా జయధీర్ విషయంలో కూడా రాజ్యం సర్వస్వం కోల్పోతే ఆమె కన్నీరు తుడిచి ఆదుకుంది రహ్మత్. "జరిగిందేదో జరిగిపోయింది. ధైర్యం తెచ్చుకో! మా అక్క విషయం చెప్పాగా! ఆ గుండెధైర్యం లేకనే ఆత్మహత్య చేసుకుంది. నీ విషయం రాత్రే పసిగట్టాను.ఏం అఘాయిత్యం చేస్తావోనన్న భయంతో తెల్లారే వచ్చాను" - కష్టంలో ఉన్న ఓ మనిషికి మరో మనిషి సానుభూతి చెప్పడానికి, కన్నీరు తుడవడానికి కులం, మతం అడ్డురావని చెప్పడానికి ఇంత కన్నా మరో ఉదాహరణ అక్కర్లేదు. ఇటువంటి మానవీయ ధర్మాన్ని తెలియజేసే పాత్రల సృష్టే ఇప్పుడు మనకు

కావాలి.

కథగా చూసుకుంటే రాజ్యం పరంగానే రచన అంతా సాగడం, రాజ్యం దృష్టితోనే మిగిలిన పాత్రలన్నింటినీ విశ్లేషించడం ఇతివృత్తాన్ని కొన్ని పరిధుల్లోకి కుదించినట్లయింది. రాజ్యాన్ని సమర్థించడం కోసం ఆమె జీవితంలో తారసపడిన పాత్రల్లో చాలావాటిని బలహీనతలకు లోనుచేయక్కరలేదు. దృఢచిత్తంతో ఆమెకు చేయి అందించినపుడు మధు ఏమన్నాడు? "జీవితంలో ఎన్నో ఒడిదుడుకులకూ, బాధలకూ లోనైన నేను, కనీసం ఒక బాధామయజీవికి సుఖమైన జీవితం కల్పిద్దామని ఆశించాను. నావల్ల ఒక్క అవిటివ్యక్తి అయినా సుఖపడాలనేదే నా ఆశయం". కాని ఈ ఆశయాన్ని నెరవేర్చడానికి మధు గట్టి ప్రయత్నమే చెయ్యలేదు. రాజకీయం గాలి తగలగానే రాజ్యాన్ని లెక్కచెయ్యలేదు. నిజాయితీపరుడైన మధు పాత్రలో సంఘర్షణను ప్రవేశపెట్టి ఉండవలసింది.

ఇహ పాండురోగంవచ్చినవాళ్ళు తెల్లబడతారు, పాలిపోతారు కానీ ఎర్రబడరు. ఇటువంటి వర్ణన దోషాలూ, కొన్ని కప్పదాట్లూ, పోలీసులందరూ రాక్షసులే అన్నట్లు చిత్రించే విపరీత పద్ధతీ ఉన్నా ఇది రచయితకున్న సిన్సియారిటీ మూలంగా మంచి నవల అయింది.

—కుమారచంద్ర కుంపటి

మద్రాసు.

## అశ్రుతర్పణమే!

**(ద్వితీయబహుమతి రు. 75/- పొందిన సమీక్ష)**

ఈ నవలలో రచయిత ఎన్నుకొన్న ఇతివృత్తం చాలా ఉదాత్తమైనది. ప్రేమలు, సైన్స్ ఫిక్షన్, సస్పెన్స్, థ్రిల్లింగ్ నవలలు రాజ్యమేలుతున్న తరుణంలో సమాజంలో అవిటివారికి ఎదురయ్యే కష్టాలు, అవమానాలను ధైర్యంగా ఎదుర్కొని, తన జీవితాన్ని తానే చక్కదిద్దుకోవాలనే రాజ్యం పాత్రద్వారా చాలా చక్కని సందేశం అందజేశారు రచయిత.

అయితే రచయితకు సంభాషణలు నడపడంలోను, పాత్రల మనస్తత్వం చిత్రీకరించడంలోను సరియైన అనుభవం లేదనిపిస్తుంది. ప్రిన్సిపాల్ అరుణ "మరో సంవత్సరం లాగి ఉంటే ...", "ఈ సంవత్సరం పోరాడు" '6 నెలల్లో బి.ఇడి ట్రయినింగ్ పూర్తిచేయవచ్చనడం

సుమతి, లలితలు "బోడిదానా", "కిలాడిదానా" అనుకోవడం...

ఇంకోచోట రాజ్యం "ఇందులో ఊడ బొడిచిందేమీలేదులే" అనడం...

రాజమండ్రి కాలేజీలో రాజ్యం "మగజాతి ఎక్కువగానే ఉంది. అందరితో పరిచయాలు పెంచుకుంటే ముందుకు సాగవచ్చు" అనుకోవటం ... లాంటివి చాలా అసహజంగా ఉన్నాయి.

మధును చూసి "సంతృప్తిపడితే, జీవితం గడపడానికి అవకాశం హాయిగా ఉండేమో..." అనుకుంటుంది రాజ్యం. ఇలాంటి వాక్యాలు వేరే ఏదో భాషకు అనువాదంలాగున్నాయి తప్ప తెలుగుదనం లోపించింది. మధు "ఇద్దరం ముప్పై పైబడిన వయసులో ఉన్నాం" అంటాడు. మరి, ట్రయినింగ్ పూర్తిచేసిన రాజ్యం ఇంతకాలం ఉద్యోగ ప్రయత్నాలు లేకుండా ఖాళీగా ఎందుకున్నట్టు?

రచయితకు ప్రైవేట్లకు, కాన్వెంట్‌కు తేడా తెలిసినట్లు కనబడదు. రచయిత లాగే 'మధు'కూడా అనుభవశూన్యుడని పిస్తుంది. లేకపోతే "జీవితం విచిత్ర మైంది" అనడం "కారుకూత"నా?

మన రాష్ట్రంలో ఎన్‌కౌంటర్లు వాస్త వమే అయినా, మూడు రూపాయలు పోయినా ఫర్వాలేదు అనుకుని బ్లాకులో సినిమా టిక్కెట్లు కొనే మధుని అనవస రంగా ఉగ్రవాదిగాను, నక్సలైట్‌గాను, చిత్రీకరించి కథను రాజకీయాల వైపు మళ్ళించారు. ఆఖరుకు ఏవిధంగా ముగిం చాలో అర్థంకాక రచయిత ఇద్దరినీ అర్థాంతరంగా చంపేశారనిపిస్తుంది. రచయిత నిజాయితీని మెచ్చుకుంటూనే, ఆయన పెన్నుకింద నలిగి నానా యాతనలకు గురియైన తెలుగు భాషకు 'అశ్రుతర్పణం'గా కూడా నవలను పేర్కొనవలసి రావటం బాధకలిగిస్తుంది.

—యల్. నాగమునికుమార్
ఆత్మకూరు.

## ఇంకా బాగుండాల్సింది

(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)

ఓ వికలాంగ యువతి సాగించే జీవన పోరాటం, ఎదుర్కొన్న చేదు అనుభ వాలు వెరసి 'అశ్రుతర్పణం' కథానాయిక రాజ్యం అవిటి తనం ప్రతి బంధకంగా నిలిచినా, తన కాళ్ళపై తను నిలబడి బతుకు సాగించాలన్న తపనగలది. ఆ ప్రయత్నంలోనే చదువు కొనసాగించింది. తనకు చేరువైన సుబ్రహ్మణ్యం, జయ ధీర్‌లను నమ్మి వారిపై ఆశలు పెంచు కుంది. చివరకు ఆశలు అడియాసలేననీ, వారు నయవంచకులనీ రూఢి అవుతుంది.

పరిణిత మనస్కురాలైన రాజ్యం చేరువకొచ్చినవారిపై క్షణంలో ఆశల పందిరి అల్లుకుపోవడం కథరీత్యా తప్పనిసరి కావచ్చేమో కానీ అది ఆమె వ్యక్తిత్వానికి మాత్రం సరితూగదు. రాజ్యం చివరి ప్రయత్నం ఫలించి మధుతో పెళ్ళవుతుంది. రాజ్యానికి మంచి వుద్యోగం కూడా దొరుకుతుంది. తన బతుకు తాను బతకగలిగిన స్థితిలో వుంటుంది కానీ తన భర్త తీవ్రవాది అని తెలిసీ ఆ విషయంపై లోతుగా ఆలోచించక పోవటం సరిగా లేదు. అలాగే ఎదురయ్యే పరిణామాలను గ్రహించక పోవడం పాత్ర చిత్రీకరణపరంగా లోటే.

నిర్నిమిత్తంగా వుండిపోయి పోలీసుల ఘాతుకానికి బలి అయినట్లుగా చిత్రీక రించడంకన్నా, భర్తతో తెగతెంపులు చేసుకుని స్వతంత్రంగా జీవనం సాగిం చినట్లు చూపివుంటే రాజ్యం పాత్ర మరింత ఆకట్టుకునేది.

తీవ్రవాదుల అణచివేత పేరిట పోలీసులు సాగించే దారుణాలను కళ్ళకు కట్టినట్లు చూపారు. అలాగే హాస్టల్ వాతావరణం కూడా.

స్కూలు పిల్లలు రేడియోస్టేషన్ చూట్టానికి వెళ్ళినపుడు స్టేషన్ డైరెక్టర్ స్వయంగా స్వాగతం చెప్పడం, సంస్కృతం మాస్టారు పిల్లలకు తానే స్టూడియో చూపించడం అసహజంగా లేదూ?

—జి. రుక్మిణి
ఉయ్యూరు.






# దోషి..?

పోలకోడేటి సత్యనారాయణరావు

అద్దంలోని సుశీల అసలు సుశీలను చూసి మెచ్చుకొంది. 'ఈసారి గెలిచి తీరతావు' అన్న హామీని అందంగా అందించింది. సుశీల ఆధైర్యాన్ని గుండె లోతుల్లో నింపుకొంది. గతంలో ఎన్నడూలేని ధైర్యం ఆమెకు తోడుగా కదిలింది-సుశీల అద్దం ముందునుంచి లేచిందప్పుడు.

ఆఖరిసారిగా జడసర్దుకుంది. పైట కొంగు సరిచేసుకుంది. ఒకసారి వెనక్కి తిరిగి అద్దంలోకి చూసుకొని తృప్తిగా తల ఆడించింది.

"త్వరగా కానీ తల్లీ....అవతల మళ్ళీ టైమయిపోతుంది! ఆలస్యమవుతుంది మరి!" గది బయటినుంచి తండ్రి రామనాథం హెచ్చరిక వినిపించింది.

చిన్నగా నవ్వుకొంది సుశీల, తండ్రి ఆత్రానికి. తండ్రికి ప్రతిసారీ ఇదే తొందర. ఏదో కొంపలు మునిగిపోతున్నట్లు ఉరకలు పరుగులుగా వెళ్ళటం, కొండంత నిరాశ నెత్తినవేసుకొని దిగులుగా వెనక్కి రావటం! ఇదిప్పటికి ఏడు.. కాదు ఎనిమిది...ఎనిమిదికూడా కాకపోయి ఉండొచ్చు. ఎవరు లెక్కపెట్టగలరు-నిరాశతో గుండెవిడిచేనిట్టూర్పులు. ఆడదాని జీవితంలో ఈ నిట్టూర్పులు తప్పవుగాబోలు! పరీక్షకు వెళ్ళినట్లుగా వెళ్ళటం, సంతృప్తికరంగా జవాబులిచ్చినా ఫెయిలయి వెనక్కి రావటం...ఏమిటో!

ఉద్యోగాన్వేషణ పర్వంలోనే తను అపజయాల్ని ఎదుర్కొంటూ వచ్చింది. రేపు..దీని తర్వాత ఘట్టం-అందరూ అనే 'నెససరీ ఈవిల్' - పెళ్ళి... ఆ పెళ్ళికి పునాదిగాఉండే పెళ్ళిచూపులు..ఆఘట్టంలో ఇంకెన్ని అపజయాలు, అవమానాలూ ఎదుర్కోవాల్సి ఉందో!

తను ఆ అవమానాలు ఎదుర్కోదు! తనసలు పెళ్ళే చేసుకోదు. ఏదో ఒక ఉద్యోగం సంపాదించుకొని, నాలుగు రాళ్ళు సంపాదించుకొంటుంది. ఆ డబ్బుతో చెల్లెలు సుజాతకు పెళ్ళిచేస్తుంది. తమ్ముడుగోపీకి మెడిసన్ చెప్పిస్తుంది. సంసారబంధాలో వాళ్ళను బంధించి పారేసి తను స్వేచ్ఛగా బతికిపోతుంది!

ఆ కలకు పునాదిరాయి ఇంకా పడాలి. తనకో ఉద్యోగం ఇంకా రావాలి!

ఈవేళ ... సంపాదించుకొంటుందా ఉద్యోగాన్ని తను! సుజాత నిన్ననే అంది. 'ఈ ఉద్యోగం నీకేవస్తుందే అక్కా!' అని. సుజాత అన్నది తన జీవితంలో గతంలో జరగకపోయి ఉండొచ్చు. తనది అసలు గుర్తించలేదు. ఈసారి చూస్తుంది సుజాత చెప్పింది నిజమే అవుతుందా అని! నిజమే అవుతుందనే నమ్మకం ఉంది తనకు!

"రామ్మా ... ఎంతసేపు?" తండ్రి మళ్ళీ హెచ్చరించాడు.

సుశీల ఆలోచనల్లోంచి బయటపడింది బయటపడుతూ నవ్వుకొంది - ఇంత ఆశా ఉద్యోగం వస్తుందనే?

భుజాలు ఒక్కసారి ఎగరేసింది సుశీల. అద్దంలోంచి ఆసుశీలా వెక్కిరిస్తున్నట్లు భుజం ఎగరేసింది.

నవ్వుకొంటూ సుశీల తలుపుతీసుకొని బయటకు వచ్చింది.

"పదమ్మా..చాలా ఆలస్యంచేశావ్!" తొందర పెట్టాడు రామనాథం.

"ఆలస్యం ఏమీ కాలేదు నాన్నా. ఇంత కంగారుపడి మనం వెళ్ళాం. తీరా చూస్తే ఇంకో గంటకో, గంటన్నరకో తీరిగ్గా వస్తారు బోర్డు మెంబర్లు! ఎవరికి తెలీదని ఈ గొడవంతా!"

"పోనిద్దూ ... మనం ఆలస్యం





చెయ్యటం దేనికీ, అంట! వేళకు రమ్మన్నారు, వెళ్ళిపోతే సరిపోతుంది" అంటూనే రామనాథం జోళ్లు బయటకు తీయబోయాడు గూట్లోంచి.

ఒక్కక్షణం ఆగి అంది సుశీల. "నువ్వెందుకులే నాన్నా! బయట ఎండ మండిపోతోంది. నువ్వు పొద్దున్నుంచీ ఒకటే ఆయాసపడుతున్నావు కూడా..."

"అవుననుకో. అయినా నీతో కూడా వస్తే అదో తృప్తి నాకు"

"ఇదేమైనా కొత్త ఊరా, తెలీనిచోటా? నువ్వుండు నాన్నా నేను వెళ్లొస్తాను"

రామనాథం ఒక్కసారి ఇంట్లోకి, బయటకు చూశాడు. బయటి ఎర్రటి ఎండ కళ్ళల్లో పొడుస్తోంది. వెళ్ళలేడు తను! వెళ్తే ఆ ఎండ దెబ్బ తినేస్తాడు. ఇంత ఎండ తట్టుకోవటం ఈ వయసులో కష్టం.

"మంచిదమ్మా...జాగ్రత్తగా వెళ్ళిరా! అడిగిన ప్రశ్నలన్నిటికీ జాగ్రత్తగా సమాధానం చెప్పు! జవాబు తెలీకపోతే తెలీదనేచెప్పు. అంతేగానీ ఊహించి నోటి కొచ్చిన జవాబు ఏదో ఇవ్వకు. బోర్డు మెంబర్లంతా నీకన్నా తెలివైనవాళ్ళన్న సంగతి మర్చిపోకు. వాళ్ళకు నీ జవాబు కన్నా, నీ నిజాయితీయే కావాలన్నది గుర్తుంచుకో"

"చాలు నాన్నా! ఇదంతా నాకు తెలుసు గదా" అంటూ జవాబిచ్చింది సుశీల.

అపుడొచ్చింది సుజాత పక్క గదిలోంచి, "అయిందే నీచీర సింగారింపు? ఈ ఇంటర్వ్యూకు వెళ్ళవేమో నను కొన్నాను" నవ్వుతూ వేళాకోళం ఆడింది అక్కను.

"వెళ్ళకపోతే ఎలాగే? ఎవరెస్టు ఎత్తు, పసిఫిక్ లోతు ఆ బోర్డు మెంబర్లకు ఎవరు చెప్తారు పాపం"

"ప్రతిసారి వాటికి అడుగుల్లో జవాబు లిస్తున్నావుగదా, ఈసారి పద్ధతి మార్చి చూడవే, ఫలితం దక్కుతుందేమో"

"అదే ఆలోచిస్తున్నా! ఎవరెస్టు ఎత్తు నాకందని ఈ ఉద్యోగం అంత ఎత్తులో ఉందంటాను! పసిఫిక్ లోతు ఈ దేశంలోని నిరుద్యోగులనిరాశ అంతగా ఉందంటాను. సరిపోతాయా చెప్పు జవాబులు'' నవ్వే సింది సుశీల.

"వేళాకోళాలు మానండే. ఉద్యోగానికి ఇంటర్వ్యూ అంటే ఎంత జాగ్రత్తగా ఉండాలి. ఇలా నవ్వుకొంటూ వెళ్తే మూడ్ సరిగ్గా ఉండక, సమయానికి ఏ జవాబూ తట్టక..." ఉద్యోగం రాక పోవచ్చుననే మాట అనలేక ఊర్కొండి పోయాడు రామనాథం.

''వెళ్ళొస్తానానాన్నా'' అంది సుశీల.

"పోనీ, సుజాతను తీసుకెడతావా నీతో?''

"నీది మరీచాదస్తం నాన్నా! ఎందర్ని పిలిచారో తెలీదు గదా ఇంటర్వ్యూకు. ఎంతసేపు అవుతుందో తెలీదు. ఈ మాత్రం దాన్నికి దీన్నికూడా తీసుకెళ్ళటం దేనికీ...." అని ఆగిపోయింది సుశీల.

"నీ ఇష్టంతల్లీ...వెళ్ళిరా" అన్నాడు రామనాథం.

"క్షేమంగా వెళ్ళి లాభంగా తిరిగిరా. బెస్టాఫ్ లక్" సుజాత మనసారా అంది.

సుశీల కాలికి తొడుక్కొన్న జోళ్లు విప్పి, ఒక్కడుగు ముందుకేసి తండ్రి కాళ్ళకు దణ్ణంపెట్టింది.

"ఏంటమ్మా ఇది...దేవుడికి దణ్ణం పెట్టుకొని వెళ్ళాలిగానీ...."

"ఇన్నిసార్లూ ఆ దేవుడికి దణ్ణం పెట్టాను. ఏ ఉద్యోగమూ రాలేదు.



## మధురమైన రుచులన్నీ ప్రియలోనే వున్నయ్!

priya

మీరు కోరుకొనే రకరకాల పచ్చళ్ళు మీ కందిస్తుంది-ప్రియ. మరపురాని రుచిరానుభూతులతో రూపొందినవే ప్రియ పచ్చళ్ళు. ఈనాడే మీ ప్రియను మీ ఇంటికి తీసుకు వెళ్ళండి.

**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI MARKETING
PRIVATE LIMITED

**ఎంతో రుచి... ఎంతో రుచి... - ప్రియ**

Kiron/PF/833

ఈసారి కనిపించేదేవుడివి, జన్మనిచ్చిన తండ్రివి నీకు దణ్ణంపెడుతున్నాను. ఉద్యోగం వచ్చితీరుతుందనే నమ్మకం నాకుంది"

రామనాథం ఏమీ అనలేకపోయాడు. తన ఆశీర్వాదంలో బలం లేకపోవచ్చు. కానీ అమ్మాయికి ఆ ఉద్యోగం మాత్రం తప్పనిసరిగా వచ్చి తీరాలి. రాకపోతే...

భవిష్యత్తుపట్ల భయం అతన్ని క్షణం వణికించింది.

"వస్తా నాన్నా! వెళ్ళి రవ్వంతసేపు నడుంవాల్చు! సాయంత్రానికి కోలుకుంటావు! నా గురించేం బెంగపడకు. ఉద్యోగం ఇదేవస్తుంది! ఇది రాకపోతే."

"పోనిద్దూ ... వెధవ ఉద్యోగం! క్లర్కు ఉద్యోగం రాకపోతే పరీక్షలురాసి కలెక్టర్‌గిరీ సంపాదించుకొంటాం! అంతే గానీ నిరాశపడతామా?"

"అంతే! ఈ ఉద్యోగం ఇవ్వారా ఈ ప్రభుత్వానికి నా బాధ ఇంతటితో తీరుతుంది! ఇవ్వరా, చచ్చారన్నమాటే! ఇచ్చేంతవరకూ వాళ్ళను పీక్కుతినెయ్యనూ"

రామనాథం నవ్వాడు. సుశీల సరదాగా మాట్లాడుతోందేగానీ,ఆమె గుండెల్లో ఆదుర్దా నిండుగా ఉండివుంటుందని ఆ తండ్రికి తెలుసు.

సుశీల ఇంటిగడప దాటింది. మెట్లు దిగింది. బయట రోడ్డుమీద ఎండ చురుక్కుమనిపిస్తోంది. కళ్ళకు చెయ్యి అడ్డం పెట్టుకుని సుశీల అడుగులువేయనారంభించింది.

గబగబా అడుగులువేస్తూ వెడుతున్న కూతుర్ని చూస్తూ అలాగే నిలబడ్డాడు రామనాథం. కూతుర్ని ఇలా ఉద్యోగానికి పంపటం అతనికి, ఇష్టంలేకపోయినా తప్పనిసరి అవుతోంది. ఆ ఉద్యోగం దక్కి, చేతిలో నాలుగురాళ్ళు పడితేతప్ప కుటుంబం గట్టునపడే అవకాశంలేదు. ఒకటి రెండేళ్ళు ఉద్యోగంచేశాక అప్పుడు పెళ్ళిప్రయత్నాలు ఆరంభించి ఓ అయ్య చేతిలో పెట్టేసాడు సుశీలను! ఆతర్వాత సుజాత సంగతీ, గోపీ సంగతీ ఆలోచించుకోవచ్చు...అనుకుంటూ మెట్లు ఎక్కాడు.

ఒక్కొక్కమెట్టు ఎక్కుతోంటే ఎక్కడో గుండెలోతుల్లో ఎక్కడో ఏదో కలుక్కుమంటున్న బాధ. మానసికమైన నొప్పి కాదది-పూర్తి శారీరకమే!తెలుస్తూనే వుంది ఇన్నేళ్ళుగా రాత్రింబగళ్ళు ఏ విశ్రాంతీ లేకుండా ఏ అలసటా ఎరగనివిధంగా పనిచేస్తూవచ్చిన గుండె, ఇక ఈ సిరలు, ధమనులతో కలిసి పోటీపడుతూ పని చేయటం తనవల్లకాదని మొరాయిస్తోంది. ఆ సంగతి ఇపుడు ఇంట్లో చెప్పగలవీలు తనకు ఆర్థికంగానూ లేదు, శారీరకంగానూ లేదు.

అందుకే-

గుండెలను కూడగట్టుకొంటూ, ఛాతీమీద చెయ్యివేసుకొంటూ ఏదో పర్వతారోహణ చేస్తున్నరీతిలో ఆ మెట్లు నాలుగూ ఎక్కాడు.

లోపలికివచ్చి ఈజీఛెయిర్‌లో కూలబడ్డాడు. నెమ్మదిగా కళ్ళు మూసుకొన్నాడు.

నాలుగైదునిమిషాల తర్వాత సుజాత ఆ గదిలోకి వచ్చింది. తండ్రి ముఖంలో గతంలో కనబడని అలసట ఇపుడు స్పష్టంగా కనిపిస్తోంది.

సుజాతకు కృష్ణ గుర్తొచ్చాడు ఉన్నట్లుండి!

ఇంట్లో గోపీలేదు. అక్క ఇంటర్వ్యూకు వెళ్ళిపోయింది. ఇల్లంతా నిశ్శబ్దంగా

ఉంది. తండ్రికూడా...ఫర్వాలేదు, చెప్ప టానికి ఇదే మంచిసమయం అనిపించింది.

ఒక్కడుగు ముందుకు వేసింది.

కానీ..ఏదో తెలీని సంకోచం, బిడియం ఆమెను వెనక్కుపట్టి ఆపాయి.

'ఇది సరైనపద్ధతి కాదు. మన సంప్రదాయమూ కాదు.

ఇంట్లో అక్క పెళ్ళికి సిద్ధంగా ఉండగా తను వెళ్ళి తన పెళ్ళిగురించి ప్రస్తావించటం ... అన్నివిధాలా అర్థంలేనిదే! పైగా తనకో ఉద్యోగమూలేదు, చదువూ పూర్తికాలేదు. పోనీ అటు కృష్ణకు-అతనికీ ఉద్యోగంలేదు! ఎలా తేగలదు ఇపుడు పెళ్ళి గురించిన ప్రస్తావన...'

కానీ కృష్ణ పోరు క్రమంగా పెరుగుతోంది.

కనిపించినపుడల్లా అడుగుతాడు - "చెప్పావా మన సంగతి మీవాళ్ళకు?"

తను తల ఊపుతుంది అడ్డంగా-చెప్పలేదన్నట్లు.

"సుజీ...నీకసలు బుద్ధిలేదు! ప్రపంచ జ్ఞానం బొత్తిగా లేదు" అంటాడు కృష్ణ.

"అదేమిటి?"

"మగాడు ముందుకొస్తేచాలు తాళికట్టించుకోవాలని ఆడది తహతహపడే రోజులివి! నేను కదతానని సిద్ధంగావున్నా నువ్వేమో ఇంట్లో చెప్పటానికికూడా ముందుకు రావటంలేదు-చిత్రంగాలేదూ?"

సుజాత నవ్వుతుంది: "మిగిలిన ప్రపంచం కథవేరు, మన కథవేరు. అందరూ ఉద్యోగాల్లో స్థిరపడ్డాక పెళ్ళి గురించి ఆలోచిస్తారు. నీకసలు ఇంకా ఓ ఉద్యోగమేలేదు. నా చదువూ పూర్తికాలేదు. నిన్ను పెళ్ళిచేసుకొని నేనేం సుఖపడతాను? నన్ను చేసుకున్నా





నువ్వెలా పోషిస్తావ్?"

సుజాత ప్రశ్నలన్నీ ప్రాక్టికల్‌గా ఉన్నవే అయినా కృష్ణ వాటికి సూటిగా జవాబు ఇవ్వడు. "ఈ ప్రపంచంలో ప్రేమికులు ప్రేమ ఛోంచేసి బతుకుతారట! మనమూ ఆ పనిచెయ్యలేమా? అయినా సుజాతా ఒక్కమాట...నిన్ను ఈరోజు నా ఇంటికి రమ్మనటంలేదు. కనీసం మీవాళ్ళకు మన సంగతి చెప్పు ఏడాది, రెండేళ్లు-అయిదేళ్ళుకానీ ఎప్పటికైనా నాకో ఉద్యోగం వచ్చి తీరుతుంది కదా-అప్పుడు చేసుకుంటా పెళ్ళి! ఈలోగా నిన్ను కలుసుకున్నపుడల్లా ఏదో తప్పుచేస్తున్న భావం నాకెందుకు? దొంగచాటుగా ఎవరికీ తెలీకుండా ఉండాలనే తపన మనకెందుకు? పెద్దలకు చెబుదాం. పెళ్ళిచేసుకోబోయే ప్రేమికుల్లాగా ధైర్యంగా తలెత్తుకు తిరుగుదాం"

కృష్ణ ఆర్గ్యుమెంటు అలా ఉంటుంది.

అతనన్నది సబబుగానే కనిపించేది సుజాతకు.

నిజమే...ఎలాగైనా అతన్నే చేసుకుంటుంది తను! అతనికీ తనే కావాలి! రేపు తనేం చదువుతుంటో, చదవదో, ఏ ఉద్యోగం అయినా చేస్తుందో చేయదో - ఇవేవీ కృష్ణకు అక్కర్లేదు. అతనికి కావాల్సింది కేవలం తను. అలాటి ప్రేమికుడిని వదులుకోదు తను! తనకు ఆంతస్తులు అక్కర్లేదు, అందలాలు అక్కరలేదు. ఏదో సీదాసాదాగా జీవితాన్ని గడుపుకోగలంత సంపాదన ఉండే ఉద్యోగం తమ ఇద్దరిలో ఏ ఒక్కరికి దక్కినాచాలు!

మరి నిర్ణయం తీసుకున్నాక అది బయటకు చెప్పటానికి మాత్రం సంకోచం దేనికీ?

అందుకే ఈరోజు వెళ్ళి తండ్రికి మాట

మాత్రంగా చెబితే...'చెప్పకుండా, మీకు తెలీకుండా తిరగటం మాకు ఆత్మవంచనగా ఉంటోంది. అందుకే చెబుతున్నాం. మా నిజాయితీని అర్థంచేసుకో! పెళ్ళి చేసుకోగల స్తోమత మాకు సమకూరాక అప్పుడు చెప్తాం, ఆశీర్వదించుదువుగాని' అని చెప్పేస్తే...

సుజాత అడుగు ముందుకువేసింది.

అప్పుడు అదే క్షణంలో రామనాథంకు గుండెల్లో ఉన్నట్లుండి నెప్పి అధికమయింది. తట్టుకోలేని బాధతో గిలగిలలాడుతున్నట్లుగా కదిలాడు ఈజీఛెయిర్‌లో

"అ ... మ్మా ..." రామనాథం మాటలు కష్టంగా బయటకు వస్తున్నాయి. మాటలతోబాటు తెల్లని నురగ నోట్లోంచి బయటకు రానారంభించింది.

సుజాత తండ్రికేసి చూసి ఉలిక్కిపడింది, భయపడింది.

"నాన్నా...నాన్నా..." అంటూ కంగారుగా అటు కదిలింది. ఈజీ ఛెయిర్ లోని రామనాథం అనీజీగా కదులుతున్నాడు. సుజాతకు ఏంచేయాలో పాలుపోలేదు. గబగబా ఇంట్లోకివెళ్ళి ఒక గ్లాస్‌లో నిండుగా నీళ్ళు తెచ్చింది.

"ఈగ్లాసుడు నీళ్ళు తాగు నాన్నా... కొంచెం తేరుకుంటావ్" అంటూ తండ్రి నోటికి దగ్గరగా గ్లాసు తెచ్చింది.

రామనాథం ఆ నీళ్లు వద్దంటూ తల ఊపాడు. నెప్పిగా ఉందన్నట్లు గుండెల మీద నొక్కుకున్నాడు.

"అమృతాంజనం ఏమైనా రాయమంటావా నాన్నా?" ఆతృతతో అడిగింది సుజాత.

"డా...డాక్టర్..."

రామనాథం చెప్పింది సుజాతకు అర్థమయింది - క్షణంలో భయాన్ని పక్కకు నెట్టుకొంది. ధైర్యం చిక్కబట్టుకొంది. బయటకువచ్చి-రిక్షాను పిలిచింది.

జాగ్రత్తగా తండ్రినిరిక్షాలోకి ఎక్కించింది.

గోపి రాగానే హాస్పిటల్‌కు రమ్మని చిన్నకాగితం మీదరాసి తాళానికి తగిలించింది.తండ్రినిపొదివి పట్టుకొనికూర్చుంది.

రిక్షా కదిలింది నెమ్మదిగా. ఏ కొద్దిగా కదిలినా, ఆ ముసలి గుండె ఆడటం ఆగిపోతుందేమోనన్న భయంతో...ఆ రిక్షావాడు నెమ్మదిగా తొక్కసాగాడు.



2

సుశీలకు నడుస్తున్నకొద్దీ ఆ దూరం మరింత పెరుగుతున్నట్లు అనిపించింది. ఇంత ఎండలో ఇంత దూరం నడవటం కష్టమే. ఏ రిక్షా అయినా చేసుకొని ఉండాల్సింది తను! రెండూ రెండున్నర ఇస్తే వచ్చేవాడు...కానీ పరిస్థితి అలాటిది కాదు. రెండు రెండున్నరా అని తేలిగ్గా అనుకోగల స్థితి ఈనాడులేదు తనకు. అందుకే దూరమైనా, భారమైనా అడుగులో అడుగువేయటం.

అయినా ఊరికి ఇంతదూరాన ఏమిటి ఈ ఆఫీసు? ఉన్న ఊరికి, ఉంటున్న ప్రజలకు దూరంగా... ఎక్కడో ఊరికి రెండుమైళ్ళ దూరంలోనా ఆఫీసు భవనాన్ని కట్టేది? 'ప్రజలకు చేరువలో ప్రభుత్వం' అంటారుగానీ నిజానికి

ఎంతదూరంగావుందో ఈ భవనం!ఆఫీసు భవనమే ఇంత దూరమైతే, ఇంకా అక్కడి విధానాలు ఇంకెంత దూరంగాఉంటాయో!

ముఖంమీద పట్టిన చెమట తుడుచుకొంటూ కదిలింది సుశీల.

రోడ్డంతా దాదాపు నిర్మానుష్యంగా వుంది.

రేపు తనకు ఈ ఆఫీసులో నిజంగానే ఉద్యోగం వచ్చేస్తే....రోజూ ఇదే దారిన తన రాకపోకలవుతాయి. అప్పుడు ఓ రిక్షా కుదుర్చుకొంటే, నెలకింత అని రిక్షా వాడికి ఇచ్చేస్తే సరిపోతుంది. రిక్షా ఎక్కి కూర్చుంటేచాలు, వాడు జామ్మని తొక్కుతుంటాడు. తను సింహాసనాన్ని అధిరోహించిన రాణి సైన్యాన్ని పరీక్షిస్తున్నట్టుగా, ఠీవిగా కూర్చుని రోడ్డుపక్క నడిచివెళ్ళే జనాన్నో...రోడ్డుపక్క నిలబడివున్న చెట్లనో లెక్కపెడుతూ కూర్చుంటుంది.

కానీ...ఆ హోదా తనకు రావాలంటే ముందు ఈ ఉద్యోగం రావాలి.

వస్తుందా... రాదా...?

తెలీదు.

ఈ దేశంలో వాన రాకడ, ప్రాణం పోకడేగాదు...ఉద్యోగ సంపాదనకూడా చెప్పలేనిదే అవుతుంది.

చెట్టు తర్వాత చెట్టుగా ఉన్న ఆ రోడ్డుమీద నీడలోంచి నీడకు నడుస్తూ సుశీల ముందుకు వెడుతోంది.

అప్పుడొచ్చి ఆగింది ఆమె పక్కనే ఓ స్కూటర్.

"ఎక్కడికి వెళ్తున్నారు మేడమ్?" చాలా మర్యాదగానే అడుగుతున్నాడు. కానీ ఆ మర్యాదంతా తెచ్చిపెట్టుకున్నది. ఎంత చులకన భావం లేకపోతే ఇలా అడుగుతాడు లిఫ్ట్ కావాలా అని. ఇదేమైనా ఫారినా, కాకపోయినా కనీసం మెట్రోపాలిటన్ సిటియా? ఇక్కడ లిఫ్టు ఇవ్వటం ఏమిటి, కావాలా అని అడగటం ఏమిటి....

వెధవ్వేషం కాకపోతే - అనుకొంది సుశీల.

"ఎండగావుంది. మీకు అభ్యంతరం లేకపోతేనే రండి ... తీసుకెళ్ళి డ్రాప్ చేస్తాను" అన్నాడా వ్యక్తి. అనటంలో మర్యాద ఒలికిపోతోందిగానీ కళ్ళల్లో రౌడీతనం స్పష్టంగా కనిపిస్తోంది.

లేకపోతే పట్టపగలు ... మిట్ట మధ్యాహ్నంవేళ నడిరోడ్డుమీద వెళ్తున్న అమ్మాయిని ఇంత ధైర్యంగా ఎలా అడగగలడు.

'అర్థరాత్రి వేళ నడిరోడ్డుమీద ఆడది ఒంటరిగా వెళ్ళగలిగిన రోజునే ఈ దేశానికి నిజమైన స్వతంత్రం లభించినట్లు' అన్నాడా మహానుభావుడు. చచ్చి బతికిపోయాడుగానీ లేకపోతే, ఇప్పటి ఈ రోడ్డుమీద వ్యవహారాలు, దేశ ప్రజల తీరుతెన్నులు చూసి గుండె పగిలి చచ్చిపోయి ఉండేవాడు అనుకొంది సుశీల.

"రండి మేడమ్...నో ప్రాబ్లం"

"నో..థాంక్స్" అంది సుశీల.అతన్ని తప్పించుకోవాలన్న ఉద్దేశంతో అడుగుల్లో కొంచెం వేగం పెంచింది.

"మీ ఇష్టం" అంటూ అతను స్కూటర్ స్టార్ట్ చేసుకొని వెళ్ళిపోయాడు.

"బతికి పోయాం" అనుకొంది సుశీల.

ఆమె దృష్టి ఇంటర్వ్యూ మీదికి మళ్ళింది'ఏమడుగుతారో ఈసారి!ఒక్కోసారి ఒక్కోరకమైన ప్రశ్నలు! చేసే ఉద్యోగానికి అడిగే ప్రశ్నలకూ సంబంధము ఉండదు. ఆ కనీస జ్ఞానం అయినా లేకుండా ఎలా అడుగుతారో

# ప్రకృతి చెప్పే పాఠాలు!

ప్రకృతి నుండి మనం నేర్చుకోదగ్గవి అనేకం. కొద్దికొద్దిగా కూడబెట్టిదాన్ని ఓ పెద్దమొత్తంగా చేసేనేర్పు కూడా అందులో ఒకటి. ఈ సూత్రాన్ని ఆచరణలో పెట్టడానికి ఉదయతార సహకరిస్తుంది. ప్రత్యేక అవసరాలకు అవసరమైన మొత్తాలను చిన్న చిన్న మొత్తాలుగా కూడబెట్టినే అది పెద్దమొత్తంగా రూపుదిద్దుకొని అవసరం గడపటానికి దోహదకారి అవుతుంది.

నెలవారి ఈ మొత్తాలను ఉదయతారలో మీ బడ్జెట్‌కు అనుకూలమైన చీటీలో దాచుకుంటే దానికి తోడు ఆకర్షణీయమైన డివిడెండ్లు తోడయి ఓ పెద్ద మొత్తంగా రూపు దిద్దుకుంటుంది. ఉదయతారలో పొదుపుచేస్తే అధిక ఆదాయంతోపాటు సత్వర పేమెంటు సమకూరుతుందనితెలిసి ఎందరెందరో సభ్యులయ్యారు. మరి మీరుకూడా సత్వరమే చేరండి. మీకే తెలుస్తుంది.

## ఉదయతారతో పొదుపు మీ ఆర్థికాభివృద్ధికి మదుపు




# ఉదయతార

## ఫైనాన్స్ అండ్ చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

రిజిష్టర్డు ఆఫీసు : 7-75, పటమట, విజయవాడ-6, ఫోన్ : 52065

ఆ బోర్డు సభ్యులు కూడానూ' అనుకొంది.

చదివిన జనరల్ నాలెడ్జ్ బిట్స్ అన్నీ ఒకటొకటిగా గుర్తుచేసుకొంటూనడిచింది.

మూడు రంగుల జెండా హుందాగా ఎగురుతున్న ఆభవనం దగ్గర పడుతోంది. ఆ జెండా నీడలో తలదాచుకునే అవకాశం తనకు దక్కుతుందో లేదో... గుండె నిండుగా ఆశ నింపుకొని మరీ ఆ భవనాన్ని చేరింది.

ఆ భవనం ఆవరణ అంతా సందడిగా ఉంది. ఇంటర్వ్యూకే కాబోలు చాలామంది వచ్చారు. ఒకొక్కరికి అయిదు పది నిమిషాలు అనుకొన్నా - ఈ తతంగం అయ్యేసరికి నాలుగైదు గంటలు పట్టేలాగే ఉంది. 'ఎంక్వయిరీ' అన్న బోర్డున్న చోటుకు వెళ్ళి కనుక్కొంది. ఇంటర్వ్యూ రెండో అంతస్థులో జరుగుతోందని చెప్పాడు అక్కడి క్లర్కు.

మెట్లు ఎక్కనారంభించింది - సుశీల. తీరా అక్కడికి వెళ్లాక తెలిసింది అసలు ఇంటర్వ్యూబోర్డు సభ్యులే ఇంకా రాలేదని. ఈలోగా సర్టిఫికెట్లన్నీ చూస్తున్నారు. వెళ్ళి ... బెంచీమీద కూలబడింది.

క్షణం తర్వాత ఏం చేయాలో తెలీక తలెత్తి చూస్తే ఆమెకు తన వైపే చూస్తున్న ఒకతను కనిపించాడు.

ఒకసారి పరిశీలనగా చూసి తల దించుకొంది.

'ఈ దేశంలోమగాళ్లు ఆడది ఒంటరిగా కనబడితే వదిలేలా లేరు'- అనుకొంది మనసులో.

చేతిలోని పుస్తకం నెమ్మదిగా పేజీలు తిరగెయ్యనారంభించింది.

ఇంటర్వ్యూకి వచ్చినవాళ్ళల్లో కృష్ణ కూడా ఒకడు. నిరుద్యోగపర్వంలో కొట్టుమిట్టాడుతున్న వాడు. ఎలాగైనా ఈ ఉద్యోగాన్ని సంపాదించుకోవాలన్న దీక్షతో ఉన్న కొద్ది సమయాన్ని కూడా పుస్తక పఠనంలో గడుపుతున్నాడు. చదువుతూ చదువుతూ ఏదో ఆలోచిస్తూ తలెత్తి చూశాడు కృష్ణ....ఎదురుగా సుశీల.

ఉలిక్కిపడ్డాడు.

సుశీల ఈ ఇంటర్వ్యూకు వస్తున్నట్లు సుజాత తనతో మాట వరసకైనా చెప్పింది కాదే-అనుకొన్నాడు.

అయినా తనే చెప్పలేదుగా, ఈ ఉద్యోగంకోసం తనూ ఇంటర్వ్యూకు వెళ్తున్నట్లు! ఏమని చెప్తాడు తను-ఎన్ని ఇంటర్వ్యూల గురించి చెప్తాడు. ప్రతి ఉద్యోగ ప్రకటనా తనకోసం వెలువడినట్లు భావించి ఆశపడినరోజులు గతంలో ఉండేవి.ఇపుడలాటివిలేనేలేవు. నిర్లిప్తంగా, నిరాశతోనే ఆఫీసుల గడపలు తొక్కుతున్నాడు తను.

తనకేసి సుశీల చూస్తుండటంతో తల వంచుకున్నాడు కృష్ణ. తనెవరో ఆమెకు తెలీదు. తమ సంగతి చెప్పమంటేనే భయపడుతూ ఎప్పటికప్పుడు వాయిదాలు వేసుకొంటూ వస్తున్న సుజాత-తనను తీసుకెళ్ళి పరిచయంచేసే ప్రసక్తి ఎక్కడిది? అందుకే ఆ ఇంట్లో వాళ్ళంతా తనకు తెలిసినా, తనెవ్వరోవాళ్ళకు తెలీదు. తను ఆ కుటుంబానికి ఎంత చేరువో కూడా వాళ్ళకు తెలీదు.

ఈ ఉద్యోగం సుశీలకొస్తే..:ఆమెకు ఎక్కడో పెళ్ళి కుదురుతుంది. తర్వాత సుజాతకు గ్రీన్‌లైట్ లభిస్తుంది!

సుశీలకు కాకుండా ఈ ఉద్యోగం తనకే వచ్చినా ... అదీ మంచిదే! వెంటనే సుజాతను పెళ్ళిచేసుకోగల అవకాశం లభిస్తుంది.

తమలో ఏ ఒక్కరికికాక మరెవ్వ

రికో లభిస్తే...ఏంచేస్తాడు? మరో కాల్ లెటర్ కోసం నిరీక్షణ ఆరంభిస్తాడు! అంతకుమించి చెయ్యగలిగేది ఏముంది?

కృష్ణ చిన్నగా నవ్వుకొన్నాడు.

అప్పుడే సరిగ్గా సుశీల తలెత్తి అతని కేసి చూసింది.

తన ఆలోచనలకు తనలో తాను నవ్వుకొంటున్న కృష్ణను చూస్తే సుశీలకు చికాగ్గా అనిపించింది. ఒక్కసారి ముఖం చికాగ్గా పెట్టింది.

అది చూశాడు కృష్ణ.

ఇబ్బందిగా అనిపించటంతో లేచాడు. ఆ హాల్లోంచి బయటకొచ్చి మెట్లు దిగాడు.

కాంటీన్ కేసి నడిచి ఒక టీ తాగాడు. మళ్ళీ వెళ్ళి పైన బెంచీమీద కూర్చుందా మనిపించినా... అది మంచిదికాదనిపించి ఆఫీసుముందున్న లాన్‌లోకి చేరాడు. లాన్‌లో కాగితంపువ్వు చెట్లు నీటుగా కట్‌చేసి పెట్టినవి ఎన్నోవున్నాయి. ఒక దాని కిందకు చేరాడు. పుస్తకం తెరిచాడు. పుస్తకంలోంచి సుజాత నెమ్మదిగా అతన్ని పలకరించింది నవ్వుతూ.

కృష్ణ ఆలోచనలు సుజాతవైపు మళ్ళాయి--'ఏంచేస్తూ ఉంటుందో ఇపుడు' అనుకొన్నాడు.

బహుశా ఇంట్లోనే ఏమంచంమీదో పడుకొని ఏ పుస్తకమో చదువుతూ వుండి ఉంటుంది. పొరబాటునైనా తన గురించి ఆలోచిస్తుందో లేదోగానీ....తను మాత్రం సుజాత గురించే నిత్యం ఆలోచిస్తూ ఉంటాడన్న సంగతి సత్యం...

సుజాత గురించి ఆలోచనల్లోపడ్డాడు కృష్ణ. కానీ, ఆక్షణంలో సుజాత అక్కడ ఆస్పత్రిలో ఒంటరిగా - చావు బతుకుల్లో వున్న తండ్రిని రక్షించుకోవటానికి ఎన్ని అవస్థలుపడుతోందో-అతని ఊహకందే విషయం కాదది!

రిక్షాలో తండ్రిని ఆస్పత్రికి తెచ్చిన సుజాత వెళ్ళి ఎమర్జన్సీలో తండ్రి విషయం చెప్పింది.

డ్యూటీ డాక్టర్ తప్ప ఇంకెవరూ లేరక్కడ! ఆయన జాగ్రత్తగా పరిశీలించి చూశాడు బ్లడ్ ప్రెషర్ చెక్ చేశాడు. పల్స్ రేట్ చెక్ చేశాడు.

"మంచిపని చేశారు. వెంటనే తీసుకు రావటంతో పెద్ద ప్రమాదం తగ్గింది" అన్నాడు డాక్టర్.

"ఏమయిందండీ అసలు?" అని అడిగింది సుజాత.

"హార్ట్‌ఎటాక్" అన్నాడు డాక్టరు నింపాదిగా.

తను మనసులో ఊహిస్తూవచ్చిందే అయినా డాక్టర్ అదే అనేసరికి సుజాత, భయపడింది. బతికి బయటపడతాడా తండ్రి...? ఆమె మనసులోని సందేహాన్ని అర్థం చేసుకొన్నట్లుగా అన్నాడు డాక్టర్ - "ఏం ఫర్వాలేదు...హీ విల్ బీ ఆల్ రైట్"

సుజాత కొంచెం తేరుకుంది. తండ్రికి ఆ డాక్టరు ఏదో ఇంజక్షన్ ఇచ్చాడు. రెండు మాత్రలుకూడా మింగించాడు.

"నిద్రమాత్రకూడా ఇచ్చాను. కొంచెం సెటిలవుతారు" అన్నాడు డాక్టరు. "మీరు అదృష్టవంతులనాలి" అని చెప్పి నవ్వాడు.

"థాంక్యూ సర్" అంది సుజాత కృతజ్ఞతతో.

అరగంట గడిచాక గోపీ వచ్చాడు.

"ఇంటికెళ్ళి చూస్తే ఆ కాగితం కనిపించింది. వెంటనే ఇటు వచ్చా" అన్నాడు సంజాయిషీ చెప్తూ.

"గొప్ప పనిచేశావ్ ! ఎంతావాన

లేకుండా అలా బలాదూర్ తిరగటండేనికి? ఇంటిపట్టున పడి ఉండొచ్చుగదా! ఏ క్షణానికి ఏం అవసరం వస్తుందోనన్న జ్ఞానమైనాలేదు" సుజాత విసుక్కొంది.

"ఇలా జరుగుతుందని కలగన్నామా ఏం?"

తలెత్తిచూసింది సుజాత గోపీకేసి. వాడనేదీ నిజమే.

"సర్లే...వెళ్ళి అక్కకు చెప్పిరా ఈ సంగతి. తెలుసుకదా, ఇంటర్వ్యూకు వెళ్ళిందని" అంది సుజాత.

గోపీ తలవూపి, అడుగు ముందుకు వేయబోతోంటే, తమ్ముడిని ఆపుతూ అంది సుజాత-"వద్దులే...నువ్వు ఇక్కడే ఉండు నేనే వెళ్ళొస్తా. జాగ్రత్తగా చూస్తుండు"

తండ్రికి ఇలా అయినపుడు దగ్గర్లో తను లేకపోయాననే అన్న గిల్టీకాన్షస్‌తో మారేమీ పలకలేదు గోపీ. అక్క చెప్పిన దానికి తల వూపాడు.

హాస్పిటల్ కారిడార్ అంతా దాదాపు నిశ్శబ్దంగా ఉంది. అపుడపుడూ ఎవరో రోగి ఖంగున దగ్గుతున్న చప్పుడు ఒకటే ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తోంది.

ఊరికి ఆ చివర ఎక్కడో ఉంది ఆ ఆఫీసు. గోపీని పంపటమే తేలికైనపని. ఏ రిక్షాలోనో, ఏ సైకిల్‌మీదో వెళ్ళివచ్చేస్తాడు. కానీ...తండ్రి పరిస్థితి ఎలా ఉంటుందో తెలీదు. ఎన్నాళ్ళకు ఈ ఆస్పత్రి బందిఖానాలోంచి బయటపడతాడో తెలీదు తను...మళ్ళీ ఎప్పుడు ఈ డ్యూటీలోంచి విడుదల అవుతుందో అదీ తెలీదు. ఆ సంగతి వెళ్ళి కృష్ణకు చెప్పటం మంచిది. లేకపోతే తనకోసం ఒకటే ఎదురుచూస్తుంటాడు-అనుకొని ఆ ఎండలో బయలుదేరింది సుజాత.

సుజాతకు మెదడంతా మొద్దుబారినట్లుగా ఉంది. ఒకటే టెన్షన్ ఆమెను పట్టి పీడిస్తోంది. వేళగానివేళ ఇది. ఇలాటి సమయంలో కృష్ణ దొరుకుతాడా... గతంలో ఎప్పుడూ ఇలా అతనిఇంటికి వెళ్ళనేలేదు. ఇప్పుడు వెళ్ళి ఈ సంగతి చెప్పి, ఉంటే కొంచెం ఆర్థికంగా కూడా సాయపడమని అడగటం మంచిదనుకుంది.

కృష్ణ ఏదో మాటల సందర్భంలో చెప్పిన గుర్తులు మననం చేసుకొంటూ అతను ఉండే వీధికిచేరి అక్కడ అతని గది గుర్తుపట్టగలిగింది.ఆమెకంటే ముందుగానే దురదృష్టం అక్కడికి చేరుకొన్నట్లు ఆ గది తలుపుకు పెద్ద తాళంవుంది.

దీర్ఘంగా నిట్టూర్చింది సుజాత.

ఇక మిగిలిందంతా అక్కకు చెప్పటమే! వెళ్ళి అక్కకు ఆ సంగతి చెప్పేస్తే తన నిర్ణయం ఏమిటో తను తీసుకొంటుంది-అనుకొంటూ రిక్షా ఎక్కింది.

ఆ ఆఫీసు గేటుముందు రిక్షాదిగి లోపలికి వెడుతోంటే, ఆ చెట్టునీడన కూర్చుని చదువుకొంటున్న కృష్ణ కనిపించాడు సుజాతకు. అతనికోసం ఎక్కడ వెతికింది తను. అతను ఇక్కడ ఈ మూల ఉన్నాడు. ఎక్కడో వెతికితే ఎలాకనిపిస్తాడు మరి....?

అయినా ఇక్కడ...ఈ ఉద్యోగానికే వచ్చాడా కృష్ణ కూడా?

వెళ్ళి అతనిముందు నిలబడింది. తలెత్తి చూశాడు.

"నువ్వా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును మహాశయా! నువ్వు కనిపించకపోతే ఏంచెయ్యను! వెతుక్కుంటూ బయలుదేరాను. అల వైకుంఠపురములో, నగరిలో, ఆ మూల సౌధంబుదాపల అన్నట్లు ఇక్కడ తేలావు"





"మీ అక్కకోసం వచ్చావా?"

"అక్కను చూశావా నువ్వు?" ఆత్రంగా అడిగింది సుజాత. "పద వెళదాం...మా నాన్నకు హార్ట్ ఎటాక్ వచ్చింది. ఆస్పత్రిలో చేర్పించాను"

కృష్ణ నివ్వెరపోయాడు-"అరె...ఎలా ఉంది ఇప్పుడు?"

"ఫర్వాలేదు. ఆ సంగతే అక్కకు చెప్దామని...." ఆగింది సుజాత.

కృష్ణ క్షణం ఆగి అన్నాడు "ఇపుడు చెప్పటం అవసరమా...ఆలోచించు! ఎలాగైనా ఇపుడు బాగానే ఉందంటున్నావ్. ఆ మాత్రానికి నువ్వు చెప్పటం, తను బెంబేలుపడి ఇంటర్వ్యూ పాడుచేసుకోవటం...పోనీ, ఒక పనిచేద్దాం. నువ్వు వెళ్ళిపో! అవకాశం చూసుకొని నేనే చెప్తా ఆ సంగతి"

"నీకెలా తెలిసింది ఆ సంగతి అని అడిగితే?"

"నువ్వు చెప్పావనీ, నువ్వు నాకు ఫలానా ఫలానా అని కూడా చెప్పేస్తాను. పనిలో పనిగా కలిసివస్తుంది ... ఏమంటావ్?" నవ్వుతూ అడిగాడు కృష్ణ.

సుజాతకూ అదే బాగుందనిపించింది.

"అలాగే చేద్దాం" అంటూ "మరి నేను వెళ్తా-హాస్పిటల్లో ఉండటమే మంచిది గదా" అంది సుజాత.

"హాస్పిటల్లోకాదు - మీ నాన్న దగ్గర ఉండటం మంచిది" అని నవ్వాడు కృష్ణ. "రా, కాఫీ తాగి వెళుదువుగాని. కంగారు కొంచెం సర్దుకొంటుంది" అంటూ కాంటీన్ వైపు దారితీశాడు.

కాఫీ తాగాక సుజాతకు కొంచెం ధైర్యం కలిగినట్లుగావుంది. అప్పుడు చెప్పింది - "నాన్నకు ఇలావుంది. బహుశా వారం పదిరోజులపాటు కలపటం కుదరదేమో"

"అలా ఎందుకు? ఇప్పుడు మీ అక్కకు చెప్పాగదా - ఆ పరిచయంతో ఒకటి రెండుసార్లు ఆస్పత్రికి వస్తాను. మీ నాన్నను చూసినట్లుగానూ ఉంటుంది. ఇటు నీతో మాట్లాడే అవకాశమూ ఉంటుంది''

క్షణం ఆగి అంది సుజాత-"అక్కతో ఇప్పుడే మన సంగతి ఏమీ అనకు! ఇది సరైన సమయంకాదు. నెమ్మదిగా నేనే చెప్తాను. ఈ ఉద్యోగం గనక నీకొస్తే... త్వరగా చెప్పే వీలవుతుంది."

సుజాత అంటున్న దాంట్లో లాజిక్ కనిపించింది అతనికి - సరేనంటూ తల ఊపాడు.

"నేను తొందరపడుతున్నది పెళ్ళికోసంకాదు. ఈ పిల్లకోసం! ఒకసారి ఓకే అనుకొంటే ఆతర్వాత ఎంత కాలమైనా ఆగేందుకు సిద్ధం"

"అంతేనా...ఓకే అనుకొంటే గేట్లు తెరిచి, గ్రీన్‌లైట్ ఆన్ చేశారంటూ తొందరపడదామనుకుంటున్నావేమోనని" నవ్వింది సుజాత.

"అలాటి ప్రయత్నాలు చెప్పి చెయ్యరు ఎవరైనా. అవకాశంవస్తే చాలు... అమ్మాయిని అమ్మను చేసేస్తా"

"గొప్ప మగాడివేలే"

"కానా ఏమిటి?"

"ఉద్యోగం పురుషలక్షణం అన్నారు నీకు ఉద్యోగం వచ్చేంతవరకూ నువ్వూ వినకిందే లెక్క" నవ్వుతూ అంది సుజాత

కాంటీన్లోంచి నవ్వుకొంటూ బయట కొచ్చారు ఇద్దరూ.

ప్రియురాలిని రిక్షాఎక్కిస్తూ అన్నాడు కృష్ణ - "సుజ్వెళ్ళు! మీ అక్కకు ఈ సంగతి చెప్తాను. వీలైతే నేనూ వచ్చి కలుస్తా హాస్పిటల్లో"





సుజాత తల ఊపింది. రిషా మలుపు తిరిగేంతవరకు అక్కడే ఉండి లోపలికి వచ్చాడు కృష్ణ.

ఇంక అతనికి కింద ఉండబుద్ధికాలేదు. సుశీల ఇంటర్వ్యూ అయినవెంటనే ఆమెకా సంగతి చెప్పాలి - అనుకుంటూ హాల్లోకి వచ్చి బెంచీమీద కూర్చున్నాడు.

ఒకసారి సుశీలకేసి చూశాడు. ఆమె ఇంకా అక్కడే కూర్చుని తదేకంగా చదువుకుంటోంది.

అన్ని కష్టాలు ఒక్కసారే వచ్చి పడతాయంటారు. సుశీలను చూస్తోంటే అదే నిజమనిపిస్తోంది అతనికి.

ఇటు ఇంటర్వ్యూ, అటు తండ్రికి అనారోగ్యం. కూతురికి ఉద్యోగం రాదేమోనన్న బెంగతో తెచ్చిపెట్టుకుని ఉంటాడా మానవుడు ఆ అనారోగ్యాన్ని! ఇప్పటికే వాళ్ళ కుటుంబానికి పోషణ జరగటమే కష్టంగా ఉన్నట్లుంది సుజాత అప్పుడప్పుడు చెప్పేది వింటోంటే. ఇపుడు ఈ దెబ్బ ఒకటి-ఎంత అవుతుందో ఏమో దీనికి ఖర్చు!

చదువుకుంటున్న సుశీలకు ఎవరో తన్ను పరిశీలించి చూస్తున్నట్లు అనిపించి తలెత్తి చూసింది.

ఎదురుగా అతనే!

అతను కృష్ణ అనీ తనకు ఓ అత్యవసరమైన విషయాన్ని చెప్పాలనే అతను ఆలోచిస్తున్నాడనీ ఆమెకు తెలీదు. అందుకే అతని చూపుల్ని అపార్థం చేసుకుంది. 'గుటకలు మింగుతూ ఎలా చూస్తున్నాడో' అనుకుంది చికాగ్గా. ఎక్కడో నిర్జనవనంలోంచి ఒక్కసారి ఈ నాగరిక ప్రపంచంలోకి వచ్చి తొలిసారిగా ఆడదాన్ని చూస్తున్నట్లుగా ఆ జీవుడు ఎంత 'ఇదిగా' చూస్తున్నాడో సుశీలకు కంపరంగా అనిపించింది.

తన ధ్యాసలో తానున్న కృష్ణ ఇదేమీ పట్టించుకోలేదు. అతని ఆలోచనంతా సుశీల కుటుంబానికి అనుకోకుండా ఎదురైన ఇబ్బంది మీదే ఉంది.

ఏం చేస్తారు ఇపుడు వాళ్ళు?

తెలీదు.

తనకు తెలిసినంతలో వాళ్ళకు డబ్బున్న చుట్టపక్కాలుసైతం ఎవరూ లేరు. మరి ఆర్థికంగా ఎవరు ఆదుకొంటారు వాళ్ళను?

అదీ తెలీదు.

మరిపుడు ఏం చేస్తారు?

ఏం చేస్తారు? సమస్యలు చుట్టుముట్టినపుడు, చేయగలిగేది ఏమీలేనపుడు ఎవరైనా ఏం చేస్తారు? దిక్కుతోచక కొట్టుమిట్టాడుతారు. కనిపించని ఆ దైవాన్ని కరుణించమని వేడతారు. కానీ వీరి మొర వినే దేవుడైనా ఒకడున్నాడా?

"ఏం సార్...వినిపించటంలేదా? మీ పేరేగదా కృష్ణ?" అటెండర్ ఒకసారి కదిపాడు కృష్ణను.

కృష్ణ ఉలిక్కిపడి లేచాడు. చేతిలోని ఫైలును, పుస్తకాన్ని సర్దుకొని లోపలికి కదిలాడు.

అప్పుడు టైం ఆరున్నర అయింది.

పగలంతా ఆఫీసులో దీపాలు వెలుగుతూనే ఉండటంతో బయట చీకటి పడుతున్న సంగతి ఎవరూ గమనించనేలేదు- ముఖ్యంగా సుశీల!

ఆమె ధ్యాసంతా అటు ఇంటర్వ్యూమీద, ఇటు కృష్ణమీదా ఉంది-కృష్ణట పేరు. స్వభావానికి తగ్గపేరు. ఆలోచించే పెట్టి ఉంటారు ఆ తల్లిదండ్రులు అనుకుంది ఈసడింపుగా.

ఇంకా దాదాపు ముప్పయిమందివరకు






ఉన్నారు ఇంటర్వ్యూకు. క్లర్క్ వచ్చి అడిగాడు-'ఇంటర్వ్యూలన్నీ ఈరోజే ముగించమంటారా, లేకపోతే మిగిలినవారు రేపొస్తే, రేపు కొనసాగించమంటారా?' అని.

హాలంతా గందరగోళంగా తయారయింది.

"అయిన ఆలస్యం ఎలాగూ అవనే అయింది. ఇంతసేపు ఉన్నవాళ్ళం ఇంకో గంటా అరగంటా ఉండటానికి మాకే అభ్యంతరమూలేదు. ఆ ఇంటర్వ్యూ లేవో ఈరోజే పూర్తిచేసెయ్యండి" అన్నారు చాలామంది.

ఆడవాళ్ళు అరడజనుమందివరకూ ఉన్నా...ఎవరికీ ఆ మాట కాదనే ధైర్యం లేకపోయింది. 'చీకటి పడింది...రేపు పెట్టండి ఇంటర్వ్యూలు' అనగల సాహసం ఎవరూ చెయ్యనేలేదు.

మొత్తానికి ఎంత ఆలస్యమైనా అన్ని ఇంటర్వ్యూలు ఆరోజే జరుగుతాయని



ప్రకటించారు.

సుశీల గడియారంకేసి చూస్తూ కూర్చుండిపోయింది.

లోపలికి వెళ్ళిన కృష్ణ వాళ్ళడిగిన ప్రశ్నలన్నిటికి సంతృప్తికరంగానే జవాబులు ఇచ్చాడు. జవాబులు బాగున్నా ఉద్యోగం లభించటానికి అది అర్హతకాకపోవచ్చునన్న సంగతి అతనికి తెలుసు. తన బాధ్యత తాను పూర్తి చేసిన ధోరణితో ఇంటర్వ్యూ అయిపోగానే బయటకు వచ్చాడు.

సుశీల ఇంకా అక్కడే కూర్చుని ఉంది.

ఆమె ఇంటర్వ్యూ అయిపోగానే వెళ్ళి జరిగిన సంగతి చెప్పాలని నిర్ణయించుకున్నాడు కృష్ణ.

వెళ్ళి బెంచీమీద కూర్చున్నాడు యథావిధిగా.

తలెత్తిన సుశీలకు అతను కనిపించాడు మళ్ళీ. ఉలిక్కి పడింది సుశీల. ఇంటర్వ్యూ అయిపోయినా ఇంకా వెళ్ళడేం ఈ జీవుడు

అనుకొంది. త్వరగా ఈ మనిషి చూపుల పరిధిలోంచి బయట పడాలన్నా వీలు లేకుండా, ఈ ఇంటర్వ్యూ ఒకటి ఏడ్చింది.

అయినా ఏంచూస్తూ ఉండి ఉంటాడు తనలో?

అనుకోకుండా ఆ ప్రశ్న తలెత్తింది సుశీలలో.

ఈ మగవాళ్ళు ఆడాళ్ళలో ఏం చూస్తారు? పెళ్ళి చూపులంటారు. ఆ చూపులు జరిగే గంటా గంటన్నర సమయంలో ఏం వెతుక్కుంటారో తనకు కాబోయే భార్యలో?

తను మగవాడై పుట్టి ఉంటే, ఈ ప్రశ్నకు బదులు చిక్కేది. కానీ తను ఇపుడు ఆ ప్రశ్నకు జవాబు తెలుసుకోలేనంత దూరంలో ఉంది.

పోనీ, ఇంత తినేసేటట్లు చూస్తారు వెళ్ళి ధైర్యంగా "మీ చూపులు నాకర్థమయ్యాయి. మీకేం కావాలో అదీ తెలిసింది. నన్ను పెళ్లి చేసుకొని మీకేం కావాలో అది పొందండి. సాధికారంగా సొంతం చేసుకోండి'' అని ఏ ఆడదైనా అంటే అమ్మో మళ్ళీ వెనక్కు తిరిగి చూడకుండా పారిపోతారు. వీళ్ళూ వీళ్ళ మగతనమూ తాళి కట్టమనే సరికి తాడు తెంచుకు పారిపోతుంది. ఎంతసేపూ కట్నంమీదో, కన్నెపిల్లమీదో ఆశేగానీ...

సుశీలకు చిత్రంగా అనిపించింది. ఎందుకిలా ఆలోచిస్తోంది తను? తన ఆలోచనలు ఎప్పుడూ దారితప్పి ఎరగవు. ముఖ్యంగా తనకున్న పరిధులూ పరిమితులూ తనకు తెలుసు. అలాటపుడు ఇలాంటి ఆలోచనల్ని చెలరేగనీయటమే తప్పు.

మనసును దిటవు పర్చుకొంది. సుశీల ఆలోచనలకుముక్కుతాడువేసిఇంటర్వ్యూ వైపు మళ్ళించింది.

కానీ... కళ్లు మూసినా తెరిచినా ఎదురుగా కూర్చున్న అవ్యక్తి చూపులు.. ఆమెను నిలవనీయటంలేదు. చికాగ్గా ఒళ్ళంతా తేళ్లు, పాములూ పాకుతున్నట్టు అనిపించింది సుశీలకు. లేచి వెళ్ళి వేరే చోట కూర్చుందామన్నా కుదరనిస్థితి.

అశాంతిగా కదిలింది సుశీల.

అరగంట గడిచింది.




సుశీలను పిలిచారు ఇంటర్వ్యూకు.

లోపలికి వెడుతోందిగానీ మనసంతా మలినమయి ఉంది. పాత ఆలోచనలన్నీ చిత్రంగా దారి తప్పాయి. మనసును కుదుట పర్చుకోవటం కొంచెం కష్టమయింది సుశీలకు.

హైడ్రాలిక్ డోర్ తెరుచుకొని లోపలికి నడిచింది. పొడవైన రౌండ్ టేబిల్. కాన్ఫరెన్స్ హాల్‌లాగ ఉంది ఆ గది. నలుగురు బోర్డు మెంబర్లున్నారు గదిలో.

పాత ఇంటర్వ్యూల అనుభవసారాన్ని, గుండె మూలమూలల్లో ఉన్న ఆత్మవిశ్వాసాన్నీ ధైర్యాన్నీ అన్నీ కూడగట్టుకొని అందర్నీ ఒకసారి విష్ చేసింది సుశీల.

ఇంటర్వ్యూ ఆరంభమయింది.

వాళ్ళు అడిగిన ప్రశ్నలకు తోచినంతలో సరైన సమాధానాలే చెప్పింది

సుశీల. ఇంటర్వ్యూ ముగియగానే బయటకొచ్చి హాల్లో ఉన్న గడియారంకేసి చూసింది. తొమ్మిదయింది.

ఎక్కడా ఇంత ఆలస్యంగా ఇంటర్వ్యూలు ఆరంభించటమూ ఉండదు. ఇంత ఆలస్యం అయ్యేంతవరకూ జరపటమూ ఉండదు. కానీ పద్ధతులన్నీ మారిపోతున్నాయి అనేందుకు ఇదో ఉదాహరణకాబోలు...ఆ మధ్య ఎక్కడో చదివిందితను. సింగరేణిలో కాబోలు. ఉద్యోగం కోసం దరఖాస్తు పెట్టిన వాళ్ళందర్నీ ఇంటర్వ్యూకు పిలిచారట! ఆ తర్వాత అందరికీ పరుగుపందెంపెట్టి వేకెన్సీలు ఎన్ని ఉన్నాయో అన్ని స్థానాలూ ఆ పందెంగెలిచినవారితో నింపారట! ఇంటర్వ్యూ అలా జరగటం..అందే అదో పద్ధతిమరి! "ఎందుకిలా పరీక్ష పెట్టారు?" అని ఎవరో తనలాటి దద్దమ్మ అడగనేఅడిగారు."ఉద్యోగమే అలాంటిది మరి!శారీరకంగా ఎంతో శ్రమ ఉంటుంది. ఆ శ్రమకు తట్టుకోగలవారిని ఎన్నుకోవటానికి ఇదే పద్ధతిగా అనిపించింది" అని జవాబు ఇచ్చారట పెద్దలు.

ఏం జవాబు చెప్పగలం మనం.

సుశీల మేడమెట్లు దిగింది.

ఆఫీసుభవనం ఉన్నంతవరకూ లైట్లు ఉన్నాయి. ఈలోకంలో అలముకొన్న చీకట్లను తరిమివేసే ప్రయత్నాలను ఆ చిన్నిదీపాలు చేస్తూనే ఉన్నాయి.

సుశీల అటూఇటూ చూసింది. తండ్రిగానీ, తమ్ముడుగానీ వస్తారేమో ఆశపడింది.

ఎవ్వరూ కనిపించలేదు.

సరికదా...

అన్ని మెట్లకూపైన ఆ వ్యక్తి...

'మీ నాన్నగారికి గుండెపోటు వచ్చిందట' అని చెప్పటానికి ఆత్రుతపడుతున్న కృష్ణనుచూసి, సుశీల ఆ చీకట్లో...భయపడింది.

అప్పటికే దాదాపు రెండు, రెండున్నర గంటలుగా తనకేసే చూస్తూవున్న ఆ వ్యక్తి...తనకు ఏదైనా కీడు చేస్తాడేమోనన్న భయం ఆమెను ఒక్కసారి ఆవరించింది.

ఆఫీసుగేటు దాటింది.

కనుచూపుమేర దూరంలో నరసంచారం లేదు. ఆఫీసులో ఉండిపోగల వీలులేదు. వెళ్ళే ధైర్యమూ లేకపోయింది.

క్షణం అక్కడే నిలబడింది. ఏ రిక్షాయో, ఆటోయో కనిపిస్తే అది ఎక్కుదామని ఆలోచించింది. కానీ ఏదీ ఎక్కడా లేదు. పగలంతా వందలమందితో కళకళలాడిన ఆ ఆఫీసు అంతా రాత్రి వేళకు నిర్మానుష్యం అయిపోయింది.

సుశీల అలా ఆలోచిస్తోంటే వెనకనుంచి కృష్ణ అడుగులువేస్తూ వస్తూ కనిపించాడు.

సుశీల గుండె బేజారయింది.

చీకట్లోకి అడుగుపెట్టింది. ఏదొక్కడు తనను ఇలా వెంబడిస్తున్నాడుగానీ రోడ్డు మీద ఇంకా జనసంచారం ఉంటుంది. ఈ దేశంలో అందరూ రాక్షసులేకాదు. అందరూ ఆడగాలికి పతనమయ్యే మనుషులేకాదు. సాటి స్త్రీపట్ల గౌరవాదరాలు ఉండే ప్రజలు కోట్లు...కోట్ల సంఖ్యలో ఉన్నారు. ప్రతిరోజూ పేపర్లలో స్త్రీల పట్ల జరుగుతున్న అమానుషాల గురించి వార్తలు వస్తూనే ఉన్నాయి.

నిజమేకానీ, ఆ అమానుషాల వెనక ఉన్న దుర్మార్గులు ఈ దేశంలోని పురుషుల సంఖ్యలో ఎన్నోశాతం? కోటికి ఒకడుకూడా అలాటి దుష్టుడు ఉండడు.

అంటే మిగిలిన వారంతా మంచివారే గదా మరి.

మరి ఇంకా భయపడటం దేనికి?

అయినా దారిపక్క వీధిదీపాలు వెలుగుతూనే ఉన్నాయి; దీపానికీ దీపానికీ రవ్వంత దూరం ఉన్నమాట నిజమే అయినా ఆ కాస్త చీకట్లో ఏదీ జరిగిపోదు.

ఎవరో తన్నెత్తుకుపోయి ...

ఏమీకాదు.

తనవన్నీ అనవసర భయాలు. అకారణమైన ఆందోళన ఇది.

సాటిమనిషి గురించి భయపడటం ఈ దేశ ప్రజలలో ఇటీవల పెరిగిన అనారోగ్య లక్షణం. ఆఖరికి ... ఇన్నాళ్ళకు తానూ దానికి లొంగుతోందన్నమాట. అతను ఈపాటికి వెళ్ళిపోయే వుంటాడు.

సుశీల మలుపు తిరిగి, ఊపిరి పీల్చుకొంది. నాలుగు అడుగులు వేగంగావేస్తే సరిపోతుంది.

ఊహించుకొనే ప్రమాదంనుంచి అవతల పడిపోతుంది. ఆ తర్వాత ఏముందీ సుశీలాదేవి నగర ప్రవేశం. జనారణ్యంలోకి మరో జంతువు ఆగమనం.

నవ్వుకుంది సుశీల.

ఆమె అడుగులు వేగంగా పడుతున్నాయి.

అప్పుడు...

ఆమె ఊహించుకొంటున్న ప్రమాదమే ఉన్నట్లుండి కళ్ళముందు నిలిచిందా అన్నట్లు...ఆ గుబురు చెట్ల పొదల్లోంచి ఎవరో ఒక్కడుగు ముందుకు వేశాడు. సుశీల చెయ్యిపట్టి పొదల్లోకి లాగాడు. జరుగుతున్నది కలా నిజమా...తను ఇంకా ఊహల్లోనే ఉందా అన్న విషయాన్ని ఆమె గుర్తించేసరికి ... సుశీల రోడ్డుకిందకు చేరిపోయింది. ఎవరో తన నోరు మూస్తున్నారు. గొంతు పెగల్చి గట్టిగా అరవాలని సుశీలకు అపుడు అర్థం అయింది. తను అరిస్తే ఎవరైనా వచ్చి తనను రక్షించే అవకాశం ఉంది.

కానీ...

అప్పటికే ఆలస్యం అయిపోయింది.

సుశీల నోరెత్తి అరవటానికి వీల్లేకుండా...ఆమె నోరు నొక్కేశాడు ఆ వ్యక్తి.

కళ్ళతో రోడ్డుకున్న దూరాన్ని కొల్చుకొనే ప్రయత్నం చేసింది సుశీల. భయంలో గుర్తించలేదుగానీ తను ఇపుడు రోడ్డుకు దూరంగానే ఉంది. రోడ్డుమీద పోతున్న ఏదో బస్సుదీపాలకాంతి ఇక్కడికి కనిపిస్తోందిగానీ...అది నిజానికి దూరమే. పారిపోయే ప్రయత్నం చేసే అవకాశం లేనంత దూరం. గట్టిగాగొంతెత్తి అరిచినా ఎవరికీ వినిపించనంత దూరం.

సుశీల ఏం చేయాలా అని ఆలోచిస్తూ ఉండగానే...ఆమె కళ్ళుమూతలు పడిపోసాగాయి. బరువెక్కిపోతున్న కళ్ళు, తేలికైపోతున్న ఒళ్ళు...రెండుమూడు నిమిషాల తర్వాత సుశీల నెమ్మదిగా నేలమీదకు కూలబడిపోయింది.

రోడ్డు మలుపు తిరిగిన కృష్ణకు ఎక్కడా సుశీల కనిపించనేలేదు. ముందు ఆశ్చర్యపోయాడు.

ఆ తర్వాత క్షణం ఆలోచించి నవ్వుకొన్నాడు-తనంటే సుశీల మధ్యాహ్నం నుంచీ భయపడుతున్నట్లుగానే ఉంది. తను ఆలోచిస్తున్నదివేరు, ఆమె అర్థం చేసుకున్నదివేరు.

అందుకే కాబోలు, ఆమె రోజంతా తననుంచి పారిపోయే ప్రయత్నం చేసింది. తనూ అర్థం లేకుండా ఆమెలో




పాల బిస్కట్లు–
నవ్వుతూ, తుళ్లుతూ పెరిగే పాపాయిలకు నేస్తం!






బ్రిటానియా

రుచికరమైన, పుష్టికరమైన బిస్కట్లు

LINTAS BIN MB 10 1710 TL

అనవసరభయాన్ని కల్పిస్తూ తాత్సారం చేశాడు. తను అసలు విషయం చెప్పి వెళ్ళిపోయి ఉండాల్సింది.

అలా చెయ్యక-ఇలా వెంటబడినం దుకు భయపడి ఉంటుంది. మలుపు తిరగ గానే కనబడిన ఏ రిక్షాయో, ఆటోయో ఎక్కి ఇంటికి వెళ్ళిపోయి ఉంటుంది.

పిచ్చిపిల్ల!

తనవల్ల అనవసరంగా ఆందోళనకు గురయింది.

రేపెప్పుడైనా కలిస్తే మనస్ఫూర్తిగా క్షమాపణ కోరుకొని జరిగింది చెప్తాడు. అసలు విషయం విని ఆమె కూడా నవ్వు కొంటుంది.

కృష్ణ ఆలోచనలు మూటకట్టి, తన రూం దారిపట్టాడు. తను ముందుకు వచ్చిన ఆ దారికి రవ్వంత పక్కనే ఏం జరుగుతోందో అతనికి తెలీదు.

కీచురాళ్ల కీచుమంటున్నాయి. చీకట్లు దట్టంగా పరుచుకొని ఉన్నాయి. రోడ్డు మీద పోతున్న బస్సులు, లారీల చప్పుడు తప్ప మరేమీలేదు. నిండుగా సామాన్లు ఉన్న లారీ ఒకటి ఆ భారాన్ని మోయ లేకపోతున్నట్లుగా ఎంతో చప్పుడు చేసుకొంటూ, రోడ్డుతో తన గోడు చెప్పు కొంటూ తన ప్రయాణం సాగిస్తోంది.

ఆ చప్పుడుకు సుశీలకు మెలుకువ వచ్చింది.

మగత నిద్రలోంచి ఉలిక్కిపడి లేచి నట్లుగా ఉంది ఆమె పరిస్థితి. కళ్ళింకా విడివడటంలేదు. ఒళ్ళింకా స్వాధీనంలోకి రావటంలేదు. శరీరంలో అణువణువూ బరువుగా అనిపించింది.

సుశీల నెమ్మదిగా కళ్ళు తెరిచే ప్రయత్నంచేసింది...చీకటి. కటికచీకటి.





ఎందుకు ఆ చీకటి తనచుట్టూ ఆవరిం చిందో గ్రహించేసరికి ఆమె గుండె చెద రింది.

ఒక్కసారి గొంతెత్తి ఏడవాలని పించింది సుశీలకు.

ఏం జరిగిపోయింది?

ఎలా జరిగిపోయింది??

ఏం జరిగిందో చెప్పటానికి అన్నట్లు ఒంటిమీది బట్టలన్నీ చెల్లాచెదురుగా ఉన్నాయి. ఏవీ దాని స్థానంలోలేదు. చీర లోపలిభాగం అక్కడక్కడా ఏదో తెలీని తడి...అసహ్యంగా అనిపించింది సుశీలకు.

నెమ్మదిగా ఆ చీకట్లోనే చీర సరి చేసుకుంది. జాకెట్టు సరిచేసుకుంది.

స్వాధీనంలో లేని ఒంటిని నెమ్మదిగా తన దారిలోకి తెచ్చుకొనే ప్రయత్నం చేసింది.

అప్పుడు గుర్తొచ్చింది సుశీలకు జరి గిందంతా పూర్తిగా...ఏమి ఆలోచించింది తను?

ఈ దేశంలో దుర్మార్గులు తక్కువ అని! ఈ దేశంలో మంచివాళ్ళింకా ఉన్నా రని! ధర్మం నాలుగు పాదాలమీద కాక పోయినా కనీసం ఇంకా మనుగడ సాగి స్తోందని! ఆడదంటే గౌరవాదరాలుచూపే మనుషులు ఇంకా ఉన్నారని!

...ఎంత పిచ్చితనం తనది.

ఎంతటి తెలివితక్కువతనం తనది.

మధ్యాహ్నంనుంచి 'వాడు' చెప్తూనే ఉన్నాడు తన చేష్టలద్వారా. తనేరానున్న ప్రమాదాన్ని గుర్తించలేకపోయింది.కాదు గుర్తించింది కానీ...తప్పించుకొనే ప్రయత్నం చెయ్యలేకపోయింది.

కారణాలు ఏవైనా తన నాశనాన్ని తానే కోరి తెచ్చుకొంది.

చీకటిపడితే ఒంటరిగా వెళ్ళగలిగే

రోజులేనా ఇవి! ఆ సంగతి తనకుతెలీదా.. అయినా, మొండిధైర్యం చేసింది. అనుభవించింది.

రోజూ పేపర్లు, రేడియోలు తెలిసో తెలియకో అందర్నీ హెచ్చరిస్తూనే ఉన్నాయి. ఆ హెచ్చరికల్ని తనలాటి చెవిటివాళ్ళు వినలేరు..వినరు. విననందుకు ఫలితం ఇదిగో, ఇలా అనుభవిస్తారు.

రోడ్డుమీద ఇంకో బస్సేదో వెళ్తోంది.

ప్రపంచం అంతా మామూలుగానే ఉంది.

ఒక నిస్సహాయురాలైన స్త్రీ... ఇలా దారుణంగా దెబ్బతినేస్తే...తనే పాపమూ చెయ్యకపోయినా దారుణంగా దెబ్బతినేస్తే-

ఇదిగో...

ఈ కాలం ఆగిపోలేదు. ఈ ప్రపంచం ఆగిపోలేదు. సప్త సముద్రాలు ఉవ్వెత్తుగా ఎగిసిపడలేదు. భూదేవి సిగ్గుతో చీలికలై పగిలిపోలేదు.

ఎందుకు జరగలేదు అదంతా?

తను ఈ ప్రపంచంలో...ఈ సృష్టిలో ఓ పిపీలికం. ఎందరో మనుషుల పద ఘట్టనలకింద నలిగిపోయే ఆ చిన్న చీమ, ఆ అల్పజీవి .... ఎవరితో మొర పెట్టుకొంటుంది - తనకు జరుగుతున్న అన్యాయం! తనూ అంతేనా?

తనకు జరిగిన అన్యాయం, ఎందుకు జరిగిందో ఎవ్వరూ పట్టించుకోరా??

చీకట్లో జరిగే ఈ ఘోరాలన్నీ చీకట్లోనే కలిసిపోతాయా? ఆడదాని ఆక్రోశం ఈ చీకట్లోనే కరిగి పోతుందా?

ఇంత దయలేనిదా ఈలోకం?

ఇంత నిర్దాక్షిణ్యమా ఈ లోకానికి?

సుశీలకు ఒళ్ళంతా నొప్పులుగా అనిపించింది. శరీరంలోని ప్రతి అణువూ... ఏదో తెలిని వ్యధతో, బాధతో తీసుకుంటున్నట్లుగా అనిపించింది.

నెమ్మదిగా లేచింది. కూర్చునే ప్రయత్నం చేసింది. ఎక్కడెక్కడో... ఒళ్ళంతా గీరుకు పోయినట్లు మంటలు. సరిగ్గా కూర్చోలేక పోయింది కూడాను.

చిన్నతనంలో చీకటి అంటే ఎంత భయపడేది తను. ఇందుకే కాబోలు తనకు అంత భయం ఉండేది ఆరోజుల్లో చీకట్లో తన జీవితం ఇలా తెల్లవారుతుందనే కాబోలు అంత జడుసుకొనేదితను!! ఇపుడు ఇంత చీకట్లో ఒంటరిగా కొరివి దెయ్యంలా కూర్చుందితను.

జీవితం క్షణాలలోనే ఎంతమలుపు తిరిగిపోయింది. విశాలమైన రోడ్డుమీంచి లోయల్లోకి దొర్లుకొంటూ పోయే అతి చిన్న రాయిలాగ ఎంత దెబ్బ తినేసింది తను.

ఒకే ఒక్క దెబ్బతో తన్నెంత నాశనం చేశాడు వాడు.

సుశీల... సుశీలకు తనపేరు గుర్తొచ్చింది ఆ క్షణంలో. ఎంతమంచి పేరు సుశీల? ఇపుడేదీ తనకు తగిన పేరు? ఎంత వెతికినా తనకు తగ్గపేరు తెలుగు భాషలోనే ఉండదేమో...

విషాదం ఆమెను నిండుగా ఆవరించింది.

ఏంచేయాలో తెలీని అనిశ్చిత పరిస్థితి ఆమెను అల్లుకొంది.

చీకటి - బతుకులోనిండిన చీకటిలాగ ఆమె చుట్టూ చీకటి.

సుశీల లేచింది. కన్ను పొడుచుకున్నా కనిపించని ఆ చీకటిలో సరిగ్గా పడని అడుగులు వేసుకొంటూ కదిలింది. నెమ్మదిగా రోడ్డెక్కింది. వీధి దీపాలు అంత ఎత్తున వెలుగుతున్నాయి. మనిషి గుండెల్లో నిండిన చీకట్లు కూడా తొల

గించటానికి అన్నట్లు ఆ దీపాలు మనిషి నడి నెత్తిపైన గుడ్డిగా వెలుగుతున్నాయి.

అడుగులో అడుగు వేసుకొంటూ నెమ్మదిగా ఒంట్లోలేని ఓపికను తెచ్చుకొంటూ ముందుకు నడవసాగింది సుశీల. ఆ చీకట్లో ఆమెది ఒంటరి పయనం అయింది.

దాదాపు గంటా గంటన్నర కిందట ఆమె ఒంటరిగా నడపటానికి గుండెల్ని ఎంతో చిక్క బట్టుకోవల్సి వచ్చింది. ఇపుడామెకు ఆ భయంలేదు. మొదటి రాయి తగిలేంతవరకే భయం. ఆ తర్వాత ఆ భయం చిత్రంగా మాయమవుతుంది కాబోలు!!

సుశీల ఇంటికి చేరింది.

మెట్లెక్కి తలుపు తట్టింది.

గోపీ వచ్చి తలుపు తీశాడు.

"ఆలస్యం అయిందేం? ఆస్పత్రికి వెళ్లావా?" అనడిగాడు గోపీ.

సుశీల నివ్వెర పోయింది. ఎలా తెలిసిపోయింది అప్పుడే. కాకుంటే తన వాలకం చూసి ఊహించుకొని అంటున్నాడా ఆమాట. ఏమైనా దాన్ని ఇంకా సాగదీయటం అనవసరం అనుకొంటూ "ఊ" అంది సుశీల.

గోపీ లోపలికి వెళ్ళి పోయాడు.

తలుపువేసి సుశీల తన గదిలోకి వెళ్లింది. ఒక్కసారి అద్దంలోకి చూసుకొంది. అంతసేపు అంతరాంతరాల్లో దాగివున్న బాధంతా ఆ క్షణంలో కన్నీళ్ల రూపంలో ఒక్కసారి పెల్లుబికింది. మంచంమీదపడి భోరున ఏడవసాగింది.

ఆమెను ఓదార్చటానికి అక్కడ ఎవరూ లేరు!

గుండెలవిసేలా ఏడ్చిన సుశీల కొద్దిసేపటికి తేరుకొంది. లేచి బట్టలు మార్చుకుంది. వెళ్లి ముఖం కడుక్కొని వచ్చింది. క్షణం తర్వాత మళ్ళీ వెళ్లి శుభ్రంగా తలంటు పోసుకుంది. ఒంటిభారం కొద్దిగా తగ్గినట్లు అనిపించింది అప్పటికి.



ఒక అరగంటకు ఆమె మంచంమీద స్పృహ తెలీనంతగా నిద్ర పోతోంది.

తెల్లగా తెల్లవారింది.

నిన్నటి ఘోరాలకు నేరాలకు ఒకరోజు చరిత్ర వచ్చేసింది.

నిన్న చీకట్లలో జరిగిన నేరం ఈనాటి వెలుగుతో మరుగున పడింది.

తొమ్మిదీ తొమ్మిదిన్నర ప్రాంతంలో సుశీలకు మెలుకువ వచ్చింది. ఒళ్ళంతా పచ్చి పుండులా ఉంది ఆమెకు.

జరిగింది తల్చుకుంటే ఆమెకు సిగ్గుగా ఉంది. అసహ్యంగా ఉంది. ఇంకా ఈ బతుకు బతకటం దేనికి అన్న ఆలోచన తలెత్తుతోంది.

ఈ దేశంలో విలువలు చిత్రమైనవి. ఈ విలువలన్నీ ఆడవారికోతీరు, మగవారికోతీరు. ఇది పుణ్యభూమి. కర్మభూమి. ఇక్కడ నేరంచేసిన పురుషులకు పాపం అంటదు. పాపమంతా ఇక్కడ ఆడదై పుట్టటంలోనే ఉంది! శీలం, మానం ఇలాటివన్నీ ఆడవాళ్ళకే! మగవాళ్ళ శీలానికి మైల అంటదు. వారికి మానభంగమనేది లేదు. శీలం కోల్పోయిన ఆడది ఇక్కడ కుక్కలు చింపిన విస్తరి. మనిషిని చంపితే ఆ గుర్తులు మిగులుతున్నాయి. హంతకుడికి శిక్ష పడుతుంది.

కానీ...

మానభంగం జరిగితే ఆ ఆడది నోరు మూసుకుంటోంది. ఏ గుర్తులూ లేకపోవటంతో నేరస్తుడు తప్పించుకుంటున్నాడు! మళ్ళీ ఇంకోసారి ఆ నేరమో, కాకుంటే ఇంకా తీవ్రమైనదో చెయ్యటానికి కూడా అతను వెనుకాడటంలేదు.

ఎందుకు జరుగుతోందిలా?

తనలాటి స్త్రీలు నేరాలకు చిక్కి కష్టాలపాలైనా పన్నెత్తి పలకకపోవటమే కారణం దానికి!!

అందుకే నేరస్థుడు కాలరెత్తుకు తిరగగలుగుతున్నాడు!

అయినా తనకు జరిగిన అన్యాయాన్ని పైకి చెప్పుకోవటానికి ఆడదెందుకు జంకుతోంది?

మానభంగానికి గురికావటం అంత పెద్ద పాపమా?

కాలికో వేలికో దెబ్బతగిలితే డాక్టరు దగ్గరకు వెళ్ళటంలేదూ? మందు వేయించుకొని గాయాన్ని మాన్పుకోవటం లేదూ?

నిజానికి మానభంగం కూడా అంతే మరి!

ఎటొచ్చీ గాయం తగలకూడనిచోట తగిలింది. అంతేగదా! తన్ను కొట్టినవాడి గురించి ప్రపంచానికిచెప్పి వాడికి శిక్ష పడేంతవరకు నిద్రపోని జనం ఎందరో ఉన్నారు.

తను...తనూ అంతే...నేరంచేసినవాడిని నిలదీసి అడుగుతుంది. వాడికి శిక్ష పడేంత వరకు నిద్రపోదు తను!!

సుశీల నిర్ణయించుకుంది.

మంచంమీదనుంచి లేస్తోంటే శరీరం అంతా మొరాయిస్తోంది. లేవటానికి నిరాకరిస్తోంది. రోడ్డుపక్క పొలంలో రాళ్ల రప్పలమధ్య జరిగిన ఘోరమేమో అది. ఆమెకు ఒళ్ళంతా గీసుకున్నట్లుగా కష్టంగా ఉంది.

లేచి గదిలోంచి బయటకువచ్చింది.

గోపీ ఆ మూల కూర్చుని ఏదో చదువుకుంటున్నాడు.

సుశీల ఒకసారి ఇల్లంతా కలియజూసింది. ఇంట్లో తండ్రీ, చెల్లెలు లేకపోవటంతో గోపీని పిలిచి అడిగింది, "వీళ్ళిద్దరూ ఏరిరా?" అని.

గోపీ ఆశ్చర్యంగా చూశాడు.




"నువ్వు నిన్నరాత్రి ఆస్పత్రికి వెళ్ళ లేదా?"

"లేదు...ఎందుకు?" అంది సుశీల.

"నాన్నకు నిన్న మధ్యాహ్నం హార్ట్ ఎటాక్ వచ్చింది. తీసుకెళ్ళి ఆస్పత్రిలో చేర్చాం! ఆస్పత్రికి వెళ్ళకపోతే నీకు ఆలస్యం ఎందుకయిందిమరి? అంత ఆల స్యంగా వచ్చావేం?" ఆరాతీస్తూ అడిగాడు గోపీ.

సుశీలకు ఆ ప్రశ్న ఇబ్బందిగా ఉంది. ఏం సమాధానం చెబుతుంది ఆ ప్రశ్నకు?

"ఎక్కడ చేర్చారు? ఎలా ఉంది ఇప్పుడు?"

గోపీ ఆస్పత్రి వివరాలు చెప్పాడు.

"తయారవ్వు-మనం వెళదాం!" అంది సుశీల.

అరగంటలో ఇద్దరూ ఆస్పత్రికిబయలు దేరారు. బయలుదేరటానికిముందు నిన్న రాత్రితనువేసుకున్నబట్టలన్నీ జీపాక్ చేసి పట్టుకుంది సుశీల.

"ఏమిటే అవి?" అనడిగాడు గోపీ ఆసక్తిగా.

"నీకు అనవసరమైన విషయాల్లో ఎక్కువ ఆసక్తి చూపించకు" అంది సుశీల చికాగ్గా.

అక్క ఎప్పుడూ ఇలా మాట్లాడి ఎర గదు. కానీ...ఈవేళ...చిత్రంగా ప్రవ ర్తిస్తోంది అనుకొని ఊరుకున్నాడు గోపీ.

ఆస్పత్రిలో జనరల్ వార్డ్ ప్రాంతం లోనే ఎదురయింది సుజాత. "నిన్న రాలేదేమే?" అనడిగింది సుజాత,అక్కను.

సుశీల జవాబేమీ ఇవ్వలేదు.

కృష్ణ సుశీలతో ఏం మాట్లాడాడో, అక్క అఫెండ్ అయినట్లుంది అను కొంటూ సుజాత ఇంకేమీ అడగలేదు.

తండ్రి మంచంమీద నిస్త్రాణగా పడి ఉన్నాడు. నిన్న మధ్యాహ్నం తనను ఆశీర్వదించి పంపిన తండ్రిని ఇపుడిలా చూడాలంటే సుశీలకు బాధగా అనిపిం చింది. నిజానికి... తనూ అంతేగదా- ఎటొచ్చీ తండ్రి అనారోగ్యం అందరికీ చెప్పుకోదగ్గది. తన అనారోగ్యం చెప్పుకో కూడనిది. చెప్పుకొంటే సిగ్గుచేటుగా ఉండేదీ....

జరిగింది తండ్రికి చెప్పి రవ్వంత సానుభూతి, కాకుంటే రవ్వంత విశ్రాంతి పొందాల్సిందిపోయి ... తానే తండ్రి ముందు ఇలా కూర్చోవాల్సిరావటం....

"ఇంటర్వ్యూ ఎలా చేశావ్?" అంతటి అనారోగ్యంలోనూ ఆ ప్రశ్న! ఆర్థికంగా బాగుంటే అనారోగ్యం ఎవరికైనాఉండదు కాబోలు. తమ ప్రయత్నాలన్నీ ఆర్థికంగా బాగుండాలనే...ఆ ప్రయత్నాలలో భాగం గానే ఇంటర్వ్యూకి వెళ్ళింది...వెళ్ళి...

సుశీల తండ్రి ప్రశ్నకు తల ఊపి ముక్తసరిగా సమాధానం ఇచ్చింది.

"ఉద్యోగం వస్తుందా?" అమాయ కంగా మరో ప్రశ్న వేశాడు తండ్రి.

పేలవంగా నవ్వింది సుశీల. ఆమెకు అర్థం అవుతూనేవుంది తండ్రి ఆ ప్రశ్న లన్నీ ఎందుకు అడుగుతున్నాడో... తనకు గుండెపోటువచ్చి పిల్లలు బెంబేలు పడుతున్నారని, వారికి ఆ ఇబ్బంది కలగ జేయటం దేనికన్న ధోరణితో అడుగు తున్న ప్రశ్నలవి. అంతేగానీ...

సుశీల ముభావంగా ఉండటం, తండ్రి ఆరోగ్యం గురించికూడా ఏమీ అడగక పోవటం సుజాతకు చిత్రంగా అనిపిం చింది.

ఏదో జరిగింది! కానీ... ఏంజరిగిందో తెలిటంలేదు.

సుశీల ఒక పావుగంట అక్కడే

కూర్చుని ఆతర్వాత "మళ్ళీ కనిపిస్తా నాన్నా" అంటూ బయటకు నడిచింది.

సుజాత కూడా వార్డులోంచి బయటకు వచ్చింది.

"గోపీ, నువ్వు నాన్న దగ్గర ఉండరా నేనూ సుజాత అలా వెళ్ళివస్తాం" అంది సుశీల. అది వినగానే సుజాత గుండెల్లో రాయిపడింది. కృష్ణ తెలివి తక్కువగా ఏదో అనే ఉంటాడు. అందుకే కాబోలు ఈ పంచాయతీ అనుకొంది.

ఆస్పత్రి ఆవరణ చాల ప్రశాంతంగా ఉంది. వేపచెట్ల మీంచిగాలి నెమ్మదిగా వీస్తోంది.

సుశీల చేతిలో పాకెట్ ఏమిటో సుజాతకు అర్థంకాలేదు. అందులో ఏముందో మాయలమారి ప్రాణం! అను కొంది. అక్క తన గురించీ, కృష్ణ గురించీ ఏం అడిగినా నిజం చెప్పాలని నిర్ణయించుకొంది.

ఎత్తుగా పెరిగిన వేపచెట్ల వరసల్లోంచి వెడుతూ అడిగింది సుశీల. "చెల్లెలివి. నాకన్నా వయసులో చిన్నదానివి. నిన్ను ఈ ప్రశ్న అడగకూడదనుకో. అయినా అడుగుతున్నా... నీ మనసులో ఉన్నది, నిజం చెప్పు"

సుజాత గుండెల్లో రాయిపడింది.

"అడుగు" అంది.

"అడగటంకాదు, చెపాను విను. ఆడదానికి శీలం అంటే ఏమిటి? నిన్నటి నుంచీ నన్నా ప్రశ్న వేధిస్తోంది. శీలం పోవటం అంటే ఏమిటి? అదీ నాకు అర్థంకావటంలేదు. శీలమంటే సత్ప్రవర్తనే అయితే అదిపోవటం ఏమిటి? పోనీ శీలంకాకుంటే మానం... అది పోవటం ఏమిటి? అసలు మానభంగం అంటే ఏమిటి?"

సుజాత నడుస్తున్నది కాస్తా ఆగి పోయింది.

సుశీల ఏంమాట్లాడుతోందో సుజాతకు అర్థంకావటంలేదు.

"అలా రా, కూర్చుందాం! కూర్చుని మాట్లాడుకొందాం" అంటూ అక్కను పక్కగా తీసుకెళ్ళి ఒక చెట్టుకింద కూర్చో బెట్టింది సుజాత.

"ఎందుకివన్నీ అడుగుతున్నావ్?" అనడిగింది సుశీలను.

"ఏంలేదు! జవాబు తెలిస్తే చెప్పు"

సుజాతకు ఉన్నట్లుండి ఒక సందేహం వచ్చింది. కొంపదీసి ఇంటర్వ్యూలో అడిగారా ఇలాటి పిచ్చి ప్రశ్నలను! ప్రశ్న లడిగేహక్కు అధికారం ఉందిగదాని ఏదంటే అది అడగటమే?

"నాకి ప్రశ్నలకి వేటికీ సమాధానం తెలీదు" నిక్కచ్చిగా అంది సుజాత.

"నాకూ తెలీదు. కానీ... తెలుసుకోవా ల్సిన అవసరం వచ్చిపడింది ... నమ్ము తావో లేదో... నిన్నరాత్రి నేను రేప్‌కు గురయ్యాను. నన్ను ... నన్నెవరో మానభంగం చేశారే సుజాతా..." గుండెల్లో బరువుదించుకొనే ప్రయత్నం చేస్తున్నట్టుగా అంది సుశీల.

సుజాత నివ్వెరపోయింది. ఎక్కడో జరిగినట్లు పేపర్లలోపడేవార్త... ఉన్న ట్టుండి తమ కుటుంబంలోనే చోటు చేసు కోవటం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది.

"ఎలా జరిగిందే?" నెమ్మదిగా అడి గింది సుజాత.

సుశీల-జరిగింది అంతా చెప్పటం మొదలుపెట్టింది.



అంతా విని అడిగింది సుజాత–"మరి నాన్నకు ఈ సంగతి చెప్పలేదేం?''

"చెప్తే ఆయన గుండె పగిలిపోదుటే'' అంది సుశీల.

క్షణం ఆగి అడిగింది సుజాత మళ్ళీ "మరి...ఏం చేద్దామనుకుంటున్నావ్"

"ఏం చెయ్యమంటావ్?"

"చిన్నదాన్ని. నువ్వే అన్నట్లు ఇలాటివాటి గురించి నేనేం చెప్పగలను... అయినా చెప్తున్నా విను. ఇలాటివి బయట పెట్టుకోకపోవడమే మంచిది"

"అదేమిటే"

"అంతేమరి–నీకు తెలీందిగాదు. మన సమాజం ఇంకా ఎంతో ఎదగాల్సి ఉంది. ఇక్కడ మనుషులంతా సంకుచిత స్వభావులు. జరిగింది నీకు అన్యాయమే అయినా నువ్వే దోషివనేంత దౌర్భాగ్యపు లోకం ఇది. శిక్ష నీకే పడాలనే బుద్ధి తక్కువ ప్రపంచం ఇది. ఇలాంటి గుడ్డి, మూగ చెవుడు...అన్నీ కలిసిన లోకంలో ఏదీ చెప్పుకోకపోవటమే మంచిది. జరిగిందేదో జరిగిపోయిందన్నట్లుగా ఊరుకోవటమే తెలివైనపని. నాకు చెప్పి మంచి పని చేశావ్. ఇంకెవరికీ చెప్పకు. జరిగిందేదో జరిగిందనుకొని...ఊరుకుండిపో'' అంది సుజాత.

చెల్లెలు చెప్పేది సబబుగానే ఉందనిపించినా...సుశీలకు అది ఇష్టం లేకపోయింది.

"ఏం తప్పు చేశానని నేను ఊరుకోవాలి, చెప్పు...ఇది నేరమే అయితే నేరస్థుడికి శిక్ష పడాల్సిందేగదా"

"అవుననుకో – నేరస్థుడు ఎవరో, ఏమిటో ఎలా చెప్పగలవ్ నువ్వు? చీకటి వేళ...ఏం జరిగిందో తెలుస్తుందిగానీ... ఎవరు కారణమో ఎలా తెలుస్తుందినీకు?"

సుశీల నవ్వింది "వాడెవడో నాకు తెలుసు. నిన్ననాతోనే ఇంటర్వ్యూకు వచ్చాడు, వాడిపేరు...కృష్ణ" అంది.

సుజాత గుండెల్లో బాంబులు పేలాయి.

విన్నది అబద్ధమా అన్న సందేహం ఒక్కసారి ఆమెకు కలిగిందికానీ...తన చెవులు తననింకా మోసం చెయ్యటం లేదన్న సంగతి ఆమెకు తెలుసు.

సుశీల చెబుతున్నది యాంత్రికంగా వింటోందేగానీ అదేదీ సుజాత మనసుకు పట్టటంలేదు.

'నిన్న నాతోనే ఇంటర్వ్యూకువచ్చాడు. వాడిపేరు కృష్ణ!' అన్న సుశీల మాటలు సుజాత గుండెల్లో ప్రతిధ్వనించసాగాయి. నిన్న మధ్యాహ్నం తను ఇంటర్వ్యూజరిగే చోటుకువెళ్ళింది. అక్కడ కృష్ణను తన కళ్ళతో చూసింది. లేకపోతే కృష్ణ అన్న మాటవింటే ఇంత ఉలికిపాటు ఉండేదిగాదు. ఎవరో శతకోటి కృష్ణల్లో ఒకడు అనుకునేది!

కానీ అలా సర్దుకునే అవకాశం ఇపుడు లేదు.

ఆ ఘోరం చేసిన దుర్మార్గుడు ఎవరో అక్క స్పష్టంగా చెప్తూనేవుంది. తనకూ కృష్ణకుమధ్యనున్న సంబంధం అక్కకు తెలీదుగనుక సరిపోయిందిగానీ లేకపోతే ఈ నిజం అక్క ఇంత తేలిగ్గా చెప్పగలి

గేదీకాదు. తను ఇలా వినగలిగేదీకాదు!

అయినా కృష్ణ అలాచేసి ఉంటాడా?

కృష్ణ తత్వం తనకు తెలీందిగాదు - నోటిజారుడుమనిషి. కానీ కాలుకూడా జారిపోతాడా?

రోడ్డుమీదకలిసి వెళ్తుంటే ఎన్నోసార్లు తనను వేళాకోళం పట్టించేవాడు. "ఏం ఆలోచించావ్ మన సంగతి?" అని అడిగే వాడు.

తను నవ్వేది - "ఆలోచించేందుకు ఏముందీ? నీకు ఉద్యోగం రానీ, అరోజే వెళ్ళి మా ఇంట్లోవాళ్ళతో చెప్తాను!"

"అంటే అంతవరకూ చెప్పవా?"

"ఊహూ చెప్పనుగాక చెప్పను!"

"సరే అయితే! నేనూ చెప్పను. కానీ మీ ఇంట్లో వాళ్ళకుమాత్రం తెలిసేలా చేస్తాను!"

"ఉత్తరం రాస్తావా?"

"ఊహూ..."

"టెలిగ్రాం ఇస్తావా? ఐ లవ్‌యూ అని!"

"లేదు."

"మరేం చేస్తావ్?"

"ఏం చేస్తానా?" అంటూ దగ్గరగా జరిగి చెప్పేవాడు. "పెళ్ళికి తర్వాత చెయ్యాల్సిన పని ముందుచేస్తాను. దెబ్బకు అమ్మగారు ఎంత దాచినా ఆ సంగతి నీ బొజ్జ చెప్పనే చెబుతుంది!" నవ్వుతూ అనేవాడు.

"ఛీ, పాడు!..." అంటూ సిగ్గుపడేది తను.

ఇంకోసారి...

"ఇదిగో సుజాతా-నీకు ఇదే లాస్ట్ వార్నింగ్!"

"దేనికి?"

"మీ ఇంట్లోవాళ్ళకుచెప్పు.ఊఅనిపించు! ఒక్కసారి ఊ అంటే చాలు, ఎన్నేళ్ళయినా ఆగుతాను"

"ఇపుడు ఊ అనకపోతే నష్టం ఏమిటట?"

"ఏమిటా? రోడ్డుమీద అలాచూడొక్కసారి ఎలాటి అందమైన అమ్మాయిలు తిరుగుతున్నారో. ఏ ఒక్క ఆడది ఊ అన్నా చాలు ఎగరేసుకుపోతాను!"

"మా వాళ్ళు ఊ అంటే....?"

"ఆ రంభా ఊర్వశీ తిలోత్తమ... ఎవరొచ్చి కాళ్ళావేళ్లాపడి బతిమలాడినా 'నో' అనేస్తాను. నేను మాటిచ్చాను ఆ మాటకు కట్టుబడి ఉంటాను. ఈ జన్మకు కాల్‌షీట్‌లేదు, నెక్స్ట్‌టైం బెటర్ లక్' అని నచ్చచెప్పి వెనక్కు పంపేస్తాను! ఆలోచించుకో! ఆలోచించుకొని మీ వాళ్ళకు చెప్పు!" అనేవాడు కృష్ణ.

అవన్నీ వేళాకోళాలే అనుకుంది తను. కానీ అవేవీ హాస్యానికి అన్నమాటలు కావని అతిదారుణంగా ఇపుడు నిరూపించి చూపిస్తున్నాడు!

మాటల్లో అన్నది చేతల్లోకి మార్చి అదీ తన అక్కదగ్గరే చేసిచూపించి మరీ తనను ఛాలెంజ్ చేస్తున్నాడు పౌర్భాగ్యుడు!!

సుజాతకు గుండెనంతా ఎవరో కోత కోస్తున్నట్లుగా ఉంది. ఎన్నో ఏళ్లనుంచీ కట్టుకుంటూ వచ్చిన కలలసౌధం ఒక్కసారి బీటలిచ్చి కూలిపోతున్నట్లుగావుంది!

ఏం అనాలో, ఏం అనకూడదో తెలీని అయోమయ పరిస్థితి ఆమెను చుట్టుముట్టింది.

"పదవే....వెడదాం" అంది సుశీల, చెల్లెల్ని తట్టి లేపుతూ. సుజాత నిర్లిప్తంగా లేచింది.

కృష్ణ కొట్టిన దెబ్బ తట్టుకోలేనిదిగా



వుంది. అక్కను శారీరకంగా మానభంగం చేశాడు. తనను మానసికంగా చిత్ర హింస చేశాడు. రాక్షసుడు, నీచుడు - అనుకొంది సుజాత.

ఆస్పత్రి గేటు దాటాక అడిగింది సుజాత, "ఎక్కడికి వెడుతున్నాం ... ఇంటికేనా?"

కాదన్నట్లు తలవూపి అంది సుశీల, "పోలీసు స్టేషన్‌కు"

"కంప్లయింట్ చేస్తావా?" ఆశ్చర్య పోతూ అడిగింది సుజాత.

"చెయ్యకపోతే ఎలా ? నేనెలాగూ నష్టపోయాను. ఈ నష్టం గురించి పోలీసులకు చెప్పి వాడికి శిక్ష వేయించకపోతే రేపు ఇంకెందరో నష్టపోయే ప్రమాదం ఉంది"

"కానీ..." ఆగిపోయింది సుజాత మనసులోని సందేహాన్ని బయటపెట్టాలా వద్దా అన్నట్లు.

"ఫర్వాలేదు. నాగురించి పదిమంది పదిరకాలుగా అనుకొంటారు. ఈలోకం దృష్టిలో నేను మానభంగ బాధితురాల్ని గాను. పతితను అవుతాను...ఫర్వాలేదు. అందులో నా తప్పేమీ లేనప్పుడు దాని గురించి నేను తలవంచుకోవాల్సిన పని ఉందని నేను అనుకోవటంలేదు" సుశీల మాటల్లో తను తీసుకొన్న నిర్ణయం ప్రతిధ్వనిస్తోంది.

సుజాత ఇంకేమీ అనలేదు. క్షణం ఆగి అంది, "నువ్వు ఒకత్తివీ వెడితేనే బాగుంటుందేమో...ఆలోచించు"

చెల్లెలికేసి చూసి అంది సుశీల, "నిజమే ... పెళ్ళికానిదానివి నువ్వెందుకులే అక్కడికి"

"ఛ! నేనన్నది ఆ పద్ధతిలో కాదు. ఆస్పత్రిలో నాన్నదగ్గర ఎవరూలేరుగదా గోపీ ఉన్నా, కూడా ఉండామని..." సుజాత ఆగిపోయింది.

"సర్లే నువ్వుండిపో..నేను వెళ్తాస్తా" అంటూ సుశీల, చెల్లెలి జవాబుకోసమైనా

ఎదురుచూడకుండా ముందుకు నడిచింది. అక్క చేతిలో ఉన్న ఆ పాకెట్ ఏమిటో అపుడర్థం అయింది సుజాతకు.

సుశీల తిన్నగా పోలీసుస్టేషన్‌లోకి నడిచింది.

లోపల ఏం జరుగుతుంటాయో తెలీదు గానీ బయటకుమాత్రం అతి వినయం ప్రదర్శిస్తోంది ఆ పోలీసుస్టేషన్. 'మేము మీ ఆప్తులము, ఆపద సమయాల్లో మా సహాయం పొందండి' అని బోర్డు కూడా ఉంది. ఆఖరికి ఆ సంగతిని వాళ్ళు చెప్పుకోవాల్సివస్తోంది - బోర్డులుపెట్టి మరీనూ!

గార్డు డ్యూటీలో ఉన్న కానిస్టేబుల్ ఆమెను చూసి, "ఏం కావాలమ్మా?" అని గౌరవంతో అడిగాడు.

"ఇన్‌స్పెక్టర్‌గారున్నారా?"

"ఉన్నా"రంటూ అతను సర్కిల్ వుండే రూంకేసి వేలుపెట్టి చూపించాడు.

సర్కిల్ ఇన్‌స్పెక్టర్ ఉండే రూంకు తెర ఒకటి అడ్డం ఉంది. ఆ తెరపైన గోడకు 'నరసింహం, సర్కిల్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోలీస్' అన్న బోర్డుంది.

"వెళ్ళండమ్మా..లోపల ఎవరూలేరు"

సుశీల కర్టెన్‌ను పక్కకుతోసి లోపలికి చూసింది. లోపల సర్కిల్ ఏదో ఫైల్ చదువుకొంటున్నాడు. మనిషి ముఖం గంభీరంగానేవున్నా, చూస్తోంటే మంచివాడేనన్న ఇంప్రెషన్ కలుగుతోంది.

సుశీల, "మే ఐ కమిన్‌సర్'' నెమ్మదిగా అడిగింది.

నరసింహం తలెత్తి చూసి "రండి" అన్నాడు.

సుశీల లోపలికి అడుగువేసింది.

చేతిలోని పాకెట్ పక్కనపెట్టి నెమ్మదిగా అంది-

"కంప్లయింట్ ఇవ్వటానికి సర్- నిన్నరాత్రి...నేను మానభంగానికి గురయ్యాను"

నరసింహం ఉలిక్కిపడ్డాడు "ఈజిట్" అనడిగాడు.

అతని ముఖంలో చెప్పలేనంత ఆశ్చర్యం. 'మీరు చెప్పేది నిజమేనా' అన్న సందేహం.

నిన్న జరిగిందంతా క్లుప్తంగా చెప్పింది సుశీల.

అంతావిని అన్నాడు నరసింహం "మీరు ఇదే కాగితంమీద రాసివ్వండి. అది మీ స్టేట్‌మెంటుగా మేం రికార్డుచేసుకొంటాం...తర్వాత ఇంకోమాట. ఇలా నేను చెప్పకూడదనుకోండి, కానీ తోటి మనిషిగా చెప్తున్నాను. కంప్లయింట్ ఇవ్వటమా మానటమా అనేది మీ ఇష్టం కానీ ఈ విషయంలో ఇంకోసారి ఆలోచించిచూడండి. మీ పెద్దవాళ్ళకు కూడా చెప్పి, వాళ్ళ సలహా తీసుకోండి. ఎందుకంటే...ఇలాటి కేసులు మాకు రావటం చాలాతక్కువ. రేప్ విక్టిమ్‌కు రేపొచ్చే సోషల్ స్టిగ్మా గురించి మీకు తెలీంది కాదు. ఈరోజు ఫిర్యాదురాసిఇచ్చి మేం కేసు బుక్‌చేశాక మాత్రం 'వద్దండీ. పదిమందికి ఇది తెలిస్తే మా పరువుపోతుంది. మా అమ్మాయికి పెళ్ళికాదు' అని రేపు మీ ఇంటిపెద్దలు వచ్చి అడిగితే అపుడు కేస్ క్లోజ్‌చెయ్యటం కష్టం. ఆలోచించి చూడండి...పోలీస్ ఆఫీసర్‌గా కేసు తీసుకోవటం నా ధర్మం. కానీ, చెప్పాగదా, మీ శ్రేయస్సుకోరేవాడిగా సలహా ఇవ్వటం న్యాయం"

"మరి ఏం చెయ్యమంటారు నన్ను?"

"మీపట్ల అన్యాయం చేసినవాడిని

క్షమించమని నేను అనటంలేదు. వాడిని పదిలేద్దాం, మీరు వెళ్ళిపోండి అనీ నేనన టంలేదు. వాణ్ని ట్రేస్‌చేసి తీసుకొస్తాం. ఎంత పలుకుబడి ఉన్నవాడైనా వాణ్ని వదలొద్దు. ఇక్కడికి తీసుకొచ్చి ఏకాలో చెయ్యో తీయించేస్తా. ఇక జన్మంతా మరో ఆడదానికేసి చూసేధైర్యంకూడా చెయ్యలేని స్థితివాడికి కల్పిస్తా ... మీరూ ఈ ఘోరంసంగతి మర్చిపోండి. అది మీకు మంచిది"

సుశీల ఆలోచనల్లో పడించి. అందరూ అదేమాట. ఇకపై జరిగే తతంగం అంతా నీకు ఇబ్బంది కలిగించేదే అన్న సలహా ఇచ్చేవాళ్ళే.

కానీ...నేరం చేసినవ్యక్తి...ఇలా చట్టంచేతికి దొరకకుండా పోవటమేనా? జరిగిన నేరానికి అప్రతిష్ట భయంతో ముసుగుకప్పి నోరుమూసుకుని ఉండి పోవటమేనా?

ఇదేంన్యాయం?

నేరస్తునికి పరోక్షంగా ఆశ్రయం కల్పిస్తున్న ఈ సంఘాన్ని కూడా ఒక్క సారి అదిలిస్తుంది తను. అదే అంది సుశీల.

"మీరు చెప్పింది బాగానేఉంది. కానీ ఐ వాంట్ హిమ్ పనిష్డ్ లీగల్లీ! చట్ట పరంగానే అతన్ని శిక్షించటం మంచిదని నా ఉద్దేశం. నాకు అన్యాయం జరిగిందని తెలిసి ఈ ప్రపంచం నాపట్ల సానుభూతి ప్రకటించనక్కర్లేదు. కానీ ఇలాటి నేరం ఇంకోడు చెయ్యటానికి భయపడేలా చేస్తే చాలు..నా ప్రయత్నం సబబైనదే అను కొంటాను" అంది సుశీల దృఢనిశ్చ యంతో.

"ఆల్ రైట్! రాసిఇవ్వండి, తర్వాత నిన్న మీరు వేసుకొన్న బట్టలు మా స్వాధీనంచెయ్యండి..మిమ్మల్ని కూడా డాక్టర్‌చెకప్‌కు తీసుకెళ్ళాల్సి ఉంటుంది!" అని ఆగి అన్నాడు నరసింహం "చెప్ప లేదని నాపై మళ్ళీ రేపు నిందవెయ్యకుండా చెప్తున్నాను. ఇలాటివి సెన్సేషనల్ కేసులు అవుతాయి. క్రైంరిపోర్టర్లలో ఎవడో ఒకడు దీని సంగతి పసిగడతాడు. రేపో మాపో అన్ని పేపర్లలోనూ ఈ విషయం అచ్చులోవస్తుంది"

"నో ప్రాబ్లం" అంది సుశీల నిశ్చిం తగా.

నరసింహం అందించిన ఆ కాగితాల మీద తను ఇంటర్వ్యూకు బయలుదేరి నప్పటినుంచీ జరిగిందంతా పూసగుచ్చి నట్లు రాసి పెట్టింది.

ఒకసారి దానిని సరిచూసుకొని నర సింహానికి అందించింది సుశీల.

"మీరు ఇక్కడే ఉండండి. నేను మిమ్మల్ని లేడీడాక్టర్ దగ్గరకు పంపిస్తా" అంటూ బయటకువెళ్ళి నరసింహం సబ్ ఇన్‌స్పెక్టర్‌కేదో ఆర్డర్ ఇచ్చాడు.

"మీరు చెప్పినట్లు నిన్న ఇంటర్వ్యూ కువచ్చిన అందరి పేర్లు, ఫొటోలు, అడ్రసులూ తెప్పిస్తున్నాను. అందులో..మీరు దోషిని గుర్తుపడితే ... మిగిలినదంతా క్షణాలమీద పని" అన్నాడు నరసింహం.

కానిస్టేబుల్‌చేత టీ తెప్పించాడు. సుశీల టీ తాగుతోంటే, ఈ దేశంలో నేరాలు ఘోరాలు ఎలాజరుగుతున్నాయో, ఆడవాళ్ళంటే మగవాళ్ళకి చులకన ఎందుకయిందో అన్నీ నెమ్మదిగా చెప్ప నారంభించాడు నరసింహం.

అరగంట తర్వాత ఓ కానిస్టేబుల్ ఆ ఆఫీసునుంచి నిన్న ఇంటర్వ్యూకు వెళ్ళిన వాళ్ళ ఫొటోలు, అడ్రసులు తెచ్చాడు. అన్నీ చూసి సుశీలకృష్ణ ఫొటో



తీసి బయట పెట్టింది పేదేనండీ అంటూ.

నరసింహం కృష్ణ అడ్రసు నోట్ చేసుకొన్నాడు. ఇంకో కానిస్టేబుల్‌ను ఇచ్చి సుశీలను లేడీ డాక్టర్ దగ్గరకు ఎగ్జామినేషన్‌కు పంపాడు.

సుశీల అటు వెళ్ళగానే ఇటు జీపులో కృష్ణ అడ్రసు వెతుకుతూ బయలు దేరాడు నరసింహం.

తలుపు తడుతున్న చప్పుడు వినిపించి కృష్ణ బయటకు వచ్చి తలుపు తీశాడు.

ఇంటిముందు పోలీసు జీపు! ఇద్దరు కానిస్టేబుల్స్, ఒక ఇన్‌స్పెక్టర్. కృష్ణ నివ్వెరపోయి నిలబడ్డాడు, ఏంజరిగిందో అర్థంకాక.

"కృష్ణ అంటే నువ్వేనా?"

"అవునండీ"

నరసింహం కృష్ణకేసి చూశాడు ఒంటి మీద చిన్న టవల్ తప్ప ఇంకేమీలేదు. అడుగు ముందుకువేసి గదిలోకి వెళ్ళి చూశాడు. గదిలో ఒక జత బట్టలు దండెం మీద వేలాడుతున్నాయి. ఒక చాప దానికి ఒక పక్కన కొన్ని దిన పత్రికలు...

"బయలుదేరు" అన్నాడు నరసింహం.

"ఎక్కడికి? దేనికి?" కృష్ణ భయం భయంగా అడిగాడు.

"పోలీస్‌స్టేషన్‌కు. నిన్న నువ్వు చేసిన నేరం బయట పడింది. ఆవిడ కంప్లయింట్ చెయ్యదు, తప్పించుకో వచ్చనుకొన్నావ్ రాస్కెల్! కానీ ఆవిడ నీమీదఫిర్యాదుచేసింది" నరసింహం పీలైనంత నెమ్మదిగా అన్నాడు.

"నేను నేరం చెయ్యటమేమిటి" ఆశ్చర్యపోతూ అడిగాడు కృష్ణ.

"సరే అయితే, అదీ చెప్తాను. నువ్వు మానభంగం చేసిన సుశీల ఇపుడు పోలీస్‌స్టేషన్‌లో ఉంది"

"సుశీల...? మానభంగం...?"

అంతసేపూ ఓపిక పట్టిన నరసింహా నికి ఆ ప్రశ్నతో ఒళ్ళుమండిపోయింది. లాగి కృష్ణ ఒంటిమీద ఒక్కటి కొట్టాడు. కృష్ణ తూలి నేలమీద పడ్డాడు.

"బాస్టర్డ్. చెయ్యాల్సింది అంతాచేసి ఇక్కడ అమాయకత్వం నటిస్తున్నావ్‌రా రాస్కెల్. ఏ సాక్ష్యమూ దొరక్కుండా ఉండాలని... బట్టలన్నీ కూడా జాగ్రత్తగా ఉతుక్కుంటున్నావు! అయినా నీ నేరం దాగేదికాదు. తప్పించుకోవడం సాధ్యమూ కాదు...కమాన్, గెటప్..."

కృష్ణ గుండెల్లో వణుకు ఆరంభ మయింది.

చెయ్యని నేరం ఏదో తలపై పడు తోంది. ఈ ప్రమాదంనుంచి బయట పడే మార్గం ఏదైనా ఉందా అని క్షణం ఆలోచించాడు కృష్ణ.

అప్పుడతనికి సుశీల చెల్లెలు సుజాత గుర్తొచ్చింది.




లేడీ డాక్టర్ సుశీలను పరిశీలించి మళ్ళీ పోలీస్‌స్టేషన్‌కు పంపేసింది.

"మీరు వెళ్ళండి! రిపోర్టు నేను అక్క డకి పంపిస్తాను" అని చెప్పి క్షణం ఆగి, ఆ తర్వాత అంది ఆ లేడీ డాక్టర్: "మీరు ఎవ్వరో నాకు తెలీదు, కొద్దిసేపటి క్రితం వరకు. కానీ ఇపుడు మీరు నాకు సుపరి

చితులు. ఇక మిమ్మల్ని జన్మలో మర్చిపోనుకూడాను! ఆడదానిమీద ఎన్నో అత్యాచారాలు జరుగుతున్న ఈరోజుల్లో ఇలా ధైర్యంచేసి పోలీస్ కంప్లయింట్ ఇచ్చేంతవరకు రావటం నిజంగా గొప్పే అనకూడదుగానీ...ఇలాటి పరిస్థితి నాకు ఎదురైవుంటే నేను తలవంచుకుని ఊరుకొనేదాన్నేగానీ ఇలా పోలీస్‌స్టేషన్‌కు రాగలిగేదాన్ని కాదనుకుంటా"

సుశీల ఆ అభినందనల్ని మౌనంగా స్వీకరించింది. తనకు జరిగింది అన్యాయమే అయినప్పుడు దాన్ని తప్పుగా నిరూపించటంలో ఏమంత ఘనకార్యం ఉందని ఇలా అభినందింపటం - అనుకొంది మనసులో.

పోలీస్‌స్టేషన్‌కు తిరిగివచ్చింది మళ్ళీ సుశీల.

"కేసు బుక్‌చేశాం. ఇదిగో, బుక్‌చేసినట్లు రసీదు! మీరు చెప్పిన వ్యక్తిని లాకప్‌లోపడేశాం. అయితే...అఫ్‌కోర్స్ అందరు నేరస్థులలాగానే అతనూ, తను ఏ నేరమూ చెయ్యలేదంటున్నాడు. అందుకే మీరేమీ అనుకోకండి...రేపు ఒక్కసారి వచ్చి అతన్ని గుర్తించివెళ్ళండి"అన్నాడు నరసింహం.

"దానికి రేపటివరకూ దేనికి? ఇలా పిలిపించండి...అవునో కాదో చెప్తాను" అంది సుశీల.

నరసింహం నవ్వాడు.

"ఈవేళ వద్దులెండి. మీరు గుర్తుపట్టలేరనికాదు—నేనే కొంచెం బిజీగావున్నాను. మీరు రేపొక్కసారివస్తే...కావలిస్తే మీ ఇంటికి జీప్ పంపమంటే పంపుతాను. ఆ వేళకువచ్చి అతన్ని గుర్తుపట్టి వెడితేచాలు. మిగిలింది మీరు చెప్పినట్లు చట్టప్రకారం అతనికి శిక్ష వేయించటం అదంతా మేం చూసుకొంటాం" అన్నాడు నరసింహం ఆమెకు వీడ్కోలు చెప్తూ.

సుశీల పోలీస్‌స్టేషన్ మెట్లుదిగుతోంటే మళ్ళీ నరసింహం ఆమెను వెనక్కు పిలిచాడు.

"మీకు చెప్దామని అనుకొన్నాగానీ... మర్చిపోయాను. వాడొకసారి మీ చెల్లెలితో మాట్లాడతాను, పిలిపించమంటున్నాడు" నరసింహం చెప్పాడు.

"మా చెల్లెలితోనా ... ఏం మాట్లాడతాడట?"

"నేనూ అదే అనుకొన్నా! అయినా చెప్పమన్నాడుగాబట్టి చెప్తున్నా. ఆమె కిష్టంవుంటే రమ్మనమనండి. అంతే! మీరు వెళ్ళొచ్చు" అంటూ ఆమెకు వీడ్కోలు చెప్పాడు.

పోలీస్‌స్టేషన్ బయటకు వచ్చిన సుశీల ఆస్పత్రికి నడుస్తూ అదే ఆలోచించసాగింది - సుజాతతో ఏం మాట్లాడతాడటవాడు, అనుకొంటూ.

ఆస్పత్రికి వచ్చాక సుజాతను అడిగింది-"నీకు కృష్ణ తెలుసా?"

"కృష్ణ ఎవరు?" తెలీనట్లు అడిగింది.

"వాడే ... నిన్న ... నన్ను..." ఆగిపోయింది సుశీల.

"నాకు తెలీదు" అనేసింది సుజాత.

"అనుకున్నాలే! కానీ...నీతో మాట్లాడాలి, ఒక్కసారి పిలిపించండి అంటే సందేహమొచ్చింది నాక్కూడా"

"నువ్వు మాట్లాడావా వాడితోటి?" 'వాడితోటి' అన్నచోట కొంచెం ఒత్తి పలికింది సుజాత.

"ఊహూఁ...ఇన్‌స్పెక్టరే మాట్లాడారు. తీసుకొచ్చి లాకప్‌లో పడేశారు"

"అంటే అపుడే దొరికిపోయాడా?"

"దొరక్క ఏమవుతాడు! ఏ ఆడదీ




ఇలా కంప్లయింట్ ఇస్తుందని ఊహించి ఉండదు!"

సుజాత నెమ్మదిగా అంది - "అలా అనుకోకు! భయపడుతున్న ఆడవాళ్లు ఎంద రున్నారో ధైర్యంచేస్తున్న వాళ్ళూ అందరు న్నారు! భర్తలు కొడుతున్నా గతంలో భరించేవారు ఆడాళ్ళు. కానీ ఇపుడు భర్త చెయ్యి ఎత్తితేచాలు ఎదురుకొట్టే ఆడాళ్లు కూడా ఉన్నారు"

అలా జవాబిచ్చిందేగానీ ఆమెకు మన సంతా గజిబిజిగా ఉంది. కృష్ణ లాకప్‌లో వున్నాడంటే గుండెల్ని పిండినట్లుగా ఉంది సుజాతకు.

ఒక్కసారి వెళ్ళి చూడాలన్న కోరిక మనసునెంతో కోస్తేసిందిగానీ సుజాత ఆ కోరికను అణచి పెట్టేసుకుంది.

మర్నాడు సుశీలతో కలిసి సుజాత కూడా పోలీస్‌స్టేషన్‌కు వెళ్లింది. పోలీస్ స్టేషన్ వెనకవున్న భాగంలో నరసింహం దోషిని గుర్తించటానికి వీలుగా ఐడెంటిఫి కేషన్ పెరేడ్ ఏర్పాటుచేశాడు.

కిందటిరోజు ఇంటర్వ్యూకు వచ్చిన వారిలో సమవయస్కులుగా వుండే ఇరవై ఇద్దర్ని ఒకే వరసలో నిలబెట్టాడు నర సింహం.

"సారీ ఫర్ ది ట్రబుల్ మేడం! సాధార ణంగా ఇలాటి కేసులో మీరు పేరు చెప్ప గలిగితే ఇంక ఏ విచారణా అనవసరం, ఏ టెస్టులూ అనవసరం ఆ వ్యక్తిని తీసుకొచ్చి లాకప్‌లో పడేసి తర్వాత జుడిషియల్ కస్టడీకి హేండోవర్ చేస్తాం! అయినా నా జాగ్రత్త నాది. అవకాశం ఉన్న చోటల్లా తప్పు జరగకుండా ఉండాలనే నేను ప్రయ త్నిస్తాను. ఒకటికి రెండుసార్లు జాగ్రత్త పడటం నా పద్ధతి. జాగ్రత్తపడకపోతే మమ్మల్ని ప్రశ్నించి వేధించే మా పైఅధి కారులు జాగ్రత్తపడితే అభినందించరేమో గానీ కనీసం వేధించరు. అందుకే ఈ జాగ్రత్త!" తను తీసుకుంటున్న జాగ్రత్త గురించి సంజాయిషీ చెప్పుకుంటున్నట్లుగా చెప్పాడు నరసింహం.

సుశీల తల ఊపింది ఫర్వాలేదన్నట్లు.

"మీరు అక్కడ వరసగా నిలబడ్డ వారిలో దోషిని గుర్తుపెట్టుకోండి. ఎటు నుంచి లెక్కిస్తే ఎన్నోవాడో అది చెప్పండి. అమాత్రం చాలు! మీరు గుర్తించ లేకపోయినా ఫర్వాలేదు. చెప్పాగదా... ఇది కేవలం ప్రికాషనరీగానే చేయిస్తున్న పని" అన్నాడు నరసింహం.

సుశీల లేచింది. అందరూ వరసగా నిల బడి ఉన్నారు. ఈ చివర్నుంచి ఆ చివ రకు ఒకసారి దృష్టిసారించింది సుశీల.

"అదుగో అక్కడ కనిపిస్తూనే ఉన్నాడు. ఆ ముఖంలో అమాయకత్వాన్ని నింపుకోవటానికి అవస్థపడుతూనేవున్నాడు. అయినా తను పొరబడదు" అనుకుంటూ సుశీల ఒక్కో అడుగు వేసుకుంటూ వారి ముందునుంచి ఆ చివరకువెళ్లి తిరిగి ఇటు తిరిగి వచ్చింది.

"నాకు కుడివైపునుంచి ఆరోవాడు!" అంది సుశీల సర్కిల్ గదిలోకి వచ్చాక.

ఆ ఆరోవాడు కృష్ణే!

అయినా నరసింహం ముఖంలో ఆశ్చర్యం. "అతనా?" ఆశ్చర్యంగా అడిగాడు. "మీరేమీ అనుకోకుండా ఇంకో సారి చెక్ చేయండి" అంటూ రిక్వెస్ట్ చేశాడు.

సుశీల క్షణకాలంసేపు తప్పుచేశానా? అని అనుకుంది. ఆతర్వాత మళ్లీలేచింది.

పెరట్లోకి వచ్చాక అర్థమయింది ఆమెకు. ఈసారి అక్కడివారి వరస మార్చారు. తను సరిగ్గా గుర్తుపడుతుందో

లేదోనని ఇంకోసారి చెక్ చేసుకుంటున్నారు అంతే!

పోలీస్‌స్టేషన్‌లోని సర్కిల్ గదిలోకి వచ్చి కూర్చుని అంది: "ఈసారి వాడు కుడివైపునుంచి ఎనిమిదో స్థానంలో ఉన్నాడు!"

"థాంక్స్! ఇంకొక్క అయిదు నిమిషాలు—వెళ్ళిపోదురుగాని. ఈ కాగితంమీద సంతకంచేసేదాలు!" అంటూ ఐడెంటిఫికేషన్ పెరేడ్‌లో సుశీల ఎవర్ని గుర్తుపట్టిందో రాసివున్న కాగితంమీద ఆమె సంతకం తీసుకున్నాడు.

"మరి మీరు వెళ్ళొచ్చు! మీరు రెండు సార్లూ అతన్నే గుర్తుపట్టారు. దట్ పెర్ఫెక్ట్‌రైట్. నిన్నమేంవాడిని అరెస్టు చెయ్యటానికి వెళ్ళేసరికివాడు బట్టలు ఉతుక్కుంటున్నాడు. కనక అట్నుంచి సరైన సాక్ష్యం లేకపోయింది. బట్ స్టిల్ సాక్ష్యాన్ని నాశనం చేయటానికే వాడా పని చేస్తున్నాడనిమాకూ తెలుసు. మరి ఇక మిగిలింది వాడికి శిక్ష వేయించటం. అపూటీ మాది. వెళ్ళిరండి" అని ఆగాడు నరసింహం.

సుశీల రెండు చేతులూ జోడించి నమస్కారంచేసి, ఆ గదిలోంచి బయటకు వచ్చింది.

కూడా ఉన్న సుజాతకు ఒక్కసారి వెళ్ళి కృష్ణను, ఎందుకు చేశావీనేరం? ఆ కోరికే ఉండే నాతోనే వ్యక్తం చేసి ఉంటే ఇంతవరకు వచ్చేదావ్యవహారం! అని చెప్పాలనుకొంది. కానీ... ఇపుడు కృష్ణ కటకటాల వెనక్కు చేరాడు. ఆగది తలుపులు మూసుకొన్నాయి.

సుజాత మది తలుపులు కూడా ఆ క్షణంలో మూతపడ్డాయి.

ఐడెంటిఫికేషన్ పెరేడ్‌లోంచి బయట కొచ్చినవ్యక్తుల్లో ఒకడు దీర్ఘంగా నిట్టూర్చుకొన్నసంగతి ఆ అక్కాచెల్లెళ్ళకు తెలీదు.

ఎలా పొక్కిందో ఆవార్త, బయటకు రానే వచ్చింది అచ్చులో. దినపత్రికల్లో



ఆ దారుణం గురించి వివరంగా రాశారు. దోషిని వెంటనే పట్టుకోవటంలో నరసింహం చూపిన చాకచక్యాన్ని కూడా కొన్ని పత్రికలు ప్రశంసించాయి.

కథ కోర్టుకు వచ్చింది.

ఈ దేశంలో చట్టాలను న్యాయ వ్యవస్థ రూపొందించదు. ఇక్కడ చట్టాలను ప్రజా ప్రతినిధులు రూపొందిస్తారు. పెద్దలు, మేధావులు, తలనెరిసినవాళ్లు అనుభవజ్ఞాన సంపద ఉన్నవాళ్లు చట్టాలు ఏ రూపంలో ఉంటే ప్రజలకు మేలు కలిగిస్తాయో వాటిగురించి కూలంకషంగా ఆలోచిస్తారు. ఆ తర్వాతే వాటికి చట్టాల రూపు కలుగుతుంది. వాటిని అమలు చేసే బాధ్యత మాత్రం న్యాయ వ్యవస్థదే. ఆ చట్టాలకు భాష్యం చెప్పటంతో స్వపర భేదాలు మాని 'సత్యమేవ జయతే' అన్న ఏక సూత్రం ఆధారంగా న్యాయమూర్తులు న్యాయాన్యాయ నిర్ణయం చేయాల్సి ఉంటుంది.

కోర్టు ఆవరణ అంతా నల్లకోట్లతో నిండి ఉంది.

కృష్ణ చేతులకు సంకెళ్ళతో కోర్టు గది గుమ్మం వరకు వచ్చాడు. అక్కడ అతని చేతులకున్న సంకెళ్లు తీశారు. న్యాయ దేవతముందు అందరూసమానులే. అంతవరకూ కృష్ణ నిందితుడేగానీ దోషి గాడు. అతనే నేరం చేసినట్లు కోర్టు ఇంకా నిర్ధారించాల్సి ఉంది. ఆ తర్వాతే అతను దోషి అవుతాడు. శిక్షార్హుడు అవుతాడు.

కృష్ణ నిర్లిప్తంగా వచ్చి బోనులో నిలబడ్డాడు.

తలెత్తి కోర్టు గదినంతా ఒకసారి పరిశీలించి చూశాడు. న్యాయమూర్తి అప్పటికే ఉన్నతాసనం మీద ఆసీనులై ఉన్నారు. ఆయనకు పైన గోడమీద మూడు సింహాలబొమ్మ భారతదేశ జాతీయ చిహ్నం హుందాగా ఉంది. ఆ చిహ్నానికి కింద 'సత్యమేవ జయతే' అన్న వేదవాక్యం రాసి ఉంది. ఈ న్యాయస్థానంలో అంతా న్యాయమే జరుగుతోందిగదా అన్న ధైర్యంతో కాబోలు మహాత్మాగాంధీ న్యాయమూర్తికి ఎదురుగావున్న గోడమీద ఫ్రేంలోంచి ముసిముసి నవ్వులు నవ్వుతున్నారు.

ఆయన ఫొటోకు కింద బెంచీలమీద చాలామంది కూర్చునివున్నారు. వాళ్ళల్లో సుజాతకూడా ఉంది. సుజాతకేసి పరిశీలనగా చూడబోయాడుగానీ, ఆమెచూపు దించుకోవటంతో కృష్ణ గత్యంతరంలేక చూపు మరల్చుకొన్నాడు.

కోర్టంతా నిశ్శబ్దంగా ఉంది. ఈ ప్రపంచంలో ఎక్కడ అన్యాయం జరిగినా దాన్ని నివారించేందుకు, నిరోధించేందుకు, నిర్దోషులకు రక్షణ కల్పించేందుకు తామంతా కంకణం కట్టుకొన్న రీతిలో అందరూ అటెన్షన్‌లో ఉన్నారు.

'ఇందరిలో ఏ ఒక్కడైనా తన మొర వింటాడా? - తాను ఏ దోషమూ చెయ్యలేదన్న సంగతిని ఒక్కడైనా నమ్ముతాడా?' - అనుకొన్నాడు కృష్ణ తన మనసులో.

ప్రాసిక్యూటర్ లేచి కృష్ణపై తలెత్తిన ఆరోపణ గురించి చెప్పాడు. అది పూర్తయ్యాక న్యాయమూర్తి కృష్ణకేసి చూసి అడిగాడు - "ఈ నేరం నీపై వచ్చింది. నేరాన్ని ఒప్పుకొంటావా...ఏదైనా చెప్పుకొంటావా?"

కృష్ణ ఒక్కసారి తలెత్తి అన్నాడు- "నేను నేరం చెయ్యలేదు. నేనే తప్పూ ఎరగను"

నిందితుడు నేరాన్ని ఒప్పుకోపటం

లేదుగాబట్టి కేసు విచారణ జరిపించాలని ఆదేశించాడు న్యాయమూర్తి.

విచారణ ఆరంభమయింది.

* * *

మొదటిరోజు విచారణ పూర్తయ్యేసరికి సుశీలకు ఒక్క సంగతి స్పష్టంగా అర్థమయింది. ఈ దేశంలో స్త్రీలంటే ఇపుడేకాదు, ఇంకా ఒకటిరెండు శతాబ్దాలకుకూడా గౌరవం పెరగదు. స్త్రీలంటే ఆటబొమ్మలేనన్న సంగతిని కోర్టులోని పురుషులంతా ఇంకోసారి నిరూపించ వల్చుకొన్నట్లుగా ఉంది అక్కడి విచారణ చూస్తోంటే.

"చెప్పమ్మా...ఆ వ్యక్తి నిన్ను మానభంగం చేసినట్లు ఆరోపణ చేశావు. నీ దృష్టిలో మానభంగం అంటే ఏమిటి?"

"అసలు నీకు మానభంగం జరిగిందన్న సంగతి నీకెలా తెలిసింది?"

"ఇతనే చేశాడని ఎలా చెప్పగలవు? చేస్తోంటే రేపు కోర్టులో ఈ విషయం చెప్పాల్సివస్తుందని అతని ముఖమేచూస్తూ ఉండిపోయావా?"

"అతను నీమీదకు ఆక్రమణకు వస్తోంటే. నువ్వేంచేశావు? ప్రతిఘటించలేదా? గొంతెత్తి అరవలేదా? పదిమందినీ పిలవలేదా?"

ఇలా సాగాయి ప్రశ్నలు. స్త్రీని... అందులోనూ మానభంగ బాధితురాల్ని సాధ్యమైనంత వరకు ప్రశ్నలతో బాధించరాదనే ,'నిబంధనలూ, ఆంక్షలూ ఉండనే ఉన్నాయి. అయినా నియమనిబంధనలదారి వాటిదే...ఇక్కడ జరిగే తంతుదారి దానిదే. రెంటికి రెండూ సమాంతర రేఖలు!!

ఎలా జరిగింది? ఎక్కడ? ఎందుకు?- ఇలాటి ప్రశ్నలకు ఏ ఆడదైనా ఏం సమాధానం చెప్తుంది? చట్టం కంటిముందే మరోసారి తననెందరో చిత్రహింసలకు గురిచేస్తున్న భావన సుశీలను నిలువునా దహించింది.

కోర్టులోంచి బయటకు వస్తోంటే రామనాథం ఎదురొచ్చాడు. సుశీల క్షణం నివ్వెరపోయి నిలిచింది.

"ఏంటమ్మా..ఇది నిజమే?" కళ్ళల్లో నీళ్లు కమ్ముకొంటూ ఉండగా అడిగాడు రామనాథం.

సుశీల ఏ సమాధానమూ చెప్పలేదు. మౌనంగా నిలబడింది. ఆమె గుండెల్లో బాధ, కళ్ళల్లో నీళ్ళు.

"నువ్వయినా చెప్పలేవేం?"సుజాతను అడిగాడు రామనాథం.

"కోర్టులో ఇంత గొడవ జరుగుతుందని అనుకోలేదు మేం. నేరాన్ని అతను ఒప్పుకొంటేచాలు, శిక్షపడిపోతుందని అనుకొన్నాం. కానీ వాడు నేరం చెయ్యలేదంటున్నాడు" చిన్నగా అంది సుజాత.

"నేరంచేసినవాడు ఎవడైనా అనే మాటే అది! అయినా ఇలాటివి బయట పెడతారాతల్లీ! లోకం గురించి తెలీని దానివి! ఇలాటివి గుట్టుగా దాచుకోవాలి తప్పితే రట్టుచేసుకోకూడదు! నాతో ఒక్కమాట అనివుంటే" రామనాథం గుండెలోతుల్లోంచి బాధ వ్యక్తంచేస్తూ అన్నాడు.

"పోన్లే నాన్నా! అయిపోయిందేదో అయిపోయింది. ఇంక ఆ విషయం ఆలోచించటం అనవసరం! ఎలాగూ కోర్టు వరకు వచ్చిన కథ ఆ తర్వాతకూడా జరగకమానదు"

"జరుగుతుందమ్మా...కానీ ఏం జరుగుతుంది? వాడికి శిక్ష పడుతుంది! నీకేం జరుగుతుంది? మూడేళ్లో, అయిదేళ్ళో శిక్ష

వేస్తారు. వాడు మళ్ళీ కాలరు సర్దుకుని బయటపడతాడు. ఏ ఆడదాన్నో చూసుకుని పెళ్ళిచేసుకుంటాడు! కానీ నీ సంగతేమిటి? ఇంతగా ఈకేసుకు ప్రచారం వచ్చాక నీకు పెళ్ళవుతుందనే నీ ఉద్దేశం? సుజాత గతీ అంతేగదా! ఒక్క దెబ్బతో కుటుంబం అంతా నాశనం అయిపోయిందమ్మా" బాధతో బావురుమంటూ రోదించాడు రామనాథం.

సుశీల, సుజాతలు ఏమీ మాట్లాడలేదు.

తండ్రి చెబుతున్న సంగతి వాళ్లకు తెలీకకాదు. తెలిసే ఇంతదూరం వచ్చారు. ఇక వెనక్కివెళ్లే ప్రసక్తేలేదు.

కోర్టులో కేసు నడుస్తూనేవుంది.

పూర్వాపరాల విచారణ జరుగుతూనే ఉంది.

ఒకరోజు విచారణ జరుగుతోంటే న్యాయమూర్తికి ఏదో ఆలోచనవచ్చింది. కోర్టు మధ్యాహ్న విరామసమయంలో సుశీలను తన ఛాంబర్‌లోకి పిలిపించాడు న్యాయమూర్తి ముకుందరావు.

ముకుందరావు న్యాయవాదిగా చాలా కేసులు చూసిన అనుభవజ్ఞుడు. తల బాగా పండిన ముకుందరావును జడ్జిగా నియమించారు. మానవతావాదిగా, మంచితనం మూర్తీభవించిన వ్యక్తిగా ఆయన న్యాయవాదుల్లో మంచి పేరు ప్రతిష్టలు సంపాదించుకోగలిగాడు.

సుశీల ముకుందరావు ఛాంబర్‌లోకి ప్రవేశించింది.

ఈజీ ఛెయిర్‌లో కూర్చుని ఏదో లా జర్నల్ తిరగేస్తున్న ముకుందరావు ఆమెను సాదరంగా ఆహ్వానించాడు. ఎదురుగా కుర్చీలో కూర్చోమన్నాడు.

ఆ తర్వాత నెమ్మదిగా అన్నాడు- "నాకు తెలుసమ్మా .... ఇలాటి కేసులో బాధితురాలిగా ఉండటం ఎంత ఇబ్బందిగా ఉంటుందో! మిగిలిన కేసుల తీరుతెన్నులు వేరు. ఆ కేసుల్లో బాధితులపట్ల సమాజానికి సానుభూతి ఉంటుంది. 'అయ్యో నష్టపోయాడే' అన్న భావం ఉంటుంది. కానీ ఈ రేప్ కేసుల పద్ధతే వేరు! జరిగే వంద కేసుల్లో అయిదారుమించి న్యాయస్థానం వరకురావు. వచ్చినా చివరివరకు నిలబడేవి తక్కువే! రేప్‌జరిగినసమయంలో ఎక్కడో ఉన్నామని ఎలిబీ సృష్టించుకొని నేరస్థుడు బయటపడిపోతుంటాడు. శిక్ష తప్పించుకుంటూ ఉంటాడు. అయినా నేరస్తుడికి శిక్షపడినా నిజానికి ఓడిపోయేది బాధితురాలే! కేసులో గెలిచి జీవితంలో ఓడిపోతుందా స్త్రీ! మన సమాజం మారేంతవరకూ ఈ పద్ధతి ఇంతే!"

ముకుందరావు క్షణం ఆగాడు.

సుశీల ముఖకవళికలు గమనించి తను చెప్పేది ఆమె జాగ్రత్తగా వింటోందని గుర్తించి మళ్లీ చెప్పనారంభించాడు- "ఇదంతా ఎందుకు చెబుతున్నానా అని నువ్వు ఆలోచిస్తూ ఉండొచ్చు. కారణం చెప్తాను...నిన్ను ఎలాగైనా ఈ కేసులో గెలిపించాలని నా తాపత్రయం! న్యాయమూర్తిగా ఈ మాట నీకు చెప్పకూడదు. కానీ మనిషిగా, నిజంగా నీ శ్రేయస్సు కోరేవాడిగా చెబుతున్నాను. నువ్వు ఊ అంటే ఈ కేసులో నువ్వు గెలిచేలా చేస్తాను. కేసులోనేకాదు...జీవితంలోకూడా గెలుపు నీదే అవుతుంది. నేను కావాలంటే నీ తరపున కృష్ణతో మాట్లాడతాను. చెప్పకూడదుగానీ తనీ నేరం చెయ్యలేదంటున్నాడు అతను. ఒక్కోసారి ఆ మాట నిజమేననిపిస్తోంది నాకు! నీకు తెలీందిగాదు- వందమంది దోషులు తప్పించుకున్నా




# కీళ్ల పట్లు తనని
# కట్టి పడేయడం దేనికి?




## నయం చేసే శక్తి మీ చేతుల్లోనే ఉంది.

మీ చేతుల వెచ్చని సౌమ్యమైన స్పర్శ, అయొడెక్స్‌లో గల నయం చేసే శక్తి— ఇవే తనకి కావలసినవి. అందుకే అయొడెక్స్‌ను అందుబాటులో ఉంచుకోండి. ఎందుకంటే అయొడెక్స్‌లో గాయపడిన ధాతువులను నయంచేసే అయొడిన్, నొప్పిని తగ్గించే మిథైల్ శాలిసిలేట్ చేరి ఉన్నాయి.

**అయొడెక్స్ రోజుకు రెండుసార్లు రెండింతలు గుణకారి.**

నొప్పి తగ్గేటందుకూ, ఆ తర్వాత రెండు రోజుల వరకూ రోజుకు రెండుసార్లు అయొడెక్స్ వాడమని సిఫారసు చేస్తున్నారు డాక్టర్లు. ఎందుకంటే, నొప్పి ఒక లక్షణం మాత్రమే కాగా అసలు సమస్య లోపలి ధాతువులైన గాయం.

కనుక మీ అత్తయ్య ఎవరైనా కీళ్ల పట్లు బెణుకులు, కండరాల పట్లు, ఒళ్లు నొప్పులతో బాధపడటం జరిగితే కాస్త అయొడెక్స్ మర్దించండి, రోజుకు రెండుసార్లు. తను రెండింతల శీఘ్రంగా మళ్లీ చురుకుగా చేసినందుకు వారు మీకు ఋణపడి ఉంటారు.

**అయొడెక్స్® — నయం చేసే శక్తిగల నమ్మకమైన బామ్.**

**SKOF** — ఎస్‌కేఎఫ్ ఉత్పాదన.

పర్వాలేదుగానీ, ఒక్క నిర్దోషికయినా శిక్ష పడకూడదంటుంది న్యాయశాస్త్రం! నా ప్రయత్నమూ అదే! నువ్వు సమ్మతిస్తే అతన్ని నీకు వరుడిని చేస్తాను. పొరపాటునో, గ్రహపాటునో అతను చేసిన తప్పుకు నీకు జరిగిన అన్యాయానికి తగిన పరిష్కారం ఇదే అనుకుంటాను. నీకు జరిగిన అన్యాయమూ ఈ పెళ్ళి జరిగితే మరుగునపడిపోతుంది. అతన్ని శిక్షించిజైలుగోడలవెనకపడెయ్యటంకన్నా అతనికీ ఓఅవకాశంఇచ్చినట్లు అవుతుంది. ఇద్దరి జీవితాలూ చక్కబడతాయి. ఆలోచించు...ఆలోచించి ఓ నిర్ణయంతీసుకో" అన్నాడు ముకుందరావు.

సుశీల క్షణం ఆలోచనలోపడింది. ముకుందరావు సూచిస్తున్నది బాగానే వుంది...ఎంతమంది ఆడామగా ప్రేమలో పడి, పెళ్ళికి ముందే శారీరకంగా కలపటంలేదు. చట్టం దృష్టిలో అదీ తప్పేమరి. పెళ్ళి ఏ కారణంవల్లనో వాళ్ళకు జరగకపోతే-అదీ మరి మానభంగంకిందే లెక్క గదా! ఆ విషయం వాళ్లకు తెలీకనా? తెలిసికూడా శారీరక సంబంధాలకు స్త్రీ పురుషులు సిద్ధపడుతున్నారంటే... ఏమిటి అర్థం? పెళ్ళికిముందు జరిగే కలయికను ఆతర్వాత పెళ్లితో 'లీగలైజ్' చేసుకోవచ్చుననేకదా!

సుశీల ఆలోచనల్లోపడింది. ముకుందరావు చెప్తున్నది సమంజసంగానేవుంది కానీ...

ఎందుకో మనస్సు ఒప్పుకోవటంలేదు దానికి.

సందిగ్ధంలోవున్న సుశీలను చూస్తూ అన్నాడు ముకుందరావు-"తొందరపడి ఒక నిర్ణయానికి రావలసిన పనేమీలేదు. నాదొక సూచన మాత్రమే. నీకు అంగీకారమైతే ముందుకు వెడదాం! బాగా ఆలోచించి, నువ్వో నిర్ణయానికి రా. ఆ తర్వాత మీ పెద్దలతో సంప్రదించు. అప్పుడా నిర్ణయం ఏదో నాకు చెప్పు. న్యాయసమ్మతం ఏదైతే అది చేస్తాను. న్యాయానికి మించిన మానవతాధర్మం కూడా ఒకటివుందని నాకు తెలుసుగాబట్టే ఈ ప్రయత్నం చేస్తున్నాను. నేరస్తుణ్ని శిక్షించి అతన్ని మరింత కరుడుగట్టిన మనిషిగా చేయటంకన్నా, అవకాశం ఇచ్చి సంస్కరించి మనిషిగా తీర్చిదిద్దాలనేది నా అభిప్రాయం"

ఛాంబర్లోంచి బయటకు వచ్చింది సుశీల.

ఆరోజు సాయంత్రమే ఆ విషయం సుజాతతో ప్రస్తావించింది.

"ఏం చెప్తాను ... నువ్వే నిర్ణయించుకోవాల్సివుంది ఏవిషయమైనా" అనేసింది సుజాత.

సుశీల బాగా ఆలోచించితన నిర్ణయాన్ని చెప్పింది ముకుందరావుకు-"మీరన్నది బాగానేవుందిగానీ ... పెళ్ళికి నేనెందుకో సిద్ధపడలేకపోతున్నాను! అతణ్ని పెళ్ళి చేసుకొన్నా, రేపు భవిష్యత్తులో ఎప్పుడతన్ని చూసినా నాకు ఈ చేదు అనుభవమే గుర్తుకొస్తుంది. ఆ స్థితిలో అతన్ని నేను భర్తగా ఆమోదించలేను. ద్వేషం, అసహ్యం నింపుకున్న మనసుతో అతనిముందు భార్యగా నటించనూలేను. మీరన్నట్లు, అతనికి శిక్ష పడినా అది నా ఓటమే! నాకింక పెళ్ళి కాదు...నిజమే. అందుకూ నేను సిద్ధమే. అంతేగానీ ఆ నేర మనస్తత్వం ఉన్న వ్యక్తితోమాత్రం కలిసి బతకలేను"

ముకుందరావు "అదీ నిజమే. నీఇష్టం ఎలాగైతే అలాగే" అనేశాడు.




ఆతర్వాత కేసు ఒక కొలిక్కి రావటానికి ఎంతో ఎక్కువకాలం పట్టలేదు.




ఆ రోజు ముకుందరావు న్యాయస్థానంలో తన న్యాయ నిర్ణయం వినిపించాడు:

"...తేదీనరాత్రిదాదాపుతొమ్మిదిన్నర పదిగంటలమధ్య ఈ ఊరికి దూరంగా ఉండే ఫలానా ఆఫీసునుంచి ఇంటర్వ్యూకు వెళ్ళి తిరిగి ఒంటరిగా వస్తున్న సుశీల అనే వాదిని కృష్ణ అనే ఈ నిందితుడు బలాత్కారంచేసి మానభంగం చేసినట్లు ప్రాసిక్యూషన్ వారు ఆరోపణలు చేశారు. ఈ కేసులో వాద ప్రతివాదాలన్నీ విన్న నేను, నా న్యాయనిర్ణయాన్ని ఈ కింది విధంగా తెలియజేస్తున్నాను-

"భారతీయ శిక్షాస్మృతి 375 అధికరణం ప్రకారం 'మానభంగం' అనే దాన్ని న్యాయశాస్త్రం ఆరు విధాలుగా నిర్వచిస్తోంది. ఒకటి-స్త్రీ ఇచ్ఛకు వ్యతిరేకంగా, రెండు – ఆమె పూర్వానుమతి లేకుండా, మూడు-ఆమెను ఏదో కారణంగా భయపెట్టిగానీ, ఆమె బంధువులు చుట్టపక్కాలుఁలేదా ఆమెకు సంబంధించిన ఏ వ్యక్తినైనా గాయపరుస్తానని భయపెట్టిగానీ ఆమె అంగీకారాన్ని బలవంతంగా పొంది, ఆపై ఆమెతో సంభోగించటం, నాలుగు-అతను తన భర్తకాకపోయినా, భర్తకాగల అవకాశంఉందన్న అపోహ కలిగించి ఆమెను లోబర్చుకోవటం, అయిదు - ఆమె అంగీకారం పొందినాగానీ, ఆ అంగీకారం ఇచ్చే సమయంలో ఆమె మానసికంగా స్థిరంగా ఉండకపోయినా, ఏ మాదక మత్తుపదార్థాలనైనా ఆమెకిచ్చి ఆమెను మైకంలోదింపి, ఆ పరిస్థితిలో ఆమె అంగీకారం పొందినాగానీ,ఇక ఆరోది, ఆఖరిదీ- ఆ స్త్రీ పదహారేళ్ళ వయసులోపునే ఉన్నపుడు ఆమె అంగీకారంతోగానీ, ఆమె అంగీకారం లేకపోయినాగానీ-ఏ పురుషుడైనా ఒక స్త్రీతో జరిపే శారీరక సంభోగాన్ని 'రేప్' అంటున్నదీ అధికరణం.

"ఇపుడు మనముందున్న ఈ కేసు ఈ నిర్వచనాల్లో రెండు నిర్వచనాలకు లోబడి ఉన్న రేప్ కేసు. మొదటిది-ఆమె అంగీకారంలేకపోవటం, రెండోది - ఆమె చెప్తున్నట్లు ఆమెకా సమయంలో ఏదో మత్తుమందు వాసన చూపి ఆమె స్పృహ కోల్పోయేటట్లుచేసి మానభంగంచేయటం. వాది సుశీల ఆరోజు మధ్యాహ్నంనుంచి తనను ప్రతివాది గమనిస్తూనే వచ్చాడని ఆరోపించింది. అయితే గత్యంతరం లేని స్థితిలో ఆమె అక్కడే ఉండిపోవాల్సి వచ్చిందనేది నిర్వివాదాంశం.

"ఇక రెండో అంశాన్ని పరిశీలిస్తే నేరం ఎవరైనా ఎందుకు చేస్తారు అనే ప్రశ్న ఇది-మిగిలిన నేరాలమాట ఎలా ఉన్నా మానభంగం నేరాలు ఈ దేశంలో అధికంగా జరగటానికి ఎన్నో కారణాలు ఉన్నాయి. శారీరకమైన వాంఛ తీర్చుకోవటం ప్రాథమిక కారణం అయితే,లైంగిక నేర ప్రవృత్తి ఇంకో కారణం సామాజిక, ఆర్థిక సమస్యలనుంచి, ఆ టెన్షన్లనుంచి బయటపడేందుకు తెలిసో తెలియకో అవుట్

లెద్‌గా దీన్ని కొందరు ఎంచుకోవటం కారణం. స్త్రీలమీద తమ పురుషాధిక్యత నిరూపించుకోవటానికి కొందరు ఈ నేరానికి పాల్పడుతోంటే, తమ మగతనంమీద తమకే నమ్మకం లేని మూఢులు కూడా మానభంగంవైపు మొగ్గు చూపిస్తున్నారు. ఇక కొందరుంటారు. తాము ఎంతో కాలం నుంచి తీసుకొంటున్న సెక్సురోగాలకు కన్నెపిల్లతో సంభోగమే సరైన చికిత్సని నమ్మి మరీ మానభంగం చేసేవారువీరు. ఇలా కారణాలు వేరైనా వీరంతా చేసేది ఒకే నేరం.

"ఈ కేసులో నిందితుడి మనస్థితి ఏమిటో పరిశీలిద్దాం-లభించిన సాక్ష్యాలనుబట్టి అతను నిరుద్యోగి అయినా వివాహంవైపు దృష్టి ఉన్నవాడు. శారీరక సంబంధం అంటే మొగ్గు చూపేవాడు. ఒక స్త్రీని పెళ్ళి చేసుకోవాలంటే ఆమెతో శారీరక సంబంధం పెట్టుకోవటం ఒకటే మార్గమని ఆలోచించేతత్వం ఉన్నవాడు. ఇలాటి వ్యక్తి ఒంటరిగా ఒక స్త్రీ దొరికితే మానభంగం చేయటానికి వెనకాడకపోవచ్చుననేది సత్యం.

"ఇలా, జరిగింది నేరమేనని, నిందితుడు నేరం చేసే మనస్తత్వం ఉన్నవాడేనని నిర్ధారించుకొన్నాక-ఈ నిందితుడే ఈ నేరం చేశాడని నిర్ధారించుకోవటం అవసరం. దానికి కూడా ఈ కేసులో కొన్ని సాక్ష్యాధారాలు ఉన్నాయి. వాడి సుశీలను తను ఇంటర్వ్యూ జరిగిన చోటునుంచి వెంబడించినమాట వాస్తవమేనని నిందితుడు ఒప్పుకొంటున్నాడు. అయితే తనకు ఆమెపై శారీరక బలప్రయోగం చేసి లోబర్చుకోవాలనే ఉద్దేశం లేదని, ఆరోజు మధ్యాహ్నం గుండెపోటుకు గురైన ఆమె తండ్రిని గురించిన సమాచారం అందించేందుకే తాను ఆమె వెంటబడినట్లు అతను చెప్పుకొచ్చాడు. ఈ వాదంలో కొంత సమంజసంవున్నా తనకు తెలిసిన విషయాన్ని



వాదికి చెప్పకుండా ఆమెను ఆ రాత్రివేళ వెంబడించాల్సిన పరిస్థితి ఏమొచ్చిందో నిందితుడు సరిగ్గా సంజాయిషీ ఇచ్చుకో లేకపోయాడు.

"ఇక నేరం జరిగిన ప్రదేశంలో కానీ, ఆ పరిసర ప్రాంతాల్లోగానీ, మరో వ్యక్తి ఎవ్వరూ ఉన్నట్లు వాదిగానీ ప్రతి వాదిగానీ ఆఖరికి ప్రాసిక్యూషన్‌వారు గానీ చెప్పటంలేదు. ఫలితంగా నేరం జరిగిన ప్రదేశంలో నిందితుడిని ఎవరూ చూడకపోయినా, అతనక్కడే ఉన్నాడ నేది రుజువవుతోంది. అలాటి ఒంటరి తనంలో ఉండే వ్యక్తి ఆ స్త్రీమీద బలాత్కారం చేసే అవకాశం ఉంది. నిందితుడు మర్నాడు పోలీసులకు చిక్కే సమయానికి తన బట్టల్ని ఉతుక్కుంటూ ఉన్నాడు. ఫలితంగా నేరం జరిగిన సమ యంలో నిందితుని ఒంటిపైవున్న దుస్తు లపై ఉండే గుర్తులన్నీ, మరకలన్నీ మటు మాయం అయిన ప్రమాదం జరిగిందని పోలీసులు అంటున్నారు. అయితే తనకు ఉన్నవి రెండే జతల బట్టలనీ, అవకాశం బట్టి వాటిని ఉతుక్కోవటం తనకు అల వాటనీ నిందితుడు అంటున్నాడు. ఇపుడు మిగిలిన ప్రశ్న ఇంకోటి ఉంది- నేరం జరిగిన సమయంలో అక్కడ లేకపోతే ఇంకెక్కడ ఉన్నాడో నిరూ పించుకోవాల్సిన పరిస్థితిలో ఉన్నా, నిందితుడు దానికి సరైన రుజువులు చూపించలేకపోయాడు.

"ఈ కేసులో కొన్ని లూజ్ ఎండ్స్ ఉన్నమాట వాస్తవం. మానభంగానికి ముందు, మధ్యాహ్నంనుంచీ అతన్నే చూస్తూవున్నా మానభంగం చేసినవ్యక్తి అతనేనని వాది స్పష్టంగా చెప్పలేకపో తోంది. అయితే స్పృహ తప్పిపోవటంవల్ల తను ఆ వ్యక్తిని 'ఆ సమయం'లో చూడలేక పోయానని ఆమె చెప్పుకొచ్చింది. అంటే పగలంతా ఆమెను వెంబడించినవ్యక్తి అతనే అయినా మానభంగం చేసినవ్యక్తి మరొకడు కాగల అవకాశం ఉంది. కానీ ఆ సమయంలో వాదిప్రతివాదులిద్దరూ తాము మరెవ్వర్నీ చూడలేదని చెప్పటం వాదిని మానభంగం చేయగల అవకాశం ఉన్నవ్యక్తి వేరే ఎవర్నీ ప్రాసిక్యూషన్ వారు ప్రవేశపెట్టలేకపోవటంతో సాక్ష్యా ధారాలపైనే నేను న్యాయ నిర్ణయం చేయాల్సివస్తోంది. ఈ పరిస్థితుల్లో వాది ఆరోపించినట్లుగా నిందితుడు వాదిని ఉద్దేశపూర్వకంగా చాలా జాగ్రత్తగా ఆలోచించి పథకంవేసుకొని, ఆమె ఒంటరిగావెళ్ళే అవకాశం గుర్తించిమరీ మానభంగం చేశాడని ఈ కోర్టు నమ్ము తోంది...."

ముకుందరావు తన న్యాయనిర్ణయం చదవటం ఆపి ఒకసారి బోనులో నిలబడి ఉన్న కృష్ణకేసి చూసి అడిగాడు.

"ఈ కేసులో శిక్ష వినిపించబోయే ముందు ఇంకా ఏమైనా నువ్వు కోర్టుకు చెప్పుకోవాల్సివుందా?"

కృష్ణ 'ఏమీ లేదన్నట్లు' తల ఊపుతూ అన్నాడు. "నేను ఈ నేరం చెయ్యలేదు. ఆ విషయం గతంలోనే మీకు విన్నవించు కొన్నాను. ఇక చెప్పేదేమీలేదు"

ముకుందరావు ఒక్క క్షణం కృష్ణకేసి సాలోచనగాచూసి, మళ్ళీ తలవంచి తన జడ్జిమెంట్ వినిపించాడు.

"పైనచెప్పిన కారణాలవల్ల, భార తీయ న్యాయవ్యవస్థమీద పూర్తి గౌరవ విశ్వాసాలు ఉన్న నేను, ఈ న్యాయస్థా నాధిపతిగా నాకు లభించిన అధికారం ప్రకారం నిందితుడైన కృష్ణను ఈ నేరం




చేసిన దోషిగా నిర్ధారిస్తున్నాను. ఈనేరం చేసిన కారణానికి అతను అయిదేళ్ళపాటు కఠినకారాగార శిక్షకు గురికావాల్సి ఉంటుందని భారతీయ శిక్షాస్మృతి చట్టం ప్రకారం తీర్పు ఇస్తున్నాను. ఈ కేసులో ఫిర్యాది అయిన సుశీల నేరస్థుడిని శిక్షించి తీరాలన్న పట్టుదలతో ముందు కొచ్చినందుకు ఆమెను మనసారా అభినం దిస్తున్నాను"

అంటూ తీర్పువినిపించి ముకుంద రావు తన కుర్చీలోంచి లేచాడు.

న్యాయస్థానంలో ఉన్న అందరూ కూడా లేచి నిలబడ్డారు.

ముకుందరావు తన కుర్చీ పక్క నుంచి నడిచి వెనకనున్న తన ఛాంబర్ లోకి వెళ్ళిపోయాడు. బోనులో దిగాలుగా నిలబడ్డ కృష్ణను వెనకనుంచి ఒక పోలీస్ కానిస్టేబుల్ తట్టాడు. కృష్ణ వెనక్కి తిరిగి బోనుదిగాడు.

కోర్టులోఉన్న జనం అంతా కోర్టు గదికి అన్నివైపుల ఉన్న దారులలోంచి గదిలోంచి బయటకు నడుస్తున్నారు.

సుశీల, పక్కనే సుజాత – ఇద్దరూ తండ్రిరామనాథంతో కలిసినడుస్తున్నారు.

కృష్ణకు ఒక్కసారివెళ్ళి ఆ అక్క చెల్లెళ్ళతో మాట్లాడాలనిపించింది. 'నేనీ నేరం చెయ్యలేదు' అని గట్టిగా అరిచి చెప్పాలనిపించింది. కానీ...నిండు న్యాయ స్థానంలోనే తనగోడు వినిపించుకునే వాళ్ళే లేకపోయినప్పుడు ఇప్పుడు ఈ ఖాళీ గోడలకు, ఆ అక్కచెల్లెళ్ళకు చెప్పు కొంటే వినిపించుకుంటారనుకోవటం తెలివితక్కువ తనమే అవుతుంది.

ఎక్కడో ఏదో పొరబాటు జరిగి పోయింది.

తన జీవితం దారి తప్పిపోతోంది. సుజాతను పెళ్ళాడదల్చుకొన్న తనేమిటి సుశీలను పాడుచేశాడన్న నేరానికి జైలుపాలవటం ఏమిటి?

నిర్లిప్తంగా సంకెళ్ళకు చేతులప్పగిం చాడు కృష్ణ.

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పూర్తిగా పోతుంటే నిరాసక్తంగా చూస్తూ ఉండి పోయాడు.

ఎవరో తనకు తెలియనివ్యక్తి, బహుశా సుశీల, సుజాతలకు కూడా తెలిసి ఉండడు. ఆ వ్యక్తి నిశ్చలంగా నిర్మలంగా ఉండే తన జీవిత సరస్సులోకి ఒకరాయి విసిరాడు. సరస్సు ఒక్కసారి కల్లోలానికి గురైంది. కల్మషంతో నిండి పోయింది.

కృష్ణ తన పక్కనే నడుస్తున్న కానిస్టేబుళ్ళకేసి చూసి, మౌనంగా వెళ్ళి పోలీస్ వాన్‌లో ఎక్కికూర్చున్నాడు. వాన్‌తలుపు పడింది క్షణం తర్వాత ఆ వాన్ కదిలింది. వాన్ కున్న కటకటాల లోంచి కోర్టు ఆవరణలో నడిచి వెడుతున్న ఆ కుటుంబ సభ్యులు అతనికి కనిపిస్తూ ఉన్నారు.

వాన్ మలుపు తిరిగింది.

ఇపుడు కృష్ణకు వాళ్ళు కనిపించటం లేదు.

కోర్టులోంచి బయటకువచ్చి వంద గజాలు నడిచి ఓ చెట్టు కిందకు రాగానే రామనాథం కూలబడ్డాడు. ఈకాలం ఆడపిల్లలకు ఆవేశం తప్ప ఆలోచనలు లేకపోవటం ఆ తండ్రిని కలవర పెడుతోంది. రేపు ఈ పిల్లలకు పెళ్ళెం జరుగుతుంది? రేప్ విక్టిమ్స్‌గా పేరు పడ్డవారికి ఈ సమాజంలో గౌరవాదరాలు ఏముంటాయి? స్థానం ఏముంటుంది? తను ఉన్నంతకాలమూ సరే కంటిపాపల్లాగా

కాపాడుకొంటాడు. కానీ ఆ తర్వాత...? ఆ తర్వాత మాటేమిటి?

ఎవరు ఈ పిచ్చి తల్లుల్ని అదుకొంటారు?

వీరి బతుకు చివరికి...

ఏం కాబోతోంది?

రామనాథంకు అన్నీ ప్రశ్నలుగానే ఉన్నాయి. అసలే బలహీనమైన ఆ గుండె ఈ సమాధానం లేని ప్రశ్నలతో మరింత బలహీనం అయినట్లుగా ఉంది అతనికి.

నిస్త్రాణతో ఆ చెట్టుకిందకూలబడ్డాడు రామనాథం.

అప్పుడు-

వాళ్ళ ముందుకొచ్చి నిలబడ్డాడు ఒక యువకుడు.

ముందు సుజాత తర్వాత సుశీల.. ఆ తర్వాత రామనాథం వరసగా తలెత్తి చూశారు అతన్ని.

సుశీలకు అతన్ని చూడగానే అతనెవరో గుర్తుకొచ్చింది. ఆనాడు తను ఇంటర్వ్యూకు వెడుతోంటే లిఫ్ట్ ఆఫర్ చేసింది అతనే.

పేలవంగా నవ్వింది సుశీల.

చిన్నగా అన్నాడతను "మీరెవరో నాకు తెలుసు. ఈ కేసు మొదటినుంచీ చివరివరకు అన్ని వివరాలూ తెలిసినవాడిని. రోజూ మీతోటే కోర్టుకు హాజరవుతూ వచ్చినవాడిని. నా పేరు రవీంద్ర"

సుజాత 'అయితే ఏమిటి?' అన్నట్లు పెట్టింది ముఖం.

"మీకు అభ్యంతరం లేకపోతే సుశీల గార్ని నేను పెళ్లి చేసుకొంటాను" అతి నెమ్మదిగా అన్నాడు రవీంద్ర.

తమకు నీడనిచ్చిన ఆ చెట్టుమీద పిడుగు పడిందన్నంత భయంతో చూశారు ఆ ముగ్గురూ ముందు. ఆ తర్వాత ఒకరొకరుగా తేరుకొన్నారు. అతను ఏం చెప్తున్నాడో అర్థమయ్యేసరికి అందరి ముఖాలూ ప్రసన్నమయ్యాయి.

రామనాథం ముందుగా అన్నాడు "మీరెవరో మాకూ తెలీదు. కానీ... మీ ఔదార్యాన్ని మేం గుర్తిస్తున్నాం. మా అమ్మాయిలాగే మీదీ ఆవేశమే! ఆలోచించండి. ఇలాటివి అతి అరుదుగా కథల్లో మాత్రమేజరుగుతాయి. ఈరోజు మీరు ఏదో ఆవేశంతోనో ఆదర్శంతోనో సుశీల మెడలో తాళి కడతానంటున్నా రేపు మీలో ఇంత విశాల దృక్పథం ఉండకపోవచ్చు. జీవితంలో వాస్తవాలు మీముందుకొచ్చి మిమ్మల్ని ఇరకాటంలో పెట్టటం ఆరంభించేసరికి ఈ ఆదర్శాల ఊపు తగ్గి ఎందుకు చేసుకొన్నానా అని ఆవేదన చెందటం ఆరంభిస్తారు... వద్దులెండి వెళ్ళండి. మీ మానాన్న మీరుండండి. మా చిరిగిన బతుకులేవో మమ్మల్ని బతకనియండి"

సుజాత నివ్వెరపోయింది! ఇదేమిటి, ఇలా అనేస్తున్నాడు తండ్రి?అంది వస్తున్న అదృష్టం ఇది. దీన్ని కాలదన్నుకోవటం తెలివి తక్కువ తనమే అవుతుందన్న సంగతిని తండ్రి గుర్తించటం లేదేం?

రామనాథం మాటల్ని రవీంద్ర పట్టించుకోనట్లుగా అన్నాడు "మీరు పొరబడుతున్నారు. ఇదేదో నేను క్షణాలమీద ఆవేశంతో తీసుకొన్న నిర్ణయం అనుకోకండి. చాలాకాలంగా ఆలోచిస్తూ వచ్చాను. ఈరోజు మీతో చెప్తున్నాను అంతే... అయినా ఒకమాట మీరేమైనా ఆలోచించుకోవాల్సి వస్తే ఆలోచించుకొండి. ఇదిగో ఇది నా అడ్రసు! మీ నిర్ణయం మీఅంతట మీరు తెలియజేసినా సరే లేకపోతే, వారం రోజుల తర్వాత




నేనే మీ ఇంటికి వస్తాను, అప్పుడు తెలియ జేసినాసరే..." అంటూ జేబులోంచి ఒక కాగితం తీసి తన అడ్రసు రాసి ఇచ్చాడు రవీంద్ర.

రామనాథం ఆకాగితం తీసి మడతపెట్టి జేబులో పెట్టుకున్నాడు.

దూరంగా రవీంద్ర స్కూటర్ ఎక్కి వెళ్లిపోయేంతవరకుచూసి నిట్టూర్చుతూ అన్నాడు రామనాథం "ఈ లోకంలో ఇంకా మంచివాళ్లు కొందరు ఉన్నారనేందుకు ఇదే నిదర్శనం! ఆదర్శాలపట్ల గౌరవం ఉన్నవాళ్లూ ఉన్నారనేందుకు ఇదే నిదర్శనం!"

సుశీల అంతా వింటూనేఉంది. కానీ ఏమీ మాట్లాడలేదు.

క్షణంఆగి అన్నాడు రామనాథం మళ్లీ-"అనకూడదుగానీ ఈ పిచ్చితల్లికి తగ్గ వరుడే అవుతాడు ఆ అబ్బాయి. దీనికి ఆవేశం పిచ్చి, అతనికి ఆదర్శం పిచ్చి! ఇద్దరిపిచ్చీ పెళ్లితో కుదిరేలాగే వుంది!"

సుజాత అందుకుంది. "ఒకందుకు ఇదే మంచిదేననిపిస్తోంది నాన్నా! అన్ని విషయాలూ తెలిసిన అతనే ముందుకొచ్చి పెళ్ళాడితే రేపు అక్క జీవితంలో ఏ పొరపొచ్చాలూ వుండవు!"

"నాకు ఈ పెళ్లి చేసుకోవాలని లేదు నాన్నా!" అంది సుశీల నెమ్మదిగా.

కూతురి సంగతి తెలిసిన ఆ తండ్రి చిన్నగా అన్నాడు "నీ సంగతి నాకు తెలీనిదిగాదుసుశీలా!కానీతలుపుతడుతున్న అదృష్టం ఇది. కాదనుకోవటం తెలివి తక్కువతనమే అవుతుంది! ఒకటి రెండు క్షణాల్లో ఆలోచించి నిర్ణయం తీసుకోవటం కన్నా ముందున్న జీవితం చాలా విలువైనది. దానికి తగ్గట్లు శాంతంగా సావధానంగా ఆలోచించుకోవటం మంచిది! నీ నిర్ణయం నువ్వు తీసుకుందువుగాని... కానీ ఇతన్ని చేసుకోవటమే నీకు అన్ని విధాలా మంచిది!"

రామనాథం లేచాడు.

ఆ చెట్టుకిందకు చేరినప్పటికన్నా ఇపుడా కన్నతండ్రిలో జీవం ఎక్కువగా ఉంది. జీవితం అంటే ఎంతో భయపడిన ఆ వృద్ధుడు ఆ క్షణంలో ఎంతటి కష్టాన్ని అయినా తట్టుకోగలిగిన ధైర్యం తనకుందన్నట్లు ధీమా వెలగబెడుతున్నాడు!

ఎంతలో ఎంత మార్పు!

ఈ ప్రకృతిలో ఒక పద్ధతి ఉందంటారు. ఒకచోట లోయ ఉంటే, దాన్ని బాలెన్స్ చేస్తూ పక్కనే ఓ పెద్ద పర్వతం ఉంటుంది. పసిఫిక్‌లో లోతైన అగాధాలుంటే వాటిని బాలెన్స్ చేస్తూ ఇటు హిమాలయ శిఖరాలు ఉండనేవున్నాయి. ఈ పద్ధతికి ఏవేవో పేర్లూ పద్దులు వుంటే ఉండొచ్చుగాక...కానీ వీటికి తగ్గట్టుగానే జీవితంలో కూడా అలాటి బాలెన్సింగ్ యాక్ట్‌లు వుంటాయన్నది ఇపుడు రుజువవుతోంది.

అక్క ఎదుర్కొన్న మానసిక సంక్షోభానికి, దాన్ని అర్థంచేసుకుని ఆదరిస్తాననే వ్యక్తి దొరకటం ఎంతటి విశేషం!

చీకటి వెలుగులు ఇంత పక్కపక్కనే వుంటాయా? అనుకుంది సుజాత.

కానీ ఆ సంబరంలోనూ తన కథ అకస్మాత్తుగా ముగింపుకు వచ్చేసిందే అన్న బాధ ఆ అమ్మాయిలో లేకపోలేదు.

ఖచ్చితంగా తాను చెప్పినట్లుగానే వారంరోజులకు మళ్ళీ రామనాథం ఇంటి ముందు స్కూటర్ ఆగింది.

రవీంద్ర ఆ ఇంటిమెట్లు ఎక్కాడు. అతనికి ఆ ఇల్లు సాదరంగా స్వాగతం పలి

కింది.

కాలెండర్‌లో ఆ పేజీ మారకుండానే రవీంద్ర, సుశీలలు దంపతులైనారు.

చాలారోజుల తర్వాత ఆ ఇల్లు ఆరోజు కళకళలాడింది. అయినా పెళ్ళికి రవీంద్ర తరపు వాళ్ళెవరూ రాకపోవటం మాత్రం సుశీలకు బాధగా అనిపించింది.

ఆమాటే అంది రవీంద్రతో. రవీంద్ర ఆ మాటతో నవ్వేశాడు. "నీకు తెలీంది ఏముంది చెప్పు! ఇలాటి పెళ్ళిళ్లు పాతతరం మనుషులకు నచ్చవు. వాళ్ళకు కట్నకానుకలు కావాలి. అందమైన అమ్మాయి కావాలి. ఏడు తరాల వంశచరిత్రలు కావాలి. అవన్నీ ఇక్కడ చూసుకుంటే జరిగేవా చెప్పు!... నువ్వేమీ బాధపడకు, మొదట్లో వాళ్లు కొంచెం బిగుసుకుని వుంటారు కానీ క్రమేణా వాళ్ళేవస్తారు!"

రవీంద్ర చెప్పిన ధైర్యం సుశీలకు తృప్తికలిగించింది.

నిజమే! ఇదితరాలమధ్యవున్న అంతరం కూడానూ!

కిందటితరం మనుషులు ఆస్తులు అంతస్తులకు ప్రాధాన్యతఇస్తుండేవారు. ఇప్పటి తరంవారుమనసులకు మమతలకు పెద్దపీట వేసున్నారు. తరం గడిచేకొద్దీ మనిషి ఎదుగుతున్నాడు. సంకుచితత్వం తగ్గుతోంది. విశాలహృదయం ఉన్న వాళ్ళు సంఖ్యాపరంగా ఎక్కువవుతున్నారు.

పెళ్ళయిన రెండోరోజున సుశీల రవీంద్రను ముకుందరావుగారి దగ్గరకు తీసుకెళ్ళింది. భర్తను పరిచయం చేసింది.

సాదరంగా వారికి స్వాగతం చెబుతూ అన్నాడు ముకుందరావు "మిమ్మల్ని ఎక్కడో చూసిన గుర్తుంది నాకు"

రవీంద్ర నవ్వుతూ అన్నాడు "ఏకేసులోనూ దోషిగా మాత్రం నన్ను మీరు చూడలేదు! ఈ సుశీలకేసు సమయంలోనే కోర్టుకు తరచుగా వచ్చేవాడిని. కేసుమీద ఇంటరెస్ట్‌తో కాదు సుమండీ! పెళ్ళిచేసుకొన్నా గాబట్టి చెప్పుకొన్నా ఫర్వాలేదు, సుశీలమీద ఇంటరెస్ట్‌తోనే"

ముకుందరావు నవ్వాడు "మీరలా అంటే సరదాగా కొన్ని ప్రశ్నలు వేయాలనిపిస్తోంది నాకు"

"సర్, మీరు జడ్జి అయ్యారంటేనే ప్రశ్నలువేసే అధికారం మీరు కోల్పోయినట్లేగదా. అయినా సరే అడగండి పెద్దలు ఏమడిగినా చెప్తాను"

"అబద్ధాలు చెప్పకండేం! కోర్టులో అబద్ధాలుచెప్తే కూడా శిక్షపడుతుంది తెలుసా?"

"సరే అయితే! బోనులోకి ఎక్కముందే ప్రమాణం చేస్తాను. దేవుని సాక్షిగా నిజమేచెప్తాను. నిజంతప్ప మరేమీ చెప్పను. నౌ యుకెన్ ప్రొసీడ్ సర్" అంటూ నవ్వాడు రవీంద్ర.

"దెన్ లెట్‌మీ ఆస్క్ - ఎందుకు చేసుకున్నారు మీరు సుశీలను, చెప్పండి"

ఆ ప్రశ్నకు ఆదంపతులు ఇద్దరూ ఉలిక్కిపడ్డారు. తన మనసులోవున్న ప్రశ్న అది. ఆఖరికి ముకుందరావు అడగనే అడిగాడు అనుకుంది సుశీల.

రవీంద్ర చిన్నగా నవ్వాడు. ఆ నవ్వులో అతను తన ఉలికిపాటును కప్పిపుచ్చుకొంటున్న సంగతి సుశీలకు తెలుస్తూనేవుంది.

"సర్, ఈ ప్రశ్న సుశీలే అడుగుతుందనుకొన్నా నేను. కానీ తను అడగటానికి ఇంకొంత కాలం పట్టేలా ఉంది. ఈలోగా మీరే అడిగారు. సమాధానం చెప్తాను. ఒక్కోమనిషికి ఒక్కో బలహీనత ఉంటుంది. నాకున్న బలహీనత

సుశీల! ఆమెను మొదటిసారి చూసినప్పటి నుంచీ నాకామె అంటే... ఇట్స్వాల్ రైట్. ఆ కోరిక తీర్చుకోవాలంటే పెళ్ళిచేసుకోవటం ఒకటే మార్గమని నాకు తెలుసు. పైగా సుశీలను పెళ్ళిచేసుకొంటే తెలిసో తెలియకో ఒక మంచిపని చేశాననే సంతృప్తి నాకు జీవితాంతం మిగులుతుంది. ఆ తృప్తికోసం కూడా నేను సుశీలను పెళ్ళాడాననే చెప్పచ్చు"

ముకుందరావు నవ్వాడు "నేనేదో సరదాకు అడిగిన ప్రశ్న అది. అయినా నిజంగానే మీరు నా ప్రశ్నలకు నిజాయితీగా సమాధానం ఇచ్చారు. ఐలైక్ యు, యువర్ ఆన్సర్స్ టూ"

"థాంక్స్!" అన్నాడు రవీంద్ర నవ్వుతూ.

ముకుందరావు లోపలికివెళ్ళి తన భార్యను పిలుచుకొచ్చాడు.

"నాభార్య పేరు మాయ... మీరడగకపోయినా ఒక్కవిషయం చెప్తాను. ఒకప్పుడు నా భార్య పూర్తిగా రెడ్‌లైట్ ఏరియాలో ఉండేది. బ్రోతల్ కేస్‌లో కోర్టుకు వచ్చినపుడు చూశాను. అంతమంది అమ్మాయిల్లో ఎందుకు మాయే నాకు నచ్చిందో నాకు తెలీదు. కానీ నచ్చింది. మర్నాడు ఆ సబిన్స్పెక్టర్‌ను పట్టుకొని మాయఅడ్రస్ తెలుసుకొన్నాను. ఆ తర్వాత వెళ్ళి ఆ రాత్రికి వందరూపాయలు ఇచ్చి పెళ్ళిచేసుకొంటావా అని ఒకే ఒక్కమాట అడిగివచ్చేశాను. ఆ తర్వాత... ఇదిగో - ఇప్పుడు నా ఇంటి ఇల్లాలయింది"

సుశీల నివ్వెరపోయి చూస్తూ ఉండిపోయింది ఆవిడకేసి. భర్త తన గురించి అంత స్పష్టంగా ఎవరికో చెప్తోంటే ఆమె అంత నిర్వికారంగా ఎలా ఉండిపోయిందో సుశీలకు అర్థంకాలేదు.



అదే అడిగింది చిన్నగా "మీరేమీ అనుకోనంటే ఒక్క ప్రశ్న! ఆయనలా చెప్తోంటే మీకు ఇబ్బందిగాలేదూ?"

మాయ నవ్వింది "ఆయన అబద్ధంచెప్తే బాధపడాలిగానీ, నిజం చెప్తే బాధ పడటం దేనికి? మా గురించి ఇంకొకళ్ళు ఎవరో మీకునిజంచెప్పటంకన్నానాఅంతట నేనో, ఆయనో ఎవళ్ళమో ఒకళ్ళం చెప్పడం మంచిదిగదూ. పైగా ఈ విషయంమానోట వింటేనే మీకు మేమంటే అభిమానమైనా ఉంటుంది. అదే ఇంకోళ్లు చెబితే, ఈ అభిమానం కూడా ఉండదని మాకు తెలుసు"

సుశీల ఆ నిజాయితీకి జోహార్లు పలికింది మనసులోనే.

"మరి మీకే ఇబ్బందులూ ఎదురు కాలేదా?"

"అయ్యాయి. అవుతాయని తెలిసే పెళ్లాడా గదా, మరి బాధలెదురైతే బాధ పడటందేనికీ...." నవ్వేశాడు ముకుంద రావు.

"యూ ఆర్ గ్రేట్, సర్" అంది సుశీల.

"ఆమాట అన్నావుగదా, ఒక్క సాయం అడుగుతా, చెయ్యి మాయకు ఇక్కడికి రాక మునుపే పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ అయి పోయింది. నువ్వు కొంచెం తొందరపడి ఓ ఇద్దర్ని మాకోసం కనిపెడితే అదే పదివేలనుకుంటాం.నీపేరుచెప్పి మా వంశాన్ని వృద్ధి చేసుకొంటాం" ముకుందరావు మాటల్లో హాస్యం దొర్లుతున్నట్లున్నా, ఆ మాటల వెనక బాధ ఏమిటో సుశీలకు అర్థం అవుతూనే వచ్చింది.

ఇంకో అరగంటసేపు ఆ ఇంట్లో ఆదంపతుల మధ్య గడిపి వెనక్కు మళ్ళారు రవీంద్ర సుశీలలు.

తిరిగి వస్తోంటే అంది సుశీల "ఇలాటి వ్యక్తుల్ని చూస్తోంటే అనిపిస్తుంటుంది ఈ ప్రపంచం ఎంత పెద్దదోనని! మనకు తెలిసిన ప్రపంచం ఎంత. మనం ఎంత. రోడ్డు పక్క ముష్టివాడికి అయిదుపైసలు పడేసి దాని గురించి చెప్పుకొనే మనం ఈ ముకుందరావులాటి వ్యక్తులముందు ఎంతటి అల్పులమో ఇపుడు తెలుస్తోంది నాకు. ఇలాటి వారిని చూస్తోంటేనే... మనమూ ఏదైనా ఘనకార్యం చేసి, ఇంత అనామకంగా బతికితే ఎంత బాగుంటుందీ అని!"

రవీంద్ర నవ్వాడు "అందరికీ ఆ అవకాశంరాదు. అలాటి అవకాశం వచ్చినా దాన్ని ఉపయోగించుకొనే వారు కొందరే ఉంటారు"

"ఆ అవకాశం లభించి ఉపయోగించుకున్న వారు ... మీలా నూటికో, వేలకో ఒక్కరు ఉంటారు కాబోలు" సుశీల మనస్ఫూర్తిగా అంది.

రవీంద్ర చిన్నగా అన్నాడు "నువ్వు ఈమాట చాలసార్లు అన్నావు కాబట్టి చెప్తున్నాను. నేనేదో అపూర్వమైన త్యాగం చేశానని నేను అనుకోవటం లేదు. ఇదసలు ఒక రకంగా చెప్పాలంటే నా బాధ్యత కూడానూ"

"బాధ్యత.ఇందులో బాధ్యతఏమిటి?" ఆశ్చర్యంగా అడిగింది సుశీల.

"బాధ్యత అంటే నువ్వేదో వేరుగా అర్థం చేసుకుంటున్నట్లుంది. నా ఉద్దేశం అదికాదు. మనిషిగా పుట్టిన మనకు మానవత్వ పరంగా కొన్ని బాధ్యతలుఉంటాయి. అవి నిర్వహించటం నిర్వహించకపోవటం మన ఇష్టం. ఇష్టముండి చేశామా, తృప్తిగా బతకొచ్చు. చెయ్యకపోయినా కొంపేమీ మునిగిపోదు. నీ విషయంలో ఈపని చెయ్యగలనూ అనిపించింది. చేశాను అంతే"

ఆమాటలు విన్నాక భర్తంటే ఇంకా చాలా గౌరవం పెరిగింది సుశీలకు.




రవీంద్రను చూస్తోంటే సుశీలకు ఆశ్చర్యంగా ఉంటుంది. నిజంగా ఒక మనిషి ఇంత ఎత్తులకు ఎదగగలడా అన్నది ఆమెకు సందేహంగానే ఉంటుంది.

మామూలు లోకం దృష్టిలో తను మైలపడిన మనిషి. ఈ సమాజం చాలా చిత్రమైనది. ఇక్కడ హత్యలు చేసిన వాడు తలెత్తుకు బతుకుతాడు. దోపిడీలు చేసినవాడు దొరలాగ బతుకుతాడు.. మోసాలుచేసి మడులు, మాణిక్యాలు సంపాదించుకొన్నవాడూ మహరాజులాగ ఓ వెలుగు వెలుగుతుంటాడు. పదిమంది స్త్రీలనుపాడుచేసినవాడూ పబ్లిగ్గా ఛాతీలెత్తుకొని బతుకుతుంటాడు. కానీ ... తన తప్పులేకపోయినా శారీరకంగా అబల అయిన కారణంగా ఏ పురుషుడి అహంకారానికో బలి అయిపోయిన ఆడది మాత్రం ... తలవంచుకొని బతకాల్సి వస్తోంది. అలాంటి స్త్రీని ఈ సమాజం వెలివేస్తుంది. అవకాశంవుంటే వెలయాలిని చేస్తుంది. ఎవ్వరూ గౌరవించరు ఆమెను. ఎవ్వరికీ...ఆఖరికి ప్రభుత్వానికి కూడా పట్టదు ఆమె దుర్గతి.

అలాటి దురన్యాయం విచ్చలవిడిగా ఉన్న ఈ సామాజికారణ్యంలో... తను తలెత్తుకు బతుకుతోంది. దానికి కారణం రవీంద్రే.

పిలిచి పెళ్ళాడాడు. కోరి అందలాన్ని అందించాడు. అపురూపంగా చూసుకొంటున్నాడు. అపూర్వ ప్రేమాభిమానాలు తనపరం చేస్తున్నాడు.

నిజంగా ప్రేమించి పెళ్ళాడిన భర్త అయినా ఇంత అనురాగంతో చూసుకొంటాడా అనేది సందేహమే.

ఓ రోజు...

ఆదరాబాదరాగా వస్తాడు ఇంటికి. స్కూటర్‌మీదనుంచి సరిగ్గా దిగుతాడో లేదో ఆఘమేఘాలమీద వచ్చి తుఫానులా చుట్టుముడతాడు. ఆ ఉక్కిరిబిక్కిరిని తాను తట్టుకొనేలోగానే-

"తయారవ్" అంటాడు.

"ఎక్కడికి?" అని ప్రశ్నిస్తుంది సుశీల.

"కుమార్ అని నా స్నేహితుడున్నాడు. వాడింటికి వెడదాం. ఎన్నాళ్ళనుంచో పిలుస్తున్నాడు రమ్మని" అంటాడు రవీంద్ర.

సుశీల తల ఊపుతుంది అడ్డంగా. "మీకు మొన్న చెప్పాను నేను-ఏ స్నేహితుల ఇంటికీరానని. మనముందు ఆదరంగా పలకరించే వాళ్ళు మన వెనుక హీనంగా మాట్లాడు కొంటారు. నా గురించి ఏమన్నా పట్టించుకోను, వాళ్ళేమనుకున్నా అది నిజమేగనక. కానీ మీ గురించి, మీ మంచితనం గురించి వాళ్ళు ఏవేవో అంటారు. మీ ఆదర్శాలను అపహాస్యంచేస్తారు. మీ మంచితనం వారికి మీచేతగానితనంగానే కనిపిస్తుంది. నాకది ఇష్టంలేదు...నేనురాను" అంటుంది సుశీల.

"పోనీ అలా ఏ పార్కుకో వెడదాం. రా" అంటాడు రవీంద్ర.

ఆ సంబరమూ చూసింది సుశీల.

పార్కులోకి వెళ్ళగానే అక్కడి వారికి పిరో ప్రదర్శనలో బొమ్మల్లా అయి పోతారు. అంతసేపు చెట్లూ చేమలు చూస్తున్న జనం ఆపైన వీరిని చూడనా రంభిస్తారు. వీరికి వినిపించని గుసగుసలు ఉండనే ఉంటాయి.

"ఏ పార్కుకూ రాను" అంటుంది సుశీల, అది గుర్తొచ్చి.

"పోనీ ... సినిమాకైనా వెడదాం"

సరేనని ... ఓసారి ఓ సినిమాకు వెళ్లారు. మొదటి ఆటచూసి తిరిగి ఇంటికి వస్తున్న కొత్తదంపతుల జంటను అట కాయిస్తారు కొందరు దుండగులు. ఆ భర్త చూస్తుండగానే ఆ అమ్మాయిని అందరూ మానభంగం చేస్తారు. ఇంటికొచ్చిన ఆ దంపతులు డబ్బా విషం కొనుక్కొని చస్తారు. సినిమా చూస్తోంటే సుశీలకు తన ఒంటిమీద తేళ్ళూ జెర్రులు పాకు తున్నట్లు అనిపించింది.

"నేరం చేసినందుకు వాళ్లు చావాలి గానీ, వీళ్ళెందుకండీ చావటం?" అని భర్తను నిలదీసి అడిగింది ఒళ్లుమండి.

"అందరికీ నీ అంత ధైర్యం, మొండి పట్టుదల ఎక్కడ ఉంటుంది చెప్పు?" అన్నాడు రవీంద్ర.

"అంటే నేను మొండిదాన్ని అంటు న్నారా మీరు?" అంటూ గొడవేసుకొంది.

"కాదుసుశీలా..నీమూడ్ బాగుండలేదు. ఊర్కో" అంటూ సర్దిచెప్పి టాకీసు లోంచి భార్యను ఇంటికి తెచ్చేసరికి అతని తల ప్రాణం తోకకువచ్చిచేరింది.

అందుకే అది గుర్తుంటే ....

"నేనేసినిమాకూ రాను. ఈ సినిమాలన్నీ అధైర్యం నూరిపోస్తున్నాయి. ధైర్యంగా తలెత్తుకు బతకమనిచెప్పే సినిమా ఒక్క టంటే ఒక్కటి కనిపించదేం?" అంటుంది సుశీల.

"పోనీ-అలా అలా ఊరిచివరికి వెళ్ళొద్దాం పద" అంటాడు రవీంద్ర.

అప్పటికి రాజీ కుదురుతుంది ఇద్దరికీ.

స్కూటరెక్కి బయలుదేరతారు కొత్తగా రెక్కలు వచ్చిన పక్షుల్లాగా. కిలోమీటర్లకు కిలోమీటర్లు అలా వెళ్ళి పోయి, ఆ తర్వాత వెనుదిరిగివస్తారు.

ఇంకోరోజు-

"ఇంకా తయారవలేదా?" అంటాడు ఇంట్లోకి వచ్చీరాగానే రవీంద్ర.

"ఏం...ఏంపనుందని?" అంటుంది సుశీల.

"నిజమేలే...నీకు గుర్తు ఉంటుందని నేను అనుకోవటమె తప్పు"

"ఏముందిగుర్తుండటానికి..చెప్పండి?"

"ఆలోచించు. ఈరోజు ప్రత్యేకత ఏమిటో...నీకే తెలుస్తుంది"

"ఏమిటబ్బా" అని ఆలోచిస్తుంది సుశీల. ఎంత ఆలోచించినా ఆమెకు ఆరోజు ప్రాముఖ్యత ఏమిటో ఏటి గుర్తుకు రాదు.

"ఏమిటో మీరేచెబుదురూ" అంటుంది సుశీల.

"ఈరోజుకు మన పెళ్ళయి సరిగ్గా నాలుగురోజులు" అంటాడు రవీంద్ర.

సుశీల నవ్వుతుంది. "అయితే ఏమి టట?" అని ప్రశ్నిస్తుంది.

"అయితే ఏమిటా? అదెంతమంచి అకేషనో ఆలోచించు. నీకో కొత్తచీర కొందామనుకుంటే, నువ్వేమో.." అంటూ మూతి ముడుచుకుంటాడు రవీంద్ర.

సుశీలకు భర్తంటే ఒక్కసారి ప్రేమ ఉప్పొంగుతుంది-ఇంతటి ప్రేమకు తను అర్హురాలా అన్న ప్రశ్న ఆమెను వేధి

"మెరి" ....మిరిమిట్లు గొలిపే ప్రపంచ ప్రసిద్ధిపొందిన 22ct
గోల్డు కవరింగు నగలు!

తరములకు తారవంటిది! అందాన్ని అధికమించేది అందరిని ఆకర్శించేది, గ్యారంటీతో ఎనలేని డిజైన్లులతో మురిపించేది. అందులో మీకు కావలసిన నగల నెంబర్లు గుర్తించండి. ఆ నగలు మీకు పంపబడును. వి.పి.పి. చార్జీలు ఎక్స్ట్రా. క్యాటలాగు ఉచితముగా పంపబడును. వెంటనే వివరములకు వ్రాయండి.

No.206 Rs. 150/50

No.207 Rs. 150/50

No.93 Rs. 75/50

No.70 Rs. 50/50

No.71 Rs. 50/50

No.96 Rs. 75/50

No.105 Rs. 150/50

No.129 Rs. 50/50

No.99 Rs. 75/50

No.29 Rs. 200/50

No.30 Rs. 200/50

HEAD CHUTTY

No.162 Rs. 65/50

No.9 Rs. 200/50

No.10 Rs. 200/50

No.118 Rs. 40/50

No.119 Rs. 40/50

No.74 Rs. 75/50 STONE

No.181 Rs. 65/50

No.121 Rs. 40/50

No.122 Rs. 40/50

No.149 Rs. 100/50

No.150 Rs. 100/50

No.46 Rs. 150/50

No.145 Rs. 80/50

No.39 Rs. 200/50

No.109 Rs. 40/50

No.110 Rs. 40/50

No.151 Rs. 100/50

No.152 Rs. 100/50

No.180 Rs. 40/50

No.193 Rs. 65/50

# MERI GOLD COVERING WORKS

P.O. BOX : 1405, 14, RANGANATHAN STREET,
T. NAGAR, MADRAS-600 017, INDIA.

స్తుంది. అప్పుడు లేచి భర్తకు నిరాశ కలిగించకూడదనే ఉద్దేశంతో తయారవు తుంది. అప్పటికప్పుడు వెళ్ళి ఏ బట్టల కొట్లోనో దూరతారు. ఒకటో రెండో చీరలు కొనుక్కుని ఇంటికి మళ్ళుతారు.

ఇంటికి వచ్చాక అంటుంది సుశీల- "మీకు నేనంటే ఎంత..." ఆగిపోతుంది అక్కడ ఏమాట అనాలో తేల్చుకోక, తేల్చుకోలేక.

ఇది సానుభూతా? అయివుండదు. సానుభూతి మాత్రమే అయితే వంద రెండువందలు, వెయ్యి రెండువేలు పారేసి వెళ్ళిపోయి ఉండేవాడు. కనుక ఇది సానుభూతికాదు.

మరి ప్రేమేనా ఇది?

మలినమైన మనిషి తను. తనను ఇంత నిష్కల్మషంగా ప్రేమించటం సాధారణ మానవునికి సాధ్యమా?

కాదు... ఈగుణమూ అసాధారణమే.

ఇది రవీంద్రకే ప్రత్యేకం. ఇది అతని వ్యక్తిత్వం మాత్రమే మనుషుల్లో మనిషి తన భర్త. మానవలోకానికే తలమానికం తన భర్త. ఆమెకా ఉద్దేశం కలిగిన తర్వాత ఆ దంపతుల మధ్య మాటలకు చోటుండదు.

రోజూ పెళ్ళయిన తొలిరోజులాగే గడుపుతున్నారు ఆ దంపతులు. రామనాథానికి కూడా సుశీల బతుకు ఏమవుతుందోనన్న చింత తగ్గింది. ఇపుడు మళ్ళీ బాగా కోలుకోగలిగాడు. శారీరకంగా బాగున్నపుడు మనిషికి బాధ్యతల గురించిన ఆలోచనలు పెరుగుతాయేమో. రామనాథం విషయంలో అదే జరిగింది. అతనికి రెండోకూతురు సుజాత పెళ్ళి మీద ధ్యాస పెరిగింది.




ఆమాటే అన్నాడు ఓరోజు సుజాతతో.

"నిన్ను ఓ అయ్య చేతిలో పెట్టి బాధ్యత తీర్చుకొంటే ఆ తర్వాత నేను హాయిగా విశ్రమించగల అవకాశం ఉంటుంది. ఆపని చెయ్యటానికి ఇపుడు ఒంట్లో ఓపికా ఉందిగదా! రేపెళ్ళి ఓ నాలుగు జతల చెప్పులు కొనుక్కొస్తా!"

"అవెందుకు?" అనడిగింది సుజాత.

"చెప్పులు అరిగేలా తిరగాలిగదా, అల్లుడికోసం అన్వేషణలో! సరైన అల్లుడిని వెతుక్కోవటానికి ఆమాత్రం కష్టపడ్డా ఫర్వాలేదనుకొంటా!"

గోపీ నవ్వాడు-"ఇపుడు ఆశ్రమేమీలేదునాన్నా! ఆడపిల్ల పెళ్ళి కూడా చాల ఈజీ అయిపోయింది. అలా తల్చుకొంటేచాలు, ఇలా పెళ్ళిచేసిపారెయ్యొచ్చు!"

"అదేమిట్రోయ్. అంత తేలికపద్ధతులు ఏమున్నాయ్‌చెప్పు!"

"లేకేం-వరసగాచెప్తా విను-ఇపుడు కులాలవారీగా, మతాలవారీగా పెళ్ళిళ్ళు కుదిర్చే మారేజీ బ్యూరోలు వీధికొకటి వెలిసాయి. అక్కడికివెళ్ళి, మనకు కావాల్సిన అల్లుడి లక్షణాలు, అర్హతలు చెప్తేచాలు, అయా అరల్లోంచితీసి ఉప్పు, పప్పు అందించినట్లు ఆ బ్బాయిల అడ్రసులు అందిస్తారు. మనం కాకిచేత కబురుపెడితే ఆ అబ్బాయివచ్చిమనముందు వాలతాడు. బాగున్నాడా, మనకునచ్చాడా ఓకే, అడిగినంత కట్నం ఇచ్చి కట్టిపడేసుకోవటమే. నచ్చలేదా మరొకణ్ణి వెతుక్కుంటాం!"

కొడుకు చెప్తున్నతీరు రామనాథానికి నవ్వుతెప్పించింది. "ఇదిసరే, ఇంకా ఏమున్నాయి పద్ధతులు చెప్పు!"'అన్నాడు.

"పేపర్లలో 'వరుడుకావాలి!' అని

ఓ ప్రకటన వేసిపారేస్తాం. నీకు తెలీదు నాన్నా! మనం అల్లుళ్ళ కోసం ఎలా వెతుక్కుంటూ ఉంటామో, కోడళ్ళ కోసం, భార్యల కోసం పేపర్లలో వెతుక్కొనే పురుష పుంగవులూ కోకొల్లలుగా ఉన్నారీదేశంలో! వాళ్ళలో ఓ గంతకుతగ్గ బొంత దొరికితేచాలు,మనపని జరిగిపోతుంది!"

"ఇది బాగున్నట్లుగా ఉందిరా. కూరగాయల సెలక్షన్‌కన్నా పేపర్ ప్రకటనే బాగున్నట్లుంది!"

"ఇంకో పద్ధతీ ఉంది. ముందు చెప్పిన రెండూ మోడరన్ వేటపద్ధతులైతే ఇపుడు చెప్పేది పాతకాలం చింతకాయపచ్చడి పద్ధతి. ఎటొచ్చీ దీనికి ఘాటైన పోపు పెట్టామన్నమాట ఇపుడు. ఇది ఆధునిక స్వయంవరం! ఆఫ్‌కోర్స్, ఇదీ కులాల పద్ధతిలోనే జరుగుతోందనుకో! ఒక్కో కులంవాళ్ళు ఒక్కో ఆదివారంనాడు స్వయంవరం ఏర్పాటుచేస్తారు. స్వయంవరానికి వచ్చినవాళ్ళు తమకునచ్చిన జతను ఎంచుకోవటమే ఈపద్ధతి. అయితే అన్ని పద్ధతుల్లోనూ కట్నాలు ఇచ్చిపుచ్చుకోవటం మాత్రం ఉండనే ఉంది!

"అయితే మనం ఏపద్ధతిలో వెడదామంటావ్‌రా!'' రామనాథం అడిగాడు.

"అన్నిటికన్నా తేలిక మేట్రిమోనియల్ కోలమ్! ఇదిగో, ఇక్కడో అమ్మాయి ఉంది. కావాలంటే వచ్చి చూసుకు వెళ్ళండని పేపర్లో వేసెయ్యటమే మంచి పద్ధతి!" గోపీ సలహా ఇచ్చాడు.

రామనాధానికీ అది నచ్చిందిగానీ సుజాత మాత్రం దాన్ని వీటో చేస్తానంది.

''అదేంటమ్మా!...''

"నాకు పెళ్ళొద్దు నాన్నా! నాకు పెళ్ళిమీద అసలు ధ్యాసేలేదు!"

"పెళ్ళికిముందు అందరూ ఇంతే నాన్నా! ఇలా సిగ్గులుపోయిన ఆడాళ్ళు పెళ్ళయిన తర్వాత ఒక్కరోజంటే ఒక్కరోజుకైనా పుట్టింటి ముఖం చూడరు. అక్కను అడిగేదేంటి మన నిర్ణయం మనం తీసుకొని ప్రొసీడ్ అయిపోదాం''

రామనాథం ఓకే చేశాడు ఆ ప్రపోజల్‌ను.

సుజాత వద్దంటున్నా వినకుండా ఆ తండ్రీ కొడుకులు ఇద్దరూ కలిసి తక్కువ మాటల్లో వీలైనంత ఎక్కువగా తమ వివరాలు చెప్పే ప్రకటన తయారు చేయటంలో నానాకు స్తీలుపట్టారు. మొత్తానికి ఒకటి తయారుచేసి ఇద్దరూ "బాగుంది, బాగుంది!" అనుకొన్నారు.

సుజాత నవ్వుతూ అంది. "ఇంత మీరు చేస్తున్నారు కానీ...చివరికి నేను పెళ్ళికి ఒప్పుకోనంటే సరిపోతుంది. ఆ ఎంచుకొచ్చిన అబ్బాయిల్లో ఒకణ్ని మన గోపీగాడికి కట్టబెట్టండి!"

గోపీ నవ్వాడు ''ఏదో జోకు అనుకొంటున్నావ్‌కాబోలు! ఇపుడు ప్రపంచం అంతటా అదే ఫ్యాషన్! మగాణ్ని మగాడే పెళ్ళాడటం అన్నిదేశాల్లో ఉన్నసంగతే! మన దేశంలోకూడా ఆ పద్ధతిని ప్రవేశపెట్టిన ఘనత నాకే దక్కుతుంది! అప్పుడు మా సంసారాన్నిచూసి నువ్వు కుళ్ళిపోవాల్సిందే ఈర్ష్యతో!''

'మాసంసారం'అన్నమాటవినిసుజాత పకపకానవ్వింది. ఆడా మగా చేసేది సంసారం అయితే మగా మగా చేసేదాన్నీ సంసారమే అంటావా? అసలు ప్రకృతికి విరుద్ధంగా మనుషులు అలా ఎలా కలిసిపోతారు? అది సంస్కారహీనంకాదూ? అసహ్యం ఉండదూ?

జైళ్ళలో ఉండేవాళ్ళల్లో ఇలాంటి

విపరీత పద్ధతులు ఉన్నాయంటే అర్థం ఉంది. స్వాభావికంగా బతకగలిగిన అవకాశం అక్కడి ఖైదీలకు ఉండదు. వాళ్ల అందుకే ఇలాంటి విపరీత పద్ధతులకు పాల్పడుతూ ఉండొచ్చు. కానీ నిక్షేపంగా అన్ని సుఖసౌఖ్యాలకూ అవకాశం ఉండే మిగిలినవాళ్లకెందుకూ ఈ పాడు పద్ధతులు... అనుకొంది సుజాత.

అలా అనుకొంటూ ఉండగానే సుజాతకు కృష్ణ గుర్తొచ్చాడు.

అతను...తన జీవితంలోకి ప్రవేశించినపుడు మల్లెలు పూచినట్లయింది. మరి ఏం జరిగిందో? ఆ మనసులో ఏక్షణాన ఏ దెయ్యాలూ భూతాలూ ప్రవేశించాయో అలాటి ఘాతుకానికి ఒడిగట్టాడు. ఫలితంగా అక్క జీవితం గాడి తప్పిపోయే ప్రమాదం ఎదురయింది. అదృష్టం బాగుండి అక్క నిలదొక్కుకోగలిగింది. కానీ ఆ దురదృష్టం తనను వెంటాడి తన బతుకులో బూడిదపోసి పోయింది.

కృష్ణ ఏమయ్యాడో తెలీదు. పోలీసుల పాలయిన మనిషి బతికి వస్తాడనే నమ్మకమేలేని రోజులివి. అలాటిది జైలుకే వెళితే ఇక చెప్పేది ఏముంది? జైల్లో తోటిఖైదీలు పీక్లను కాల్చుకొని తినొచ్చు. జైలు కాపలాఉండే అధికార్లే వాళ్ళ కళ్లల్లో ఏ యాసిడ్లోపోసి గుడ్డివాళ్లనూ చెయ్యొచ్చు. ఇవేవీ కాకపోతే, పారిపోయే ప్రయత్నాలు చేశాడని చెప్పి ఏ తుపాకీ గుండుకో బలిచెయ్యనూ చెయ్యొచ్చు. తెలీదు...ఏం జరుగుతుందో తెలీదు.

అతని జీవితం ఎన్ని మలుపులు తిరుగుతుందో అదీ తెలీదు. ఊహకు సైతం అందని బతుకయింది అతనిది.

...సుజాతకు కళ్లమ్మట నీళ్ళు చిమ్మాయి.

రామనాథం ఇచ్చిన ప్రకటన పేపర్లో రానే వచ్చింది. వందల్లో కాకపోయినా కనీసం పదుల సంఖ్యలోనైనా జవాబులు వస్తాయని ఆశించినవారికి నిరాశే ఎదు



రయింది. పన్నెండుమంది, మరిన్ని వివరాలు కోరుతూ ప్రకటనకు జవాబు రాశారు. ఆ వివరాలన్నీ రాస్తూ గోపీ, రామనాథాలు జవాబులిచ్చారు.

అంచెలంచెలుగా ఆరంభమయిన ఆ పెళ్ళి ప్రకటన కథకు సుజాత ఎప్పటి కప్పుడు అడ్డుకట్టలువేసే ప్రయత్నం చేస్తూనే వచ్చింది కానీ... అవేమీ ఆమె ఆశించిన సత్ఫలితం ఇవ్వనేలేదు.

సుజాత పెళ్ళి ప్రకటనకు జవాబు ఇచ్చినవారిలో చివరివరకు తేలిన సంబంధాలు మూడే మిగిలాయి.

"వీటిలో ఏ ఒక్కటి మిగిలినాచాలు" అప్పటికే నిరాశ పూర్తిగా ఆవరించిన రామనాథం అన్నాడు.

"మనకు కావాల్సింది ఒకటేగదా! వందల సంఖ్యలో జవాబులు వస్తే మాత్రం ఏంలాభం? నికరంగా మిగిలే సంబంధం ఒక్కటి చాలు మనకు" అంటూ ధైర్యం చెప్పాడు గోపీ రామనాథానికి.

రామనాథం తల పంకించాడు ఆ మాటా నిజమేనన్నట్లు.

ఆ మూడు సంబంధాల వాళ్లకు ఉత్తరాలు రాశారు. వచ్చి పెళ్ళిచూపులు చూసుకొంటే, ఆతర్వాత తతంగాన్ని ఆతర్వాత పూర్తిచేసుకోవచ్చునని.

"నాకొద్దు నాన్నా ఈ పెళ్ళి... ఎందుకో నా మూడ్ పెళ్ళివైపు మొగటం లేదు. మీకు చెబితే అర్థంకావటంలేదు" అంది సుజాత.

రామనాథం కూతురికి నచ్చజెప్పే ప్రయత్నంలో అన్నాడు - "మొదలు పెట్టాం ఎలాగూ ఈ ప్రయత్నాలు. వీటిని ఒక కొలిక్కిరానీ. అపుడు ఆలోచిద్దాం నీ సంగతి. అదృష్టం బాగుండి వీటిలో ఏ ఒక్కటి కుదిరినా పెళ్ళి చేసుకో. అది నీకూ మంచిది, ఈ కుటుంబానికీ మంచిది. ఆడది ఒంటరిగా బతకగల రోజులుకావు ఇవి. అక్క జీవితాన్ని చూసి కూడా నువ్వు ఆ విషయం అర్థం చేసుకోకపోవటం నా దురదృష్టం. రేపో మాపో ఏ హార్ట్ఎటాకో వచ్చి నేనుపోతే, ఇపుడింత ఆప్యాయత వలకబోసే గోపీగాడు నీ ముఖాన్ని కూడా చూడడు. అపుడు నువ్వు ఒంటరిగా మిగులుతావు. ఆ ప్రమాదానికి నువ్వు గురికాకూడదనేదే నా ప్రయత్నం. నిజానికి నువ్వు నాకు సాయం చేయాల్సింది పోయి ఇలా మొరాయించటం ఏమీ బాగోలేదు...ఆలోచించు, అర్థంచేసుకో"

సుజాత ఆలోచనల్లోపడింది. ఎంతైనా తన తండ్రిది కన్నకడుపు తీపి. అందుకే జాగ్రత్తపడుతున్నాడు.

జీవితం ఏ మలుపు ఎందుకు తీసుకుంటుందో తెలిని పరిస్థితిలోవుంది. దాన్ని ఆవిధంగానే తీసుకోవటంలో లాభం, మంచి ఉండేటట్లయితే-ఆ పనేచేస్తే సరిపోతుంది - అనుకొంది సుజాత.

"నీ ఇష్టం నాన్నా...కానీ ఒక్క మాట. ఈసారి ప్రయత్నాలు విఫలమైతేమటుకు నన్నడగకుండా ఇంకో ప్రయత్నం తలపెట్టకు" ఖచ్చితంగా చెప్పింది సుజాత.

"ఆ మాటన్నావ్ ప్రస్తుతానికి బాగుంది" అన్నాడు రామనాథం తృప్తిగా.

ఆ తర్వాత రామనాథంవెళ్ళి ఆ పెళ్ళి కొడుకుల్ని స్వయంగా పెళ్ళిచూపులకు ఆహ్వానించాడు.

"ముగ్గురూ ఒకే రోజువస్తే ఏం చేస్తావ్ నాన్నా?" వేళాకోళం ఆడింది సుజాత.





"ముగ్గుర్నీ పిలిచాను. వస్తానన్నది ఒకరే. ఇంకో ఇద్దరికి ఇపుడు వీలు కాదన్నారు. ఎప్పుడు వచ్చేదీ వాళ్లు ఉత్తరం రాస్తామని చెప్పారు"

"అంటే గండం గడిచినట్లేలెక్క" అంది సుజాత.

కానీ అసలైన గండం ఆ తర్వాతే ఆమెకు ఎదురయింది.

అనుకున్న రోజున ఆ పెళ్ళికొడుకు తల్లిదండ్రులతో వచ్చి దిగాడు. మర్యాదలన్నీ అందిపుచ్చుకున్నారు. సుజాతనూ చూశారు. ఆ అమ్మాయి తనకు నచ్చిందనీ చెప్పాడు - పెళ్ళిచూపులకొచ్చిన పెళ్ళికొడుకు. రామనాథం సంతోషానికి పట్టపగ్గాలు లేకపోయాయి.

"అమ్మాయి పెళ్ళి అయిపోతేచాలు. ఇక మిగిలింది వాడొకడే!మగాడు...ఎలాగైనా బతికిపోతాడు. వాడి గురించి పట్టించుకోవాల్సిన పనేవుండదు" అంటూ తన సంతోషాన్ని వ్యక్తంచేశాడు రామనాథం.

సుజాత అన్నీ వింటూ నిర్లిప్తంగా ఉండిపోయింది.

దాదాపు అన్నీ సెటిలయిపోయాయనుకుంటున్న సమయంలో కులాసా కబుర్లు వాళ్ళమధ్య చోటుచేసుకోనారంభించాయి. ఆడపిల్లలకు తొందరగా పెళ్ళిచేయటమే మంచిదన్న రామనాథం ధోరణిని సమర్థిస్తూ అన్నాడు వచ్చిన పెళ్ళికొడుకు తండ్రి-

"మీరు ఈ ఊరివాళ్ళేగదా, మీకు తెలీని విషయం అయివుండదు. అన్ని పేపర్లలోనూ వచ్చిందికూడా. వయసు దాటిన పిల్లొకటి రోడ్డుమీద పోతోంటే నలుగురు పట్టుకొని మానభంగం చేశారట! ఆ గొడవ కోర్టులదాకావెళ్ళి చివరికి ఎవడో గంతకుతగ్గ బొంతనిచ్చి ఆ పిల్లను పదిలించుకోవాల్సి వచ్చిందట ఆ తల్లిదండ్రులకు..."

రామనాథం ముఖం మ్లానమయింది. వాళ్లు ఎవరి గురించి అంటున్నారో అతనికి అర్థమయింది. వాళ్లు పేపర్లో చదివారో, ఎవరైనా చెప్తే విన్నారో తెలీదు కానీ జరిగినదానికి ఎంత వక్రభాష్యం చెబుతున్నారు! మనసులోని ఆందోళన కప్పిపుచ్చుకుంటూఅన్నాడు రామనాథం-

"జరిగింది అదికాదండీ! ఆ అమ్మాయి ఒంటరిగావెడుతోంటే ఎవడో ఒకడు..."

రామనాథం మాట పూర్తికాకుండానే అడ్డుతగులుతూ అన్నాడా పెద్దమనిషి పకపకా నవ్వుతూ, "భలేవారండీ మీరు! వాళ్లు అలాగే చెప్పుకోక పదిమంది పాడుచేసినట్లు చెప్తారటండీ! ఇలాటివి మనంవిన్నా, విన్నది నమ్మనేకూడదు! ఒక్కడే పాడుచేసివుంటేవాడికేఇచ్చి కట్టబెట్టొచ్చుగదా ఆ పిల్లను! నలుగురు నడిచిన దారి కావటంతోనే వాళ్ళ కథ కోర్టువరకూ వచ్చింది"

రామనాథానికి కొంచెంగా కోపం పెరుగుతూ వచ్చింది. అయినా అది అనువుగాని సమయమని భావిస్తూ పైకై సంత నెమ్మదిగా అన్నాడు, "మీరు విన్నది తప్పు...జరిగింది మాకు తెలుసు"

"మీరింకా ఆ పద్ధతిలోనే మాట్లాడతారేంటి? నేను విన్నది చెప్తే మీరు ఇంకో మాటమాట్లాడరు! అసలు ఆ పిల్ల పద్ధతే అదట! ఎటొచ్చీ ఆరోజు ఒకరికి నలుగురయ్యేసరికి బాధ భరించలేక బజార్లో పడిందట! దానికి ఈ పేపర్లన్నీ ఆదర్శమనీ, ఆవిడో గొప్ప మహిళామణి అనీ పేర్లుపెట్టి బ్రహ్మరథం పట్టాయి"

"కాదండి .... మీరు విన్నది శుద్ధ అబద్ధం"

"ఏమిటండీ ... ఇంత ఇదిగా చెబుతున్నారు ఆ పిల్లదేమైనా మీ పక్కిల్లా కొంపదీసి?" పెళ్ళికొడుకు వ్యవహారాన్ని వీలైనంత తేలిక పర్చే ఉద్దేశంతో అన్నాడు.

రామనాథం క్షణం ఆగి అన్నాడు: "కాదు...ఆ అమ్మాయిది ఈ ఇల్లే! నా కూతురే ఆ అమ్మాయి. ఈ సుజాతకు అక్క ఆ సుశీల!"

"అంటే...!" అందరూ నివ్వెరపోయారు. ఎవరి ముఖంలోనూ ఏకళా లేకుండా పోయింది.

క్షణం తర్వాత సుజాత లేచి లోపలికి వచ్చేసింది.

"అవును సుశీల నాకూతురే. జరిగిందేమిటో మీకు తెలీదు..." ఏదో అనబోయాడు రామనాథం.

"అసలు ఆ సంగతి మీరు మాకు ముందే తెలియ జేయలేదేం?''

"ఏం తెలియజేయాలిచెప్పండి.నా పేరు రాశాను. ఇద్దరు కూతుళ్ళని రాశాను. పెద్దకూతురి పేరు సుశీల అనీ రాశాను. ఇంకా ఏం రాయాలి?"

"పనికిమాలిన సంగతులు అన్నీ రాసి అసలైన దాన్ని దాచిపెట్టుకొంటే ఏం చేస్తాం మేమ్మాత్రం? ఆ సంగతి రాయాల్సింది వివరంగా..." అంది పెళ్ళికొడుకుతల్లి.

"నేను మీదగ్గర ఏదీ దాచలేదు.దాచినా దాగుతుందనీ అనుకోలేదు"

"మరి ఊళ్లోనే ఉందిగదా అక్కగారు. ఆవిణ్ని పిలిపించలేదేం ఈ పెళ్ళిచూపులకు"

రామనాథం ఆ ప్రశ్నకు ఏ సమాధానమూ ఇవ్వలేక పోయాడు-మనసులో ఆ సందేహం ఉండే సుశీలను తాను ఈ పెళ్ళిచూపుల్లో సాయానికి రమ్మని పిలవలేదన్న సంగతి ఆ తండ్రిని క్షణం ఇరుకున పెట్టింది. అడ్డంగా తల ఊపుతూ ఉండిపోయాడు రామనాథం.

"బాగుంది సంబరం! ఆఖరికి ఇలాటి ఇంటి సంబంధం కోసమా ఇంత దూరం వచ్చాం! లేవండి లేవండి" అంది ఆవిడ తను లేస్తూ

"వద్దురా అంటే విన్నావుగాదు. పేపర్లో వేశారూ అంటేనే నాకేదో సందేహం రానేవచ్చింది.కానీ రోజులు మారాయి పేపర్లలో కూడా పెద్దింటి సంబంధాలు వస్తూనే ఉన్నాయంటూ నచ్చ చెప్పి తీసుకొచ్చావు. చూడు ఏమయిందో! నడు ఇంకా సిగ్గులేక కూర్చునే ఉన్నావేం? ఆ పిల్ల సంగతి బయట పడింది గాబట్టి తెలిసింది, ఈ పిల్ల ఎలాటిదో ఎవడు చూడొచ్చాడు..."

గోపీ అంతవరకు దూరంగా ఉండి అన్నీ వింటూ మౌనంగానే ఉన్నా ఆ మాట భరించలేకపోయాడు.

ఒక్క ఉరుకు ఉరికి ఆ తండ్రి కాలరు పట్టుకున్నాడు.

"ఏం కూశావ్‌రా గాడిద కొడకా...." అంటూ

రామనాథం నివ్వెరపోయి నిలబడ్డాడు. కూతురు పెళ్లి దాదాపు స్థిరపడి పోయిందనుకుంటున్న సమయంలో ఇదేమిటి కథ ఇలా అడ్డం తిరిగింది? అడుగు ముందుకువేస్తూ అన్నాడు రామనాథం "ఊర్కో గోపీ, ఊర్కో"

"మన ఇంటికొచ్చిమనమ్మాయినే ఇంత మాటంటున్నాడు వీళ్ళకెంత ధైర్యం వీళ్ళంతు చూస్తాను. వీళ్లను చంపి నేను జైలుకు పోయినా ఫర్వాలేదు..." గోపీ ఆవేశంగా అంటున్నాడు.




గోపీ చేతిలో ఉన్న కాలరు విడిపించుకొంటూ అన్నాడు అతను "చూస్తావేంట్రా ఈ బ్రోకరు వెధవల సంబంధం కోసమే పడిచస్తున్నావా నువ్వు! లే..."

"ఏంట్రా ఏమన్నావ్'' అంటూ గోపీ ఆ పెద్దమనిషిని ఒక్కటి ఇచ్చుకొన్నాడు.

''నామీద చెయ్యి ఎత్తుతావురా? నీ అంతుచూస్తాను ఆడకూతుళ్ళనుబజారులో పెట్టి బతికే వెధవలుమీరు. మీరెంత మీబతుకెంత" అంటూ రంకెలువేస్తూ బయిటకు నడిచాడు. అతని కూడా పెళ్ళి కొడుకు, పెళ్లి కొడుకు తల్లీ...

లోపల గదిలోంచి సుజాత అంతా వింటూనే ఉంది. అనుకొన్నట్లు పెళ్లి జరగకుండా పోయినందుకు ఆనందించాలో, పెళ్ళి చూపులు ఇలా అభాసు పాలయినందుకు విచారించాలో ఆమెకు తెలిలేదు. నిర్లిప్తంగా ఉండిపోయింది. ఇంటిముందు అనుకోకుండా జనం పోగవటం కూడా ఆమెకు తెలుస్తూనే ఉంది. విందుకు పిలిచి మళ్లీ రాళ్ళు వేయించుకొన్న పరిస్థితి అయింది ఇది.

రవ్వంత సద్దుమణిగాక అంది సుజాత "వద్దంటే విన్నారు గాదు. ఇంత జరిగింది ఇక ఎప్పుడూ ఇలాటివి తలపెట్టకండి! ఈసారి వచ్చేవాళ్ళు ఇంకా ఏమంటారో, ఏం వినాలని రాసి ఉందో మన నెత్తిమీద"

గోపీ, రామనాథంలు ఏ జవాబూ ఇవ్వలేదు.

వారం పదిరోజుల తర్వాత సుజాతకు ఒక ఉత్తరం వచ్చింది. పైన అడ్రసు దస్తూరి చూడగానే ఆ ఉత్తరాన్ని కృష్ణ రాశాడని సుజాతకు అర్థమయింది! అయిదారు నిమిషాలపాటు ఆ ఉత్తరాన్ని పరిశీలనగా చూసి ఆ తర్వాత...

దాన్ని ముక్కలు ముక్కలు చేసి పారేసింది.

ఈవేళ అతను ఏం రాసినా పట్టించుకోవాల్సిన పని లేదు. తన జీవితంలో అతనికి స్థానం ఏనాడో పోయింది!

తన జీవితం అతనివల్ల ఏనాడో చితికి పోయింది.

పరువుగా బతుకుతున్న తననూ తన కుటుంబాన్నీ అతను తీసుకెళ్ళి బజారులో పడేశాడు. కుక్కలు చింపే విస్తరిగా వీధిలో పారేశాడు. ఈవేళ అతనితో తనకేం పని?




ఆ రోజు-

తమ ఇంటిముందు ఆటో ఆగేసరికి సుశీల లోపల్నించి తొంగిచూసింది. ఎవరో ఒక యువతి ఆటోలోంచి దిగింది. ఆమెతోపాటు ఇంకో యువకుడు.

ఇద్దరూ తనకు అపరిచితులే. ఎవరై ఉంటారా అని ఆలోచిస్తోంటేనే ... వాళ్ళిద్దరూ తమ చేతిలోని కాగితాన్ని చూసుకొని, తాము వచ్చిదిగిన ఇల్లు, ఆ కాగితంలో ఉన్న అడ్రసు ఒకటే అవునా కాదా అని చెక్ చేసుకొని, ముందుకు నడిచారు.

సుశీల వారికేసి ఆశ్చర్యంగాచూసింది.

ఆ ఇద్దరిలోనూ యువతి ముందడుగు వేసి అడిగింది-"సుశీలగారని ... ఆవిడ

ఇల్లు ఇదేననుకుంటా"

"అవును ... రండి! నేనే సుశీలను" అంటూ వారిని లోపలికి ఆహ్వానిస్తూ అంది–''నాకు మిమ్మల్ని చూసిన గుర్తు రావటంలేదు"

''మీరు మమ్మల్ని ఎరగరులెండి. నాపేరు దేవి. నేను 'ది లిబ్' పత్రికకు రిపోర్టర్‌గా పనిచేస్తున్నా! ఇతను మా ఫొటోగ్రాఫర్ దివాకర్" అంది దేవి తన్నుతాను పరిచయం చేసుకుంటూ.

సుశీలకు వాళ్లొచ్చినపని అర్థమయింది. ఏదో ఇంటర్వ్యూ...అంతకుమించిన పనేం ఉంటుంది వాళ్ళకు.

చిన్నగా అంది సుశీల, "మీరేమీ అనుకోనంటే ఒక్కమాట! ఇలాటి ఇంటర్వ్యూలంటే....నాకెందుకో అయిష్టంగా ఉంటోంది"

"అరె...అలా ఏంలేదు. మీకు ఇష్టమైతేనే సుమండీ...నాలుగు ప్రశ్నలు అడిగి వెళ్ళిపోతాం! అసలు మాకు మీపేరు, చిరునామా ముకుందరావుగారు ఇచ్చారు. 'రేప్‌విక్టిమ్' మీద ఒక స్పెషల్ ఆర్టికల్ వేద్దామని ఆలోచన. అందరూ తలవంచుకొనిపోయేవారేగానీ, ఇలాటి విషయంపై పోరాడి గెలిచింది మీరేననిపిస్తోంది. అందుకే ఈ కేసు డిటైల్స్ తీసుకోవాలని వెడితే ముకుందరావుగారు మిమ్మల్నే కాంటాక్ట్ చెయ్యమన్నారు" అంది దేవి తన రాకకు సంజాయిషీ ఇస్తున్నట్లు.

"ఇలా అంటున్నానని ఏమీ అనుకోకండి. ఇప్పటికే ఈ విషయంలో చాలా అప్రతిష్టపాలయ్యాను"

"అప్రతిష్ట అని మీరనుకొంటున్నారు. కానీ మీరెందరికి ఆదర్శం అవుతారో, అయ్యారో మీరు గుర్తించటంలేదు. మీకు తెలీదనికాదు–ఈ దేశంలో ఉన్న అవలక్షణాల్లోమానభంగం ఒకటి అయిపోయింది. వెలుగులోకి వస్తున్న కేసులతో పోలిస్తే రానివి వందలు వేలల్లో ఉంటున్నాయి. కోర్టు వరకు వచ్చిన కేసులు కూడా తప్పుడు సాక్ష్యాలతో, ఋజువుకాని నేరాల వుతున్నాయి. ఇలాటి పరిస్థితిలో మీకేసు సంచలనం సృష్టించింది. దోషికి శిక్ష పడటం...ఆపైన మిమ్మల్ని ఇంకొకరు పెళ్ళాడటం...రెండూ నిజానికి విశేషాలే! ఇలాటివి వింటే...ఈ దేశంలో యువతులకు ధైర్యం కలుగుతుంది. రాత్రిపగలు ఇల్లు వదిలి తిరగాల్సిన పరిస్థితిలో ఉంది నేటి మహిళ. ఆమెకు ఆమాత్రం ధైర్యం ఉండటమూ తప్పనిసరైంది. ఆ విధంగా ఆలోచిస్తే మీరు నిజంగా చెప్పుకోదగ్గ వ్యక్తులు. అందుకే..." ఇంటర్వ్యూకు వచ్చినట్లుగా చెప్పింది దేవి.

"మీరనేది బాగానే ఉందిగానీ.... నిజానికి ఇలాటివాటిపల్ల నాకు మేలుకన్నా కీడే ఎక్కువ కలుగుతుంటుంది. మర్చిపోవాలనుకొనే పాత కథలను ... మళ్ళీ మళ్ళీ గుర్తుకు తెచ్చుకోవటం తప్పనిసరి అవుతోంది. నన్ను ఆ దుర్ఘటనను మర్చిపోనివ్వటంలేదు మీరెవ్వరూ"

దేవి కొద్దిసేపు మౌనంగా ఉండిపోయింది. ఆ తర్వాత అంది– "అయితే మీ ఇష్టం. మీ ఇష్టానికి వ్యతిరేకంగా మేం ఒక్క అక్షరం కూడా రాయం. ముకుందరావుగారు చెప్పారుగదానని..."

"సర్లెండి...ఎలాగూ ఇంతదూరం వచ్చారు. ఈసారి కానీండి. బట్ – ఇక మీదట ఈ విషయంలో... నేను చాలా ఖచ్చితంగా ఉండదల్చుకొన్నాను" అని ఆగి అంది..."అడగండి".

దేవి తన ప్రశ్నలవర్షం కురిపించసాగింది. 'రేప్‌విక్టిమ్స్‌పట్ల ప్రభుత్వ

దృక్పథం ఎలావుంది?', 'మానసికంగా మీరెలా ఫీలవుతున్నారు - ముందు, ఆ తర్వాత....', 'ఏదైనా ఆలజడికి గురయ్యారా?' 'సోషల్‌గా దాని ప్రభావం ఏమైనా ఉందా?'-ఇలాటి ప్రశ్నలు.



సుశీల ఓపికగా ఒక్కో ప్రశ్నకు సమాధానం చెప్తూవచ్చింది. సుజాతకు పెళ్ళి తప్పిపోవటం కూడా వివరించింది. "నా దృష్టిలో రేప్ అనేది కేవలం శారీరకమైనది మాత్రమే కావటంలేదు. అది ఆ స్త్రీ సాంఘికస్థాయిని కూడా బాగా దెబ్బతీస్తోంది. మీరు నమ్మండి, నమ్మకపోండి...ఆ తీర్పు వచ్చినరోజునే కోర్టులో కనుక రవీంద్ర వచ్చి పెళ్లాడతానని చెప్పకపోతే...బహుశా ఆ రాత్రే నేను ఆత్మహత్య చేసుకొని ఉండేదాన్ని. అలా ఉంది నా మానసికపరిస్థితి ఆరోజు. సరే.. మొదట్లో బజార్లోకి వెళ్లాలన్నా బాధపడే దాన్ని కానీ ఇపుడిపుడే బాగా కోలుకొంటున్నాను" అంది సుశీల.

"మీరు ఊఅంటే మీవారితో ఓ ఫొటో మా పత్రికలో వేస్తాం"

"దానికి నాకభ్యంతరమే లేదు. రేప్ కూడా మిగిలిన శరీరభాగాలకు తగిలిన అన్ని దెబ్బలలాటిదేనని, అదికూడా మానిపోగల గాయమేనని ఈ దేశప్రజలు గుర్తిస్తేచాలు. దానికి కారణాలు ఏవున్నా స్త్రీలు అధిక ప్రాధాన్యత నిస్తున్నారని నా అభిప్రాయం"

"మీరనేది రైటు" అంటూ దేవి, సుశీల, రవీంద్రల జాయింట్‌ఫొటో తీసుకుని సెలవు తీసుకొంది.

పది పదిహేను రోజుల్లో ఆ వ్యాసం ఆ పత్రికలో ప్రచురితమయింది.

అంతవరకు సుశీల గురించి సరిగ్గా తెలీనివారు సైతం జరిగిందేమిటో, దాని పర్యవసానాలేమిటో అవగాహన చేసుకొన్నారు.

ఆ వ్యాసం ప్రచురితం అయ్యాక అక్కడి ఓ స్టార్‌హోటల్ వాళ్ళు సుశీలకు

ఉద్యోగంకూడా ఆఫర్ చేశారు.

"మీరే అన్నారు - ఇలాటివారిపట్ల సంఘం తన దృష్టి మార్చుకోవాలని. అందుకే మీ మాట మాకునచ్చే ఈ ఆఫర్ చేస్తున్నాం. మీరు ఒప్పుకుంటే..."

భర్తనడిగి చెప్తానంది సుశీల.

రవీంద్ర నవ్వేశాడు-"ఇక్కడ ఉద్యోగానికి పత్రికలో ఇంటర్వ్యూ జరగటం తమాషాగా ఉంది"

"వాళ్ళు తమాషాకు అనటంలేదండీ! ఉద్యోగం ఇస్తాం, చేస్తావా అంటున్నారు. మీరు ఊఁఅంటే..."

"నువ్వు చేయదల్చుకొనే ఉద్యోగానికి నేను సరేననటం ఏమిటి? నీకు అంగీకారమైతే చెయ్యి"

సుశీల 'ఊఁ' అనేసింది. ఎలాగూ తన పట్ల సంఘం జాలిచూపిస్తూనే ఉంది. మంచికో చెడుకో ఈ ఉద్యోగం కూడా వచ్చింది. ఆర్థికంగా కూడా నిలదొక్కుకునే అవకాశం లభిస్తోంది అనుకొంది.

సుశీల ఆ హోటల్‌ను చూసి సంబరపడింది. లోపలికి వెళ్ళటానికి పెద్ద అద్దాల తలుపులు, అవి దాటి వెళ్ళాక పొడవైన రిసెప్షన్ కౌంటర్, ఆ తర్వాత ఎన్నో హాళ్లు ఎత్తైన హాల్ పైకప్పుల మీంచి కిందకు అందంగా వేలాడే చాండ్లియర్లు! ఇల మీదకు స్వర్గ సుఖాలు దింపుతున్న తీరులో ఉంది ఆ హోటల్.

రిసెప్షన్ కౌంటర్‌లో వేశారు సుశీలకు డ్యూటీ. వచ్చిపోయే అతిథులకు స్వాగతం వీడ్కోలు చెప్పటం, వారికోసం వచ్చిపోయే గెస్టులు అందజేసే మెసేజెస్ రిసీవ్ చేసుకోవటం ... ఇలాటి విధులు బాధ్యతలు ఆమె తన డ్యూటీలో భాగంగా నిర్వహించాల్సి ఉంటుంది.





సుశీలకు ఆ ఉద్యోగం చాలా ఎక్సయిటింగ్‌గా అనిపించింది. ఎందరెందరో ప్రముఖులు ఆ హోటల్ గెస్ట్‌లిస్ట్‌లో ఉన్నారు. వారందర్నీ చూడటమే గొప్పగా అనుకునే సామాన్యజనం ఈ దేశంలో కోకొల్లలు. అలాటిది తను వారిని చూడగలగటమే కాదు, వారందరితోనూ మాట్లాడగలుగుతోందంటేనే సుశీలకు ఎంతో గర్వంగా అనిపించింది.

ఒక్కొక్కరితో మాట్లాడటమే తనకు అపూర్వమైన అనుభూతిగా భావించేది సుశీల. జీవితం ప్రసాదించిన అందమైన అవకాశం ఈ ఉద్యోగం అనుకొనేది సుశీల.

అయితే...

ఆమె ఊహల్నీ, ఉద్దేశాల్నీ పటాపంచలుచేస్తూ. ఆరోజు ఆ సంఘటన జరిగింది. దెబ్బకు సుశీల ఉద్దేశాలన్నీ పటాపంచలైపోయాయి.

ఆరోజు-

రిసెప్షన్ కౌంటర్లో పనిచేసుకొంటున్న సుశీలకు ఫోనొచ్చింది. అందుకొంది, యధాప్రకారం 'గుడ్ ఆఫ్టర్‌నూన్ సర్!' అంది.

"మీరు ఊఁ అంటే..ఇదింకా బెటర్‌గా ఉంటుంది" అవతలి వ్యక్తి కంఠంలో మత్తు స్పష్టంగా కనిపిస్తోంది.

"మీరు .... మీరనేది నాకు అర్థం కావటం లేదు"

"అర్థంకావటానికి ఏముంది? అర్థం కానట్లుగా నటించకండి. మీరెవరో నాకు తెలుసు. మీగురించి ఈ పత్రికలో అంతా వివరంగా రాసి ఉంది"

"ఏ పత్రికలో?"

"'ది లిబ్'లో"

సుశీల నిట్టూర్చింది. ఏ పత్రికలో తన గురించి ఏం రాసి ఉందోనని భయ

పడింది. లిబ్ పత్రికలో ఏం రాసి ఉందో తెలుసు గనుక 'అమ్మయ్య!' అనుకొంది.

"అవునండీ...అందులో రాసి ఉన్నది నిజమే!" అంది సుశీల.

"దెన్ ఆల్ ది బెటర్! వీలైతే ఆఫ్టర్ డ్యూటీ అవర్స్ వచ్చేయండి! మీకు ఏం కావాలంటే అది నేనుఇస్తా. మీరు మాత్రం..."

సుశీలకు ముచ్చెమటలుపోశాయి. ఏం వాగుతున్నాడో వాడు, ఏమను కొంటున్నాడో తన గురించి?

కాల్ గర్ల్ ననా?

ఎంత ధైర్యం!

ఫోన్ పెట్టేసింది నిస్సహాయంగా.

ఎందరో ఎదురవుతూ ఉంటారు ఈ జీవితంలో. కొందరు ముకుందరావులాటి మంచివాళ్లు. ఇంకొందరు ఇలాంటి ... ఏమనాలి వీళ్ళను! మనుషుల్లో పశువులు! మానవాకారంలో ఉన్న రాక్షసులు!!

రెండు మూడు నిమిషాలలోనే మళ్ళీ ఫోనొచ్చింది.

అందుకొంది ఫోన్.

మళ్ళీ అదే గొంతు అదే వరసలో అదే ఆహ్వానం.

మనసులోని కోపాన్ని అణిచిపెట్టు కొంది సుశీల. "మీ రూమ్ నెంబర్ చెప్పండి...వచ్చి మాట్లాడతాను!"

చెప్పాడు.

ఫోన్ పెట్టేసి ఆ రూమ్‌కేసి నడవటం ఆరంభించింది. లిఫ్ట్ ఎక్కి ఆ ఫ్లోర్‌లో దిగింది. కారిడార్ అంతా నిర్మానుష్యంగా ఉంది.

ఇంత గొప్ప హోటల్. ఇంత ఖరీదైన మనుషులు. మరి ఇంత నీచపుబుద్ధులేమిటి, ఈ ఫోన్లేమిటి, ఈ పిలుపులేమిటి-ఇవేవీ మీస్థాయికి తగ్గట్లులేవని నాలుగు చీవాట్లు వేయాలన్నది తన ప్రయత్నం.

వెళ్ళి ఆ రూమ్ ముందు నిలబడి తలుపుమీద చిన్నగా టాప్ చేసింది సుశీల.

తలుపు తెరుచుకొంది.

"ఫోన్‌చేసింది..."

"నేనే!" గర్వంగా అన్నాడు ఆ వ్యక్తి మెడలో పులిగోరు పతకం. ఒంటిమీద పైభాగాన ఏమీలేదు. నల్లని ఆ గుండెలు లోపలేకాదు, పైనకూడా నలుపేనని స్పష్టం చేస్తున్నట్లున్నాయి.

"కానీ నేను మీరనుకున్నట్లు కాల్ గర్ల్‌నుకాను!"

"అవునని నేనన్నానా? నాపని అయిపోతే, నువ్వు ఎవరిపైతే నాకేం? నీకూ, నాకూ డబ్బుతోనే పని. రా... లోపలికిరా" అంటూ అడుగుముందు కేశాడు.

సుశీల నివ్వెరపోయింది. కథ అను కోకుండా పెడదారిపడుతున్నట్లుగా అని పించింది. అడుగు వెనక్కు వేసింది సుశీల. అతను అడుగుముందుకు వేశాడు.

కెవ్వు మని అరిచింది సుశీల. ఆ నిశ్శబ్ద వాతావరణంలో ఆ కేక ప్రతిధ్వ నించింది. లిఫ్ట్‌బాయ్ దగ్గర్నుంచి చుట్టు పక్కలవున్న గదుల్లోనివారంతా పరి గెట్టుకొచ్చారు.

సుశీల దోషిలాగా నివ్వెరపోయి నిలి చింది.

ఎవరూ ఏమీఅడగకుండానే అన్నాడు ఆ హోటల్‌రూంలోని వ్యక్తి, "వచ్చితలుపు తట్టింది. వచ్చిందిగదాని రమ్మన్నాను. బేరంసరిగ్గా కుదరలేదని నన్నల్లరిపెట్ట టానికి కెవ్వున కేక వేసోంది"

ఏమనాలో అర్థంకాలేదు సుశీలకు.

సన్నివేశాన్ని చూస్తోంటే తనకే అర్థ మవుతోంది- తనే తప్పు చెయ్యలేదన్నా

ఎవరూ నమ్మేలాలేరని! కింద కౌంటర్ దగ్గర ఉండాల్సిన తాను ఇక్కడికి ఎందుకు వచ్చినట్లు అని ఏ ఒక్కరు అడిగినా ఏం సమాధానం ఇస్తుంది తను?

ఫోన్లో తనను అల్లరిచేసినవాడికి బుద్ధి చెప్పటానికే ఇన్ని మెట్లు ఎక్కివచ్చానని చెబితే-జారుడుమెట్లమీద నిలబడిన వ్యక్తి తను....తను చెబితే ఎవరు నమ్ముతారు? దూడ గడ్డికోసం తాడిచెట్టు ఎక్కినట్లుందని అనుకోరూ? తాను ఇక్కడ దోషిగా కాక, గుంపులోని ఓ వ్యక్తిగా నిలబడితే తానూ అలాగే అనుకోదూ?

తప్పుచేయకపోయినా తప్పు చేసిన వ్యక్తిలాగా తల వంచుకుని నిలబడింది సుశీల.

నెమ్మదిగా అడుగులో అడుగువేసుకుంటూ కిందకు వచ్చింది. ఇంక ఆ పరిసరాల్లో ఒక్కక్షణమైనా నిలబడలేనన్నట్లుగా ఆమె అద్దాల తలుపుల్లోంచి బయటకు నడిచింది.

బయటకువచ్చి ఆటో ఎక్కింది.

అది కాస్ట్లీ హోటల్. అది ఖరీదైన మనుషుల హోటల్. అక్కడివారు గట్టిగా మాట్లాడరు. వారి వ్యవహారాలన్నీ పెదవి విప్పకుండానే జరిగిపోతుంటాయి. కనుసైగలమీదే కథలు నడిచిపోతుంటాయి. ఆ కనుసైగలకు అర్థం తెలిసివుంటే వాళ్ళేం అనుకుంటున్నారో సుశీలకు అర్థం అయివుండేది.

ఇంటికొచ్చి రవీంద్ర గుండెల్లోకిచేరి బావురుమంది.

"నేనేతప్పు ఎరగనండీ! పైకి గట్టిగా అంటే నవ్వులపాలవుతానని వెళ్ళి నచ్చ చెప్పబోయాను. అవకాశం తీసుకుని నేరం నా మీద నెట్టేసి తప్పించుకున్నాడు! నిర్దోషినైనా దోషిలాగే నిలబడాల్సి వచ్చింది! ఎంత ఘోరమండీ అది..."

రవీంద్ర భార్య అనేది వింటూ మౌనంగా ఉండిపోయాడుగానీ మారు మాట్లాడలేదు.

భర్త మౌనాన్ని మరోలా అర్థంచేసుకుని అతన్ని మరీ అతుక్కుపోతూ అంది - "మిగిలినవాళ్ళందరూ ఏమైనా అనుకోనీండి నేనేమీ పట్టించుకోను! కానీ నేనేమిటో, నాపద్ధతులేమిటో తెలిసిన మీరు ఏమీ అనకపోతే నేను భరించలేనండీ! నిజమండీ, నన్ను నమ్మండీ, నేను నిర్దోషిని! అయినా తలవంచుకునిలబడాల్సి వచ్చింది"

"ఒక్కోసారి అంతే సుశీలా! నిర్దోషి కూడా ఈలోకంలో శిక్ష అనుభవిస్తుంటాడు. నేను నిన్ను నమ్ముతాను. నువ్వేమీ బాధపడకు!" అనునయిస్తూ అన్నాడు రవీంద్ర.

ఆనాటి చేదు అనుభవంనుంచి తేరుకోవటానికి సుశీలకు చాలాకాలమేపట్టింది.

అయితే-

సుశీల చెల్లెలు సుజాతమాత్రం తనకు కలిగిన అనుభవంనుంచి తేరుకోలేకపోయింది. అసలది నిజమా కలా అన్న సందేహం ఆమెను చాలాకాలం వేటాడింది.

సుశీల ఆరోజు తన తండ్రిని చూసివస్తానంటూ బయలుదేరింది.

"చాలాకాలమయింది వాళ్ళను చూసి! ఆరోజు సుజాత పెళ్ళిసంబంధం చెడిపోయినరోజునుంచి నాక్కూడా వెళ్ళటానికి మనస్కరించనేలేదు. ఈరోజు కొంచెం ఖాళీగావుంది. నేను వెళ్ళొస్తా..." అని భర్తకు చెప్పింది సుశీల.

రవీంద్ర సరేనని వెళ్ళమన్నాడు.

సుశీల అటు వెళ్ళగానే ఇటు వచ్చింది సుజాత.

# సితార

• మీరు అభిమానించేది ఏ తారనైనా సరే
మీకు కావలసింది సితార

• మల్టీకలర్ ముఖచిత్రమే కాదు, అనేక రంగుల సెంటర్
స్ప్రెడ్‌తో మిమ్మల్ని మురిపించి, మైమరపిస్తుంది
సితార

ఆకాశంలో వెలిగేది ధ్రువతార
సినీ జగతిలో వెలిగేది సితార

• సినిమాకు సంబంధించిన అన్నిరకాల వార్తలకు,
వ్యాఖ్యలకు, కబుర్లకు, విమర్శలకు పెట్టింది పేరు
సితార



ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ
హైదరాబాద్ - 500004

"మీ ఇంటికే వెళ్ళింది సుశీల!" అన్నాడు రవీంద్ర.

"అయితే సర్లెండి! నేను వచ్చివెళ్లానని చెప్పండి! బహుశా ఇంటిదగ్గరే కలుస్తాం అనుకోండి" అంటూ వెనుదిరగబోయింది సుజాత.

రవీంద్ర క్షణం ఆగి అన్నాడు- "సుజాతా..మాట! అరగంటనుంచీ చూస్తు న్నాను. తలంతా ఒకటే నెప్పిగావుంది. కొంచెం కాఫీయో, టీయో కాచి ఇస్తే కృతజ్ఞతలు చెప్పుకుంటా"

సుజాతకు చిత్రంగా అనిపించింది ఆ అభ్యర్థన. కాఫీ, టీలకు తనను ప్రాథేయ పడి అడగాల్సినంత అవసరం ఏముంది? అక్క ఉండగానే రవీంద్ర వంటింట్లోకి వెళ్ళి టీ పెట్టుకోవటం తను చాలాసార్లు చూసింది. మరి ఈవేళ ... పోనీ టీ పెట్టుకోగల ఓపిక లేకపోతే నాలుగడుగులువేసి హోటల్లో తాగిరావచ్చుగదా! ఆ పనులేవీ చెయ్యక తనను అడగటం ఏమిటి? తను వస్తున్నట్లు కలగన్నాడా? కాకుంటే వచ్చానుగదా అని అడుగుతున్నాడా-అనుకొంది.

అయినా ఆ మాటల్ని పైకి అనక తలవూపి వంటింటివైపు నడిచింది.

లోపల-

గాస్‌స్టవ్ అంటిస్తోంటే నెమ్మదిగా గుమ్మం దగ్గర చేరాడు.

"మీ అక్క మీ ఇంటికే వెళ్ళింది"

"చెప్పారుగదా ఆ సంగతి"

"చెప్పాననుకో...మళ్ళీ చెప్పటంలో తప్పేముందీ - నువ్వు విన్నావో లేదో అని మళ్ళీ చెప్తున్నా"

సుజాత నవ్వి ఊరుకుంది.

"సుజాతా...నువ్వేమీ అనుకోకేం, ఇలా అడుగుతున్నానని .... అనుకోవు గదా"

"అడగండి ఏమిటో?"

"అదే...నీ పెళ్ళి విషయం ఏమైందా అని"

సుజాత నిట్టూర్చింది - "దీనికేనా అంత సందేహించారు. ఈ విషయం అడగటానికి సందేహమెందుకు?"

"ఎందుకంటే - అది నీ వ్యక్తిగతం అని! అయినా అక్క మొగుణ్ని, కొంచెమైనా అధికారం ఉండే ఉంటుందిగదా! ఆ అధికారంతోనే అడుగుతున్నా-చెప్పు... ఏమయింది?"

సుజాత నవ్వింది "ఏమవుతుంది" అని క్షణం ఆగి అంది. ఆరోజు తన పెళ్ళి చూపుల్లో జరిగిన ఘర్షణ గురించి తను అక్కకు అంతా చెప్పింది. కానీ అక్క రవీంద్రకు ఏం చెప్పిందో ? వాళ్ళన్న మాటలు యధాతథంగా చెప్పగల అవకాశమైతేలేదు.వాళ్ళన్నమాటలు రవీంద్రలాటి సున్నిత హృదయుల్ని సైతం బాధించి తీరతాయి. అందుకే అక్క నిజం చెప్పి ఉండదు. ఏదో సర్దిచెప్పి ఉంటుంది. అలా అనుకోగానే సుజాత కూడా మాటను దారితప్పిస్తూ అంది, "ఏమవు తుంది! పెళ్ళిచూపులకు వచ్చినవాళ్ళం దరూ చేసుకోవాలని రూలేం ఉంది! అలాటి పద్ధతే ఉండివుంటే ఆడాళ్ళకు ఇన్నేసి పెళ్ళిచూపులు ఎందుకు జరుగుతాయి?"

రవీంద్ర నవ్వాడు.

"నువ్వు తెలివైనదానివి"

"ఎందుకు అలా అంటున్నారు?"

"నేను ఏమడుగుతున్నానో, ఎందుకు అడుగుతున్నానో గ్రహించగల తెలివి తేటలు నీకుండబట్టి"

సుజాత చిరునవ్వు నవ్వి అంది-




"అవసరం అయితే ఎంతటి తెలివి తక్కువవారికైనా కొంచెం బల్బు వెలుగు తుంది కాబోలు"

క్షణం తర్వాత అన్నాడు సుజాతతో రవీంద్ర-"ఇంత తెలివితేటలున్న దానివి ఆ విషయం గ్రహించుకోలేకపోతున్నా వంటే నమ్మబుద్ధికావటంలేదు"

"ఏ విషయం అది?"

"అది...నీ పెళ్ళి విషయమే. నిజం చెప్తున్నా-ఆలోచించి చూడు...మీ అక్క సుశీల మీద అలాటి రగడ జరిగిందిగదా! మరి నిన్ను పెళ్ళాడాలంటే ఎవడు ముందుకొస్తాడంటావ్?"

"ఎవరో ఉండకపోతారా మీలాటి ఆదర్శవాదులు, సంఘసంస్కర్తలు"

నవ్వేశాడు రవీంద్ర-"మళ్ళీ నాలాటి అంటూ ఆ విశేషణాలు దేనికి? ఎలాగూ అక్క మొగుడిని...నువ్వు ఒప్పుకొన్నా ఒప్పుకోకపోయినా, నీకు పెళ్ళి జరగటం దాదాపు అసాధ్యం అనేది నిజం. తెలిసి తెలిసీ మీ ఇంటితో సంబంధం ఏర్ప రుచుకోవటానికి ఎవడు సిద్ధపడతాడు చెప్పు! ఇదేదో అలాటి ఇలాటి వ్యవ హారం కూడాకాదు- రేప్! సంఘంలో ఎవరు ఏనేరాన్ని చేసినా క్షమిస్తారు. రేప్ చేసినవాడినైనా క్షమిస్తారుగానీ... రేప్‌కు గురైన ఆడదాన్నీ, ఆమె కుటుం బాన్నీ ఎవరూ ఆదరించరనేది నీకు తెలీని విషయంకాదు. నువ్వే అనుభవ పూర్వకంగా తెలుసుకొన్న సత్యమది"

రవీంద్ర మాటలు ఏదిశగా ఎందుకు వెడుతున్నాయో సుజాతకు అర్థమవు తూనే ఉంది. కానీ అది తన అపోహే నేమోనని సరిపెట్టుకునే ప్రయత్నం చేస్తూ ఉండిపోయింది.

సుజాత మౌనాన్ని మరోలా అర్థం చేసుకొంటూ అన్నాడు రవీంద్ర "సుజాతా! నువ్వు తెలివైనదానివి. వయసులో ఉన్న దానివి. వయసు పొంగి ఉరకలువేస్తున్న దానివి నీకు ఇంతకన్నా విడమర్చి చెప్పా ల్సిన పనేమీలేదు. అయినా ఇంత దూరం వచ్చి ఆగటం కూడా దేనికి... అదీ చెప్తాను. నాకు చాలా రోజులనుంచీ నీమీద దృష్టి మళ్ళింది. నువ్వు ఊ అంటే..."

"దేనికి? దేనికి 'ఊ' అనటం...?

అంటే...?

సుజాతకు మతి పోతోంది. రవీంద్ర ఏమంటున్నాడు?

నిజమే?

"వాస్తవంగా ఆలోచించి చూడు... నీకు పెళ్ళి జరుగుతుందని నువ్వేమైనా కలలు కంటోంటే అవన్నీ వాస్తవానికి చాలా దూరమని గ్రహించు. మీ అక్క అదృష్టమనుకో నాలాటి భర్త దొరకటం అంతమాత్రాన ఈ దేశంలో అందరూ నాలాటివారు ఉండరు! నీకూ అలాటి భర్త దొరుకుతాడని నువ్వు అనుకొంటే అది తప్పు...పొరబాటు. కావాలంటే నీకు రాసిస్తా-నీకు భర్త దొరకటం కల్ల"

సుజాత తలెత్తి చూసింది.

"ఆ కారణంగా ఆలోచించు. ఇందులో నష్టపోయేది ఏమీలేదు. అవసరమను కొంటే మీ అక్కకూ చెప్తాం..."

సుజాత కోపం పట్టలేకపోయింది. అయినా అది వ్యక్తం చేసే సమయం కాదు. అవకాశమూలేదు. సమయా సమయాలు చూసుకోకుండా అక్క ఇలాటి సన్నివేశంలోనే చేసిన అల్లరి ఎంత నష్టం తెచ్చిపెట్టిందో తనకు తెలీంది కాదు. తను అలాటి తప్పు చెయ్యదు.

రవీంద్రను అల్లరిపెట్టి తననుతాను అల్లరిచేసుకొని జీవితాన్ని నేలపాలు చేసు



కొనే తెలివితక్కువదిగా ఉండకూడదు తను.

కాంతా కనకాలు మనిషి అసలు రంగుల్ని ఎంత స్పష్టంగా బయటపెడతాయి. కొన్ని క్షణాల క్రితం వరకూ రవీంద్ర అంటే ఎంత గౌరవభావం ఉండేది తనకు. ఎంతటి ఆదర్శ భావాలు ఉంటే తన అక్కను పెళ్ళాడతాడు. ఇలాంటి ఆదర్శ వ్యక్తుల ఋణం ఎన్ని జన్మలకు తీర్చుకోగలదు తన కుటుంబం? అనుకొంటూ వచ్చేది తను.

కానీ ఇప్పుడు ఆ ముసుగులోని మనిషి బయటికొచ్చాడు. ఆ మనసులోని అతి సామాన్యుడు - నేలబారు మనిషి ఇప్పుడు కలుగులోంచి బయటకొచ్చిన ఎలకలాగ బయటపడుతున్నాడు!!

ఒక్కసారి ఊఁ అనాలిట.

అవసరమైతే అక్కకూ చెప్తాడట.

చెప్పి, చెప్పి ... ఏం చేస్తాడు? తననూ...?

ఇలాటి వ్యక్తిగా రవీంద్రను తానెన్నడూ ఊహించుకోలేదు. అతని అసలు రంగు ఇప్పుడుగదా బయటపడుతోంది... ఎలా ఊహించుకొంటుంది ఇలా?

నివ్వెరపోయి నిలబడిపోయింది సుజాత.

"ఆలోచించు సుజాతా..నీఇష్టం! ఎంత సమయం తీసుకున్నా ఫర్వాలేదు. ఇలాటి వాటిలో తొందర అనవసరం. అయితే ఒక్కమాట .... నేనిలా అన్నాననిగానీ, అడిగానని గానీ. ఎవరికీ చెప్పకు - అది నీకే నష్టం. నాకేముందీ - నేనిలాటివాడినా అని ఒక్కమాట అన్నానంటే అందరూ 'అవును' అనేస్తారు. నీ బతుకే నవ్వులపాలవుతుంది. అలాకాక గుట్టుగా ఒప్పుకొంటావనుకో, దాన్ని రట్టు చేయకుండా నడుపుకొచ్చే బాధ్యత నాది"

చెప్పాల్సింది చెప్పినట్లుగా ఆగాడు రవీంద్ర.

సుజాతకు అతనా మాటలు అన్నాడో లేదో, తనే ఊహించుకొంటోందో కూడా

అర్థం కాలేదు.

జరిగింది నిజమేనా?

తన ఊహ కాదా??

ఇలా కూడా జరిగే అవకాశం ఉందా?

అందులోనూ రవీంద్రలాటి ఉత్తముడు కాదు, ఉత్తముడని తాను భావిస్తూ వచ్చిన వ్యక్తి ఇలా దిగజారుతాడా? ఏ ఆదర్శాలు వల్లించక నీతితో నిజాయితీతో బతికే అతిసామాన్యుడికన్నా హేయంగా - అగాథాలలోకి ఇలా ఒకేసారి జారిపోవటం కూడా సాధ్యమేనా?

రవీంద్ర.. ఎంతటి సంస్కారంతో అక్క చెయ్యి అందుకొన్నాడు. ఎంత సంబరపడింది తమ కుటుంబం. అక్క బతుకు బాగుపడిందని మాత్రమేకాదు, ప్రపంచంలో ఇలా కొందరు ఉన్నారని తెలుసుకున్నందుకు.

కానీ...

అంతటి ఆదర్శపురుషుడు...నేలజారిన జీవితాన్ని రెండుచేతులా ఎత్తి సుశీలకు మళ్ళీ అందించిన సంస్కారపురుషుడు.. సంస్కర్త...ఇలా ఎలా ప్రవర్తిస్తున్నాడు? మనిషి మనసులో మంచే కాదు చెడు కూడా ఇంత సమంగా ఉంటుందా? మంచిని మింగేంతగా చెడు నిండి ఉంటుందా?

అయినా నాటి ఆదర్శం...సుజాత మనసులో చిన్న సందేహం తలెత్తింది.

నేడింతటి నీచత్వం వెళ్ళగక్కిన రవీంద్ర ఒకనాడా ఆదర్శాన్ని ఎలా ప్రదర్శించగలిగాడు.

అతని జీవితంలో అది నిజమా? ఇది నిజమా??

ఏది నిజం? ఏది అతని అసలు స్వరూపం?

మంచితనమే సిసలైనదైతే ఇదేమిటి?

అయినా ఇంతటి సామాన్యుడికి... సామాన్యుడుకూడా కాదు-అల్పుడు.... ఇంతటి అల్పుడికి ఆనాడు అంతటి ఆదర్శం ఎక్కడిది?

తన అక్కను ఆదర్శంతోనే నాడు పెళ్ళాడాడా?

అసలది ఆదర్శమేనా?

కాకుంటే...?

"నేనే నేరం చెయ్యలేదు. ఎవరు చేశారో నాకయితేతెలీదు. నేను నిర్దోషిని" అంటున్న కృష్ణ మాటలు ఒక్కసారి సుజాత మనసులో ప్రతిధ్వనించాయి.

అంటే...

అంటే?

సుజాత ఆలోచనలు పలుదిశల ప్రయాణించటం ఆరంభమయింది.

రవీంద్ర అంటే ఆమెకు నాటినుంచీ భయమూ, సందేహమూ పెరిగింది.

ఆ మనిషి వెనకవున్న అసలు మనిషి స్వభావం ఏమిటన్న ప్రశ్న సుజాతను వేధించసాగింది.




ఎత్తయిన గోడలు. గోడలపైన నిత్యం విద్యుత్తు ప్రవహిస్తున్న తీగెలు. ఆ గోడలకు ఇటు ఉన్నదంతా మంచి అనీ చెప్పలేం...అటూ ఉన్నదంతా చెడు అనీ చెప్పలేం. అయినా మంచీచెడులమధ్య సరిహద్దులాటి గోడ అది. ప్రపంచంలోని చెడునంతా సంకెళ్ళలోవేసి లాక్కొచ్చి

అక్కడ పడెయ్యాలనే ప్రయత్నానికి అది ప్రతీకగావుంది. పైనుంచి చూస్తే ఓ కోటలావుందా గోడ.

ఆ గోడల లోపల – ఆ శిలారణ్యం లోపల కరుడుగట్టిన హృదయాల వాళ్ళున్నారు.

వాళ్ళు హంతకులు. వాళ్లు దోపిడీ దొంగలు. వాళ్ళు కేడీలు. వాళ్ళు బేడీల్లో పడ్డ స్వేచ్ఛావాయువులు.

వాళ్ళలో కొందరు ఇతరుల్ని చంపారు ఇంకొకళ్ళను దోచుకొన్నారు. మరొకళ్ళ మానాన్ని దోచుకొన్నారు. వాళ్ళలో అందరూ ఆత్మను చంపుకొన్నారు. పరిస్థితుల కారణంగా ముందుగా తమను తాము వంచించుకొన్నారు. ఆవేశానికి లోనయి ఆపై కటకటాల వెనకబడ్డారు.

నిజానికి–వాళ్లు స్వేచ్ఛాప్రియులు.

ఆ కోరికను అడ్డుకొంటూవుంది – ఆ ఎత్తయిన గోడ!

ఆ గోడకు ముందుభాగాన– పెద్దకర్ర తలుపులు. ఆ తలుపులకు చిన్న తలుపు ఇంకొకటి ఉంది.

ఆ రోజు–

ఆ చిన్న తలుపు తెరుచుకొంది.

తెరుచుకొన్న ఆ తలుపులోంచి అతను బయటకు వచ్చాడు.

జైల్లో గడచిపోయిన కాలానికి ప్రతీకలాగా ... అతనిలో ఆరోగ్యం కూడా రవ్వంత వెనకబడిపోయింది. అయినా ఇప్పటికీ ఒకనాడితను ఆరోగ్యవంతుడే నన్న విషయాన్ని ధృవపర్చేందుకు అన్నట్లు ఇంకా కొన్నిగుర్తులు మిగిలేవున్నాయి.

తలరాతకు తల ఒంచినట్లుగా ఆ తలుపుముందు తలవంచి బయటకువచ్చి తలెత్తాడు అతను.

బయటిప్రపంచం అతనికి కొత్తగా ఏమీ అనిపించలేదు. జైల్లోకి వెళ్ళటానికి మునుపు ఈ ప్రపంచం ఎలావుండో అతనికి ఇప్పుడూ అలాగేఉంది.

మార్పు అతనికి కనపడ్డంలేదు. మార్పు ప్రపంచంలోనూ లేదు. మనుషుల్లోనూలేదు.

తప్పుచేయని తను జైల్లోకి వెళ్ళిన రోజూ ఈ ప్రపంచం ఏమీ ఆగిపోలేదు. అన్యాయం జరుగుతోందని తను ఎలుగెత్తి అరిచాడేగానీ, ఎవ్వరూ ఆమాటే వినిపించుకోలేదు. ఈ ప్రపంచం మరీ హడావిడిగా తన ఘోష పట్టించుకోకుండానే వెళ్ళిపోయింది.

ఈ రోజు–

చేయనితప్పుకు జైలుశిక్ష అనుభవించి తను బయటకువచ్చిన రోజునా ఈ ప్రపంచం తనను ఆప్యాయంగా ఆదరించటం లేదు. 'పొరబాటయింది...ఏమీ అనుకోకు' అంటూ అక్కున చేర్చుకోవటంలేదు.

గతంలోలాగానే నిర్దయగా, నిర్లక్ష్యంగా నిర్లిప్తంగా తలబిరుసుగా ఈ ప్రపంచం కదలివెళ్ళిపోతోంది.

తనలాటి అమాయకులు వేలు లక్షలు కోట్లు కాలచక్రం ఇరుసులో ఇరుకునబడి నలిగిపోనీ, నాశనం అయిపోనీ ..ఈ ప్రపంచం ఆగిపోదు.

'వందమంది దోషులు తప్పించుకొన్నా ఫర్వాలేదు. ఒక నిర్దోషికైనా అన్యాయం జరగకూడదనే' లక్ష్యంవున్న ఈ న్యాయ వ్యవస్థ ఈరోజుకైనా కిక్కురు మనటం లేదు.

కళ్ళు మూసుకొని, త్రాసుపట్టుకొని ధర్మాధర్మాల న్యాయనిర్ణయం చేయటమే తన లక్ష్యమని చెప్పే ధర్మదేవత సైతం ఇంకా కళ్లుమూసుకొనే ఉంది. కళ్లుతెరిస్తే



అన్యాయం జరిగిపోయిందన్న సంగతి తనకు తెలుస్తుందన్న భయం కాబోలు!!

కృష్ణ అడుగుముందుకు వేశాడు.

ఒక్కరు..ఒక్కరంటే ఒక్కరైనా తనకు అన్యాయం జరిగిందన్న సంగతి గుర్తిస్తేచాలు...

నిజానికి తను అదృష్టవంతుడే జైల్లోకి వెళ్లాక మనిషి అంతక్రితమే మృగం కాకుండా ఉండివుంటే మృగమవు తాడంటారు. అదృష్టవశాత్తు తనకు ఆ గతి పట్టలేదు. మనిషిగానే బయటపడ్డాడు.

ఏనాడు చేసిన పాపమో ఈనాడు శాపమై తనను వేటాడి వేధించింది. కటకటాలవెనక్కు తోసింది. జీవితాన్ని గతిమార్చింది-అనుకొన్నాడే తప్ప...

కృష్ణ జైలుఆవరణ దాటాడు.

ఎదురుగా కొంచెం దూరంగా ఉన్న ఇరానీహోటల్లోకి చేరాడు. హోటలంతా సందడివుంది. అందరిలోనూ ఏదో తెలీని ఆత్రం ... ప్రతివారిలోనూ ఏదో తెలీని భావం...

కృష్ణ ఒక మూలనున్న కుర్చీలో కూలబడ్డాడు. జేబులోవున్న డబ్బుతీసి చూసుకొన్నాడు. అది చూశాక అతనికి కొంచెం ధైర్యం కలిగింది.

టీకి ఆర్డరిచ్చాడు.

వేడి టీ తాగుతోంటే మనసు, శరీరం నెమ్మదిగా కుదుటపడసాగాయి.

ఏం చేయాలి? ఎక్కడికి వెళ్లాలి? - అన్న ప్రశ్నలు అపుడతని ముందు నిలిచాయి.

తనకోసం ఎవ్వరూ రాలేదు. తనకు స్వాగతం చెప్పేందుకు ఏ బాండు బాజాలూ రాలేదు. తన రాకను ఈ ప్రపంచంలో ఎవ్వరూ పట్టించుకోలేదు.



కృష్ణ తల ఒక్కసారి విదుల్చు కొన్నాడు. ఎక్కడో ఆలోచనల అడుగు పొరల్లో అణిగిమణిగి ఉండిపోయిన తల్లి అనంతమ్మ ఒక్కసారి తలెత్తింది.

'నీకోసం నేనున్నానురా' అంటూ ఆప్యాయంగా తల్లి పిలిచినట్లయింది అతనికి.

తల్లిదగ్గరకు తనిప్పుడు వెళ్ళడు. ఈరోజు ఎంత తల్లిఅయినా తను దోషి, తప్పుచేసినవాడు.తప్పుచేసినా తల్లి మనసు క్షమిస్తుంది...కానీ తను వెళ్ళడు!

వెళ్ళగలిగే అర్హత సంపాదించు కున్నాక అప్పుడు వెడతాడు. అంతే గానీ ఇప్పుడు....

ఊహూ...

కృష్ణ హోటల్లోంచి బయటకువచ్చాడు. బహుసందడిగా ఉన్న ఆ బజారువీధిలోకి అడుగుపెట్టాడు. గమ్యం తెలీని రీతిలో అడుగులో అడుగు వేసుకుంటూ కది లాడు. జైల్లో ఉన్నపుడు రోజూ అను కుంటూ వచ్చినదాన్ని కార్యరూపంలో పెట్టడానికే నిర్ణయించుకున్నాడు.

* * *

బాబుకు నీళ్ళుపోసి ఒళ్లు తుడుస్తోంటే చూసిందతన్ని సుశీల. కిటికీలోంచి ఇంట్లోకి చూస్తున్నాడతను!

సుశీలకు చిరాగ్గా అనిపించింది. వెళ్ళి కిటికీవేసి వచ్చింది. దొంగ వెధవలు.ఎన్ని వినటంలేదుతను! రోజూ పేపర్లో రోజూకో పద్ధతిగా జరుగుతున్న దోపిడీలు, దొంగ తనాలు. పట్టపగలేవచ్చి ఇంటి ఆనుపాను లన్నీ చూసుకోవటం, ఆ తర్వాత రాత్రి పూట కొడవళ్ళు, కత్తులతో, గొడ్డళ్ళు, బరిసెలతోవచ్చి దోచుకుపోవటం-వీడూ అలాగే ఉన్నాడు.

లేకపోతే ఆ చూపులేమిటి - అను కుంది సుశీల.

ఈనాడు

# భాషాస్వరూపం

మాతృభాషలో మాట్లాడేటప్పుడు పామరులు కూడా తప్పులు పలకరుగాని రాసేటప్పుడు పండితులు కూడా తప్పులు రాయవచ్చు. ఎందువల్ల ?

మాట్లాడేటప్పుడు భాషకు హావభావాలు, అంగవిన్యాసం లాంటివి తోడ్పడతాయి. రాసేటప్పుడు ఈ సాధనాలుండవు. కనక విస్పష్టంగా, నిర్దుష్టంగా రాయాలంటే భాషకు ఒక ప్రమాణం ఉండాలి. పత్రికా భాషకు అలాంటి ప్రమాణం ఏర్పరచిన పుస్తకం ''ఈనాడు భాషాస్వరూపం''.

పత్రికల్లోనూ ఇతర వ్యావహారిక రచనల్లోనూ సామాన్యంగా కనిపించే తప్పులు పరిశీలించి అవి దొర్లకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు వివరిస్తూ ప్రముఖ భాషా శాస్త్రవేత్త డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ రచించిన పుస్తకమిది.

ఇది పత్రికా రచయితలకేకాక, ప్రజలకు అర్థం అయ్యేలాగా రాయాలని, తమ భావాలు స్పష్టంగా ఎదుటివారికి అందజేయాలని ఆశించే వారందరికీ ఉపయోగపడుతుంది.

వెల రు. 25.00

ఎం.ఓ. ద్వారాగాని, డి.డి.ద్వారాగాని ఈ మొత్తం పంపి ఈ పుస్తకాన్ని రిజిస్టరు పోస్టు ద్వారా పొందవచ్చు.

ప్రతులకు:

ఉషోదయా పబ్లికేషన్స్

ప్రయివేట్ లిమిటెడ్

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా,

హైదరాబాద్ – 500 004.

రెండు నిమిషాల తర్వాత ఆ సంగతే మర్చిపోయింది. ఆఫీసుకు వెళ్ళే హడావిడిలో నిమగ్నమయిపోయింది.

బాబుకు అన్నం పెట్టి తనకారియరు సర్దుకునేసరికి ఆయా వచ్చింది. బాబును ఆయాకు అప్పగించి లోపల్నించి ఇల్లు తాళం పెట్టుకోమని ఆయాకు హెచ్చరించి ఆఫీసుకు బయలుదేరింది సుశీల.

నాలుగయిదు అడుగులువేసి వెనక్కి తిరిగి చూసింది. వీధిలో జనం మామూలుగా ఉన్నారు. గతంలో తన ఇంటి కిటికీలోంచి ఇంట్లోకి తొంగిచూసిన దొంగ వెధవ ఎక్కడా కనిపించకపోవడం ఆమెకు తృప్తి కలిగించింది.

తిన్నగావెళ్ళి అటెండెన్స్‌లో సంతకం పెట్టి టైపు మిషన్‌ముందు కూర్చుంది. పక్కనవున్న ట్రేలోంచి కాగితాలు, కార్బన్‌లు తీసి మిషన్‌లో అమర్చింది. అక్షరాలమీదకు వేళ్ళు పరిగెట్టించింది. తన వేళ్ళ పరుగులకు అనుగుణంగా తెల్ల కాగితంమీద అక్షరాలు పడుతున్నాయి. ఆ అక్షరాలు కిందనున్న కాగితాలమీద కూడా తమ గుర్తుల్ని వేస్తూపోయాయి.

దాదాపు అరగంట తర్వాత దాహంగా అనిపించి సుశీల సీట్లోంచి లేచింది. కూలర్ కారిడార్ మూలనవుంది. నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ నడవసాగింది.

ఇదే కారిడార్, ఆరోజు తను ఇదిగో ఈ మూలనే బెంచిమీద కూర్చుంది ఇంటర్వ్యూకోసం వచ్చి. అప్పుడే ... వాడు వచ్చి తనకేసి చూడటం ఆరంభించాడు. చూసి చూసి...

సుశీలకు చికాగ్గా అనిపించింది.

ఎప్పటి సంగతి అది!

నాలుగైదేళ్ళు అయిపోయిందేమో! తారీకులు, తిథులు గుర్తుచేసుకుంటేగానీ... గుర్తుకురాని విషయం అది! కావాలనే మర్చిపోయిందా విషయాన్ని తను!

మరి ఈరోజు ఎందుకు గుర్తుకొస్తోంది ఆ సంఘటన! ఆనాటి విశేషాలు మళ్ళీ ఈరోజెందుకు గుర్తుకొస్తున్నట్లు!!

సుశీల బాత్‌రూంలోకివెళ్ళి ముఖం కడుక్కొచ్చింది—ఆ జ్ఞాపకాల గుర్తులైనా ఉండకూడదన్న ఆలోచనతో!

తిరిగి సీటు దగ్గరకు వచ్చేసరికి ఎదురు సీట్లో ఉండే వామనరావు చెప్పాడు. "సుశీలగారూ ... మీకు ఫోనొచ్చింది" అంటూ.

సుశీల వెళ్ళి ఫోనెత్తుకుంది.

"హలో ... నేను సుశీలను" అంది యధాలాపంగా.

ఫోన్లో కొత్తగొంతు చిత్రంగా పలికింది. "హలో సుశీలగారేనా?" ఆ మాటలు తడబడుతున్నాయి. అక్షరాలను పేర్చుకుంటూ వాటికి పదాలరూపు కల్పిస్తున్నట్లుగా, ఆ పదాలను ఆ తర్వాత మాటల్లోకి మారుస్తున్నట్లుగా....

"చెప్పండి...నేను సుశీలనే" అంది సుశీల మళ్ళీ.

క్షణం తర్వాత ఫోన్‌లోని గొంతు పలికింది — "నా పేరు కృష్ణ. మీకు గుర్తుండే ఉంటుంది"

కృష్ణ... ఎలా మర్చిపోతుంది ఆ పేరు – తన జీవితాన్ని నాశనం చేసిన వ్యక్తిపేరు.

క్షణకాలంలోనే సుశీల ముఖంలో చెమటలుపట్టాయి. మనసంతా కంగారుగా అనిపించింది. ఎన్నడూ ఎరగనిఆందోళన ఆమెను ఆవరించింది. ఫోన్ పెట్టేసింది సుశీల.

వచ్చి సీట్లో కూలబడింది. బాగ్‌లోని




రుమాల్ తీసి ముఖం మీది చెమటలు తుడుచుకొంది.

ఆమె ఆలోచనలు పలురకాలుగా పరిగెట్టసాగాయి. కృష్ణ - అంటే విడుదల అయిపోయాడా? విడుదల అయివుంటే ఇక్కడికి దేనికి వచ్చినట్లు? తన అడ్రసు వెతుక్కుంటూ, తన గురించి ఆరా తీసు కొంటూ వచ్చాడంటే, ఏంచేస్తాడు? మళ్ళీ ఏదైనా... తనకు కానీ, తన బాబుకుగానీ, రవీంద్రకుగానీ...

ఏమో....చెప్పలేం!

జైల్లో ఉన్నవాడు ఏం ఆలోచించు కొని వచ్చాడో ఎవరు చెప్పగలరు. ఏం చేయ నిర్ణయించుకొన్నాడో ఎవరు ఊహించకోగలరు??

సుశీల వణికిపోయింది.

అప్పుడు గుర్తొచ్చింది ఆమెకు! తన ఇంటిముందు ఉదయం తచ్చాడినవ్యక్తి... వాడు...వాడేనా??

తను తొందరలో సరిగ్గా గమనించింది కాదు. ఇంకొక్కసారి-కిటికీ తలుపు వేస్తున్నపుడైనా ఇంకొక్కసారి సరిగ్గా చూసి ఉంటే తను గుర్తించి ఉండేది! కానీ సరిగ్గా చూసిందిగాదు తను.

అయినా వాడు తన ఇంటిదగ్గర తచ్చాడుతున్నాడంటే ఒక్కసారి సుశీలకు గుండె ఝల్లుమంది.

వాడు తన కొడుకుకు ఏదైనా...

సినిమాల్లో చూపించేటట్లుగా ఏ ఆశ అయినా చూపించి వాడిని ఎతుకు పోతాడో ఏమో? ఎత్తుకుపోయి తనమీది మీది కోపంతో...ఏం చేస్తాడో ఏమో??

సుశీల ఆదరాబాదరాగా లేచింది.

తెల్ల కాగితంమీద నాలుగు వాక్యాలు రాసింది. రెండు రోజులు ఆఫీసుకు రానని, సెలవు కావాలని కోరింది.

ఆ కాగితం తీసుకొని సెక్షన్ హెడ్‌కు అందిస్తోంటే మళ్ళీ ఫోన్.

ఫోన్ గంట గణగణమంటూ ఉంటే సుశీలకు తనపై ప్రాణాలు పైనే పోయి నట్లుగా అనిపించసాగింది.

"సుశీలగారూ... ఫోన్ మీకే" అంటూ ఆ కాగితం తాను అందుకొని ఫోన్ సుశీలకు అందించాడు ఆ సెక్షన్ హెడ్.

"హ...లో..." అంది సుశీల కంఠం అంతా వణికిపోతూంటే.

"నేనండీ...ఇప్పుడే మాకు మెసేజ్ అందింది. రవీంద్రగారు ఇంకో రెండు రోజులవరకు కాంప్‌నుంచి రాలేరట. మీకా మెసేజ్ అందించమన్నారు" అన్నాడు అవతలివ్యక్తి.

"ఇట్సాల్ రైట్...థాంక్స్" అంటూ ఫోన్ పెట్టేసింది సుశీల. ఫోన్ పెట్టేశాక గుండెగుభేల్‌మంది సుశీలకు. ఇంకా రెండు రోజులదాకా రాడా రవీంద్ర అంటే ఈ రెండు రోజులూ తాను ఈ టెన్షన్ భరించటం ఎలాగ - అన్న ప్రశ్న ఆమె ముందు భయంకరంగా నిలిచింది.

"ఎందుకింత హఠాత్తుగా సెలవు పెడుతున్నారు" అనడిగాడు సెక్షన్ హెడ్.

సుశీల ఏ సమాధానమూ ఇవ్వలేదు

"మీ ఇష్టం వెళ్ళండి" అన్నాడు అతను.

అంతలో మళ్ళీ ఫోను ట్రింగ్ ట్రింగు మంది.

సుశీలే ఫోనందుకొంది ఈసారి "హలో"

"సుశీలగారు కావాలి, కొంచెం పిలుస్తారా?"

మళ్ళీ తనకే ఫోను...

"చెప్పండి...మాట్లాడుతున్నా" అంది సుశీల నెమ్మదిగా.

"నేనండి....కృష్ణను..." సుశీల ఆ మాట పూర్తిగా వినకుండానే ఫోను పెట్టేసింది.

పరుగులాటి నడకతో - ఆఫీసు మెట్లు దిగింది. ఆఫీసు బయటకు వచ్చింది. ఆటో ఎక్కి ఇంటివైపు బయలుదేరింది.

ఆ దారమ్మట వెడుతోంటే ఆమెకు గతమంతా కన్నులకు కట్టినట్లు కనిపిస్తోంది. ఆ జ్ఞాపకాల ముసుగు తప్పించుకొంటూ దృష్టిని భవిష్యత్తువైపు సారిపే ప్రయత్నంచేసింది. కానీ ఎక్కడా దృష్టి నిలవలేదామెకు. మనసంతా భయం...ఏం జరుగుతోందో, ఏం జరగనుందో తెలీని భయం.

ఆటో ఇంటిముందు ఆగింది. ఇంటి తలుపు తట్టింది. లోపలికి వచ్చి బాబును చూసుకొన్నాకగానీ సుశీల కంగారు తగ్గలేదు. గుండెల్లో భయం తగ్గేసరికి చాలాసేపు పట్టింది సుశీలకు.

ఇంట్లో ఆయా ఉండనే ఉందిగానీ... ఆయాకు తనను పొంచివున్న ప్రమాదం ఏమిటో తెలీదు. కృష్ణను ఆయా చూడనే లేదు. ఎవరైనా వచ్చి తలుపు తట్టినా పిచ్చిది వెళ్ళి తలుపు తీస్తుంది. అపాయాన్ని ఆదరంతో ఆహ్వానిస్తుంది. లోపలికి వచ్చిన కృష్ణ...ఏం చెయ్యటానికైనా వెనుదీయకపోవచ్చు. కనుక ఇది తనకు సురక్షితమైన స్థలంకాదు. ఇక్కడ తను, తన బాబు క్షేమంగా ఉండగల అవకాశం...దాదాపు మృగ్యం.

ఎప్పుడు విడుదల అయ్యాడో కృష్ణ అప్పుడే వేటలోపడ్డాడు. అతని పగకు తనూ,తన బాబూ బలయిపోయితీరతారా? తప్పదా? తనకు మృత్యువు తప్పదా...

తనకు చావాలనిలేదు.

బతుకుమీద ఈరోజు చాలా ఆశలు వున్నాయి. ఒకనాడు జీవితం అంటే



రోతపుట్టిన మాట వాస్తవం. ఆరోజు అలాటిది-బతుకును అన్ని వైపులనుంచి ఆక్రమించటానికి చీకట్లు కమ్ముకొచ్చిన రోజు అది! అపుడు...బతుకంటే భయం పుట్టి మరణమంటే మమకారం పెరిగింది. బతకటంకన్నా చావటం తేలికగా, అందంగా కనిపించిన రోజు అది.

కానీ...

ఇపుడు అలాక్కాదు.

తనకే-తన జీవితం అందంగా ఉంది. బాబుతో బతుకు తనకే ముచ్చట్లు గొలుపుతోంది. నూరేళ్ళ జీవితంకూడా ఇపుడు సరిపోయేలాలేదు.

ఇలాటి స్థితిలో ... గతం భూతమై వర్తమానంలోకి భయంకరంగా చొచ్చుకొస్తోంటే ఏంచేస్తుంది తను? భవిష్యత్తుకు భద్రత కల్పించుకోవటం ఎలా? బాబును రక్షించుకోవటం ఎలా??

ఇంకా రెండురోజుల వరకు రవీంద్ర రాడు.

అప్పటివరకు-

ఈ నరకాన్ని భరించగలగటం తనవల్లకాదు. ఒంటరిగా ఈ భయాన్ని ఎదుర్కోలేదు. దీనికన్నా...

సుశీల ఆలోచించుకొని పుట్టింటికి చేరింది.

తండ్రి రామనాథానికి చెబితే బెంబేలు పడతాడని అనుకొంటూ చెల్లెలికి చెప్పింది.

"కృష్ణ విడుదల అయినట్లుంది"

సుజాత ఉలిక్కిపడింది.

"ఎప్పుడు...నీకెలా తెలుసు?"

"ఈరోజు నాకు రెండుసార్లు ఫోన్ చేశాడు"

"నీకా? ఎప్పుడు చేశాడు? ఏమని చేశాడు?"

"రెండుసార్లూ 'నా పేరు కృష్ణ' అనగానే నాకే భయంవేసి ఫోన్ పెట్టేశాను" అంది సుశీల.

"అసలు అందుకే సెలవు పెట్టి మరీ ఇంటి కొచ్చేశాను"

"ఎక్కడ ఉన్నాట్ట? అయినా నీకెందుకూ భయం?" అనడిగింది సుశీలను సుజాత.

"ఎక్కడ ఉన్నాడో ఏమో! కృష్ణ అన్న పేరు వినగానే నాకు గుండెల్లో రాయిపడింది. మాట్లాడే ధైర్యంలేక పోయింది. ఇంట్లో ఆయా ఒక్కతేవుంది. బాబును ఏమైనా చేస్తాడేమోననిపించి ఇంటికొచ్చి వాడిని చూసేంతవరకూ నా ప్రాణం కుదుటపడలేదు.

"బాబును ఏమైనా చేస్తానని చెప్పాడా? బెదిరించాడా ఫోన్‌లో?" ఆశ్చర్యంగా అడిగింది సుజాత.

"ఛ...అలాటిదేమీలేదు. కానీ ఎవరు చెప్పగలరు. నీమూలానే జైలుపాలయ్యానని నామీద కక్షతో పిడిసేమైనా చేస్తే..?"

సుజాత ఆలోచనలోపడింది. కృష్ణ ఫోన్ చేసింది ఆ ఉద్దేశంతో అయి ఉండదు. బహుశా తన గురించి అడగటానికే అయి వుంటుంది. అయినా ఆ సంగతి నిర్ధారించుకోవటానికి సుజాతకు ధైర్యం చాలలేదు.

ఒక్కసారి కృష్ణను కలుసుకోవాలనిపించింది సుజాతకు.

కానీ ఎక్కడ ఉన్నాడని వెతుకుతుంది? ఎవర్ని అతని గురించి అడుగుతుంది?

"నువ్వు అతనితో మాట్లాడి ఉండాల్సిందేమో?" అంది సుజాత.

సుశీల నిర్ఘాంతపోయింది.

"వాడితోనా?"

"అవును..అతనితోనే...!"

"బాగుందివరస! వాడంటే నాకు గుండెలు అవిసిపోతున్నాయి. పగలు చూస్తే రాత్రి కలలోకివచ్చే రాక్షసుడు వాడు. వాడితో మాట్లాడాలా ... ఏం మాట్లాడాలి? 'ఏమండీ ... బాగున్నారా? జైలునుంచి ఎప్పుడొచ్చారు? రాబోయే ముందు ఉత్తరం రాశారుకాదేం?స్వాగతం చెప్పేవాళ్ళం! పోన్లెండి ఫోన్ చేశారుగదా, అదే పదివేలు! ఫోన్ పెట్టేసి తిన్నగా ఇంటికి వచ్చేయండి. హాయిగా విశ్రాంతి తీసుకొందురుగాని!' అనాలా ఏమిటి? చాలా బాగుంది నువ్వనే పద్ధతి" సుశీలకు కృష్ణ అంటే ఎంత కోపంగా ఉందో అంతా ఆ మాటల్లో వ్యక్తం అయింది.

సుజాత ఏమీ అనలేదు. ఆ క్షణంలో ఏమన్నా అక్క ఇంకేదో అంటుంది. దానికి తాను జవాబుగా ఏమన్నా 'ఏమిటి వాడిమీదంత ఇంటరెస్ట్ చూపిస్తున్నావ్? మీ బావగారి గాలి సోకిందా ఏమిటి? ఆదర్శం పేరుతో వాడిని పెళ్ళికూడా చేసుకొంటాను అనేలా ఉన్నావ్' అనేస్తుంది! ఆ మాటల్లో నిజం ఉంటే ఉండొచ్చుగానీ ... అనిపించుకోవటం బాగుండదు!

సుజాత ఏమీ అనకపోవటంతో కొంచెం ఆలోచించి అంది సుశీల, "అయినా నాకో సందేహమే! ఇన్నాళ్ళ తర్వాత ఇంకా కక్ష ఉంటుందంటావా? ఉన్నా ఏం చేస్తాడంటావ్?"

"నాకేం తెలుసు! అడిగి తెలుసుకోవాల్సింది!"

"అమ్మో ... నాకంతధైర్యమే! అయినా ... నాకెందుకు చేశాడంటావ్ ఫోన్? ఏం చెప్పదల్చుకొని ఉంటాడు?"

"ఈసారి ఫోన్‌చేస్తే నాకు ఇయ్యి! నేను మాటాడి తెలుసుకొంటా!" అంది సుజాత వేళాకోళం చేస్తున్నట్లు.

"సెలవులో ఉన్నాకదా, ఇంక ఫోన్ చేసినా మనకు తెలీదు. అయినా ఫోన్‌లో మాట్లాడాల్సింది నేను! ఎంత కక్ష ఉన్నా ఫోన్లో ఏమీ చెయ్యలేడుగదా?... తప్పు చేశాను. ఫోన్లో మాట్లాడి ఉంటే వాడి ఉద్దేశమైనా తెలిసేది!"

"హూ!" అని నిట్టూర్చింది సుజాత 'బాగుంది నీవరస!' అన్నట్లుగా.

"ఫోన్ పెట్టకుండా కొద్దిసేపు మాట్లాడి ఉండాల్సింది! ఎక్కడ ఉన్నాడో ఏమో తెలిసేది! వాడి మనసులో ఊహల్ని పసిగట్టే వీలుండేది! అవసరమనుకుంటే ముకుందరావుగారికిచెప్పి, పోలీసుల సాయమైనా కోరేపని!" సుశీల తప్పు చేశాను అన్నట్లు మాట్లాడటం సుజాతకు నవ్వు తెప్పించింది.

"పోనీ ఒకపనిచెయ్యి! సెలవు కాన్సిల్ చేసుకొనివెళ్లు. ఫోన్‌చేస్తే ఇదే మాట్లాడు దువ్గాని" అంది సుజాత నవ్వుతూ.

"నీకంతా వేళాకోళంగా ఉన్నట్లుంది.. ఇవతల నేను భయంతో చస్తోంటే!"

"అంత భయపడాల్సిన పనేమీలేదు. అతనేమీ అంత రాక్షసుడుగాడు!"

"కాదా? కాదని ఎలా అనగలుగుతున్నావ్? ఆనాడు అంతపని చేసినవాడిని ఈరోజు 'రాక్షసుడుగాదు' అంటూ ఎలా సర్టిఫై చెయ్యగలుగుతున్నావే?"

"ఆనాడుగదా అది చేసింది! నేను మాట్లాడేది ఈనాటి సంగతి! అయిదేళ్ల జైలు జీవితం అతన్ని మనిషినిచేసి ఉంటుంది" సుజాత నెమ్మదిగా అంది.

అడ్డంగా తల ఊపుతూ అంది సుశీల "నీకు తెలీదే మన జైళ్ళ సంగతి! వీటికి సంస్కార కేంద్రాలని పేరేతప్ప అక్కడ ఏఖైదీ, ఏ నేరస్థుడూ సంస్కారం అల

వర్ప్చుకుంటాడని నేను అనుకోను. ఇంకా రాటుదేలి బయటపడి, ప్రజల్ని ఇదిగో... నీదృష్టిలో ఎంతో మారిపోయి ఉంటాడను కానే కృష్ణలాగే వేధించుకు తింటాడు! జైలుకు వెళ్ళి బాగుపడ్డ జనం కూడా ఉంటారని నేను అనుకోను''

"పోన్లే...నీఉద్దేశం నీది. నా అభిప్రాయం నాది. అతను ఫోనెందుకు చేశాడూ అని వర్రీ అయిపోవటంకన్నా ఎందుకు చేశావూ అని అడిగివుంటే సరిపోయేది. అమాటే. అంటున్నా నేను. అంతే" అంది సుజాత.

"అదీ నిజమే...ఆపనే చేసివుంటే ఈ బాధ ఉండేదికాదు ... ఆరోజు కోర్టులో 'నేనేతప్పు ఎరగను' అన్నాను. 'క్షమించండి ... తప్పునేనే చేశాను' అనేవాడో, ఏమో? ఇంత గొడవా ఉండకపోను. నాకింత బాధ ఉండకపోను" మథనపడుతూ అనుకొంది సుశీల.

సుజాత మాత్రం అలా అనుకోలేదు. సుశీలకోసం ఫోన్ చేసిన కృష్ణ తనకోసం రానేరావచ్చునని ఆమె నమ్మకం.

తలుపు తట్టినట్లు ఏ చిన్న చప్పుడైనా కృష్ణే వస్తాడని ఆమె ఎదురు చూస్తూ ఉండిపోయింది.

సుశీలకు మాత్రం ఆ అదురుబెదురూ ఇంకా తగ్గనేలేదు.

"పోనీ, ఒకపనిచేస్తేనో..." అంది సుశీల ఆ తర్వాత.

"చెప్పు"

"వెళ్ళి ముకుందరావుగారికి చెప్పి, ఏం చెయ్యమంటారో అడిగితే?"

"ఆయన సలహాయే కోరతావో, పోలీసుల సాయమే కోరతావో, నీ ఇష్టం. నువ్వు నిర్ణయించుకో. నేనుదేన్నీ కాదన్ను నువ్వు ఏం చేస్తానన్నా వద్దన్ను"

సుశీల సుజాతకేసి పరీక్షగా చూసింది.

"అదేమిటే...అంతతేలిగ్గా కొట్టిపారేస్తావ్? ఏదన్నా సలహా ఇవ్వొచ్చుగదా"

"ఇవ్వొచ్చు...కానీ నువ్వువింటావా?"

"వింటాను చెప్పు"

"అయితేసరే. కృష్ణ నీకేకాదు, నాకూ తెలుసుగదా! అదే..కోర్టులో అతనిపద్ధతి అదీ గమనించినదాన్నేగదా! అతన్ని చూస్తే నాకెందుకో అతనా నేరం చేసి ఉండదేమోననే అనిపించేది. అతనిలో నాకెందుకో నేరస్థుడే కనిపించేవాడుకాదు. కానీ..చేశాడు అంటే చేశాడు కాబోలు అనుకున్నా నేను. పోనీ..చేసినా చెయ్యకపోయినా ఈరోజు ఏంచేస్తాడంటావ్? అతనివల్ల మనకే ప్రమాదమూవచ్చే అవకాశం వుందనుకోను! మనం అనవసరంగా భయపడిపోవటమేగానీ. .ఇపుడొచ్చిన ప్రమాదమేమీలేదు. నామాట విను. విని..ఆఫీసుకువెళ్ళిపో. ఇక్కడ నీ బాబుకు నా ప్రాణం అడ్డేస్తాను. ఒకవేళ కృష్ణ నీకు ఫోన్ చేశాడనుకో విషయం, వివరం అన్నీ కనుక్కో. ఇంట్లో కూర్చుని బాధపడి బెంగపెట్టుకోవటంకన్నా అది మేలు" అంది సుజాత.

ఆ సలహా బాగుంది అనిపింట సుశీల అరగంట గడిచేసరికి ఆఫీసుకు బయలుదేరి వెళ్ళిపోయింది.

ఫోన్ మోగినప్పుడల్లా అది తనకే అనుకొని సుశీల అతనితో మాట్లాడాలను కొనేవన్నీ మనసులో మననం చేసుకొనేది గుండెల్లో ధైర్యం నింపుకొనేది. ఇలా సిద్ధమయేసరికి ఆ ఫోన్ మరెవరికో అయ్యేది.

సుశీల సాయంత్రంవరకుచూసి ఫోన్ ఇంక రాదని నిర్ణయించుకొంది.

సుశీల ఇంటికొచ్చి ఉస్సురుమంటూ

అంది- "అనవసరంగా వెళ్లా...ఏ ఫోనూ లేదు"

సుజాత నెమ్మదిగా అంది, "కృష్ణ సంగతా నువ్వు చెప్పేది? అతను ఇంటికి వచ్చి వెళ్లాడు"

"వచ్చాడా...ఏం చెప్పాడు?" ఆత్రుతగా అడిగింది.

"నాతో ఏమీ చెప్పలేదు. చెప్పాల్సింది చాలావుంది, మీ అక్కతోనే చెప్తానన్నాడు"

"నువ్వేమీ అడగలేదా?"

"నేనెందుకు అడగటం. అక్కతో మాట్లాడాలంటే సాయంత్రంరా, ఉంటుంది, అని చెప్పాను. వెళ్ళిపోయాడు!"

"అంటే కనీసం ఏం చెప్పలేదా? ఏవిషయం మాట్లాడ్డానికి వచ్చాడో అదైనా...పోనీ సూచనగాకూడా...పోనీ మనిషి ఎలా ఉన్నాడు?"

సుశీల ప్రశ్నలన్నీ సుజాతకు నవ్వు తెప్పించాయి.

"ఏమీ చెప్పలేదు! నేనేమీ అడగలేదు! మనిషి ఎల్లా ఉన్నాడంటే...మామూలుగానే ఉన్నాడు. నాకే భయమూ వెయ్యే లేదు. పావుగంటకు పైగానే మాట్లాడాను. టీకూడా ఇచ్చి పంపాను"

"టీ కూడా ఇచ్చి పంపావా? అంత సేపు ఏం మాట్లాడావే నువ్వు"

"ఏదో పాపం అయిదేళ్ళనుంచీ జైల్లోనే ఉండి పోయాడుగదా దేశ రాజకీయ పరిస్థితులు ఎలా మారాయో తెలిసి ఉండవని అవన్నీ చెప్పాను. అన్ని వస్తువులధరలూఎలా పెరుగుతూ వచ్చాయో అదీ చెప్పాను. జైల్లో ఎలా ఉంటుందని అడిగాను"

"ఎలా ఉంటుంది? రాళ్ళు కొట్టించారటనా. పిండికూడా వుబ్బిస్తారని విన్నా! అవన్నీ చేయించారటనా"

సుజాత నవ్వింది- "అవేవీ చెప్పలేదు గానీ యంఎ పరీక్షపాసయ్యానని చెప్పాడు. ఆ ... అన్నట్లు ఆ విషయంలో సాయపడినందుకు కృతజ్ఞతలుకూడా చెప్పాడు"

"నీవన్నీ వేళాకోళాలు..."

"కాదు...నిజమే. పోనీ సాయంత్రం వస్తాడుగదా....నువ్వే అడిగి తెలుసుకో"

క్షణం ఆగింది సుశీల- "నువ్వు ఎలా మాట్లాడావో ఏమోగానీ నాకయితే అతని సంగతి తల్చుకోగానే ఒళ్ళంతా చెమటలు పట్టేస్తున్నాయి"

సుజాత ఏదో జవాబు ఇచ్చేలోగానే వీధి తలుపు కొట్టిన చప్పుడయింది.

"అతనే అయి ఉంటాడు....వెళ్ళి చూడు" అంది సుశీల.

సుజాత వెళ్ళి తలుపు తీసింది ఎదురుగా కృష్ణ.

"రండి..."అంది సుజాత.

సుశీల ముఖం అంతా చెమటలు.

"రండి...అక్క కూడా వచ్చింది. మీరు వచ్చి వెళ్లినట్లు చెప్పా! మీ గురించి మాట్లాడుకొంటూ ఉండగానే మీరొచ్చారు" అంది సుజాత.

కృష్ణ అడుగు లోపలికి వేసి సుశీలను చూసి చిరునవ్వు నవ్వాడు.

"మీకు నామీద ఇంకా కోపం పోయినట్లు లేదు" నెమ్మదిగా అన్నాడు కృష్ణ.

"చెప్పు...ఇంకేం చెయ్యాలని ఉంది? ఏం చెప్పాలని ఉంది?" కోపంగా అంది సుశీల.

"మీరు కోపంతో ఉంటే నాకేమీ చెప్పకోవాల్సింది లేదు. ఆరోజూ మీరు కోపంతోనే ఉన్నారు. కోపం ఆలోచనను చంపేస్తుందని మీరు వినలేదా? తన కోపమే తన శత్రువు అన్న సంగ




గుర్తులేదా మీకు? కోపం కొంచెం తగ్గించు కొని వినదల్చుకొంటే చెప్తాను''

"చెప్పు .... ఏం చెప్పుకోవాల్సి ఉంది?"

"మీకు నామీద ఏ కోపం ఉందో నాకయితే తెలీదు.ఎందుకు మీరు శత్రుత్వం వహించి నన్ను వేధిస్తున్నారో అదీ తెలీదు. కానీ నేను నిజం చెప్తున్నాను... ఆపని మీరనుకొన్నట్లు, అనుకొంటున్నట్లు నేను కాదు చేసింది"

"ఇంకా ఆ బుకాయింపు పోలేదా"

"బుకాయింపు కాదిది. నిజం...ఆరోజు నిజమే చెప్పా! ఈరోజూ నిజమే చెప్తున్నాను. ఆరోజు అబద్ధం చెప్తున్నానంటే శిక్ష తప్పించుకోటానికి అనుకోవచ్చు మీరు, కానీ ఈరోజు అబద్ధం ఎందుకు చెప్పాలి నేను. ఒక నేరానికి రెండు శిక్షలు లేవు ఏదేశంలోనూ. ఈరోజు ఆ నేరాన్ని నేనే చేశానని నిజం చెప్పినా నన్నెవ్వరూ ఏమీ చెయ్యలేరు! కానీ నిజం అదికాదు-ఆ నేరం నేను చెయ్య లేదు. శిక్ష అనుభవించి వచ్చి మీకు ఈ సంగతి చెప్తున్నానంటే ఆలోచించండి... ఈరోజు మీరు నాకు చెయ్యగల ఉప కారం ఏదీ లేదు. కనీసం నిజం గ్రహిస్తే చాలు, ఆ కారణంగా ఒక నిర్దోషి జైలు పాలయ్యాడన్న విషయం మీరు గుర్తిస్తే చాలు. నేరం చేసిన వాడెవరోగానీ ఇంకా తప్పించుకు తిరుగుతున్నాడన్న సంగతి మీరు గుర్తు పెట్టుకొంటే చాలు...ఈ విషయం చెప్పటానికే వచ్చాను"

సుశీల ఆశ్చర్యపోయింది.

"మరి...?"

"ఎవరు చేశారో నాకు తెలీదని చెప్పా గదా! పోలీసులు వచ్చి చూసేసరికి బట్టలు ఉతుక్కుంటున్నాను. ఆ క్షణంలో నానేరం అంతా ఓదవాడిగా పుట్టటం. రెండే జతలు ఉండటంతో ఎప్పటికప్పుడు ఉతుక్కోవటం నాకు తప్పనిసరి! ఆపనే చేస్తోంటే సాక్ష్యాల్ని నాశనం చేస్తున్నా వన్నారు. విధి వక్రించిందని తెలియటంతో తలవంచి శిక్ష అనుభవించాను. నేరస్తుడికి శిక్ష వేయించాలని ఆలోచించారేగానీ... నేను నేరస్తుడిని అవునో కాదో ఆలోచించ లేదు మీరు. నిజం చెప్పండి...మిమ్మల్ని చెయ్యి పట్టి లాగింది నేనా? చేలోకో,రోడ్డు పక్కకో తాక్కెళ్ళింది నేనా...సాక్ష్యాధా రాలు ఉన్నాయని నన్ను కటకటాల వెనక పడేశారుగానీ...నేరం చేశానని రుజువయినందుకు కాదు"

కృష్ణ ఆగాడు.

"పోన్లెండి...చెయ్యని నేరానికి జీవి తాన్ని కోల్పోయాను. దానికి నాకేంబాధ లేదు. ఒకరిమీద కక్షాలేదు ... కోపమూ లేదు. ఈ జీవితాల్ని నడిపేవాడు పైన-ఎవరో ఉన్నారన్న సంగతి మాత్రం నిర్ధారించుకొన్నా ... తలవంచి బతుకు తున్నా...వస్తా'' అంటూ లేచాడు కృష్ణ.

సుశీల కూడా లేచింది.

క్షణం ఆగి అంది "ఉండండి... టీతాగి వెళ్దురుగాని''

సుజాత ఆశ్చర్యపోయింది.

కొద్దిసేపటి క్రితం-అతన్ని టీకి ఉండ మన్నందుకు తనను కేకలేసిన అక్క ఇప్పుడు అదే తప్పు చేస్తోంది.

''వద్దులెండి....మళ్ళీ ఎప్పుడో కని పిస్తా. అప్పటికి మీ కోపం తగ్గితే అప్పుడు ఆలోచిద్దాం" అంటూకృష్ణఒకసారిసుజాత కేసి చూసి. ''వస్తా సుజాతా" అంటూ ఇంట్లోంచి బయటకు నడిచాడు-వాళ్ళిద్దర్నీ ఆయోమయంలో, ప్రశ్నలలో నిలుపునా

ముంచి.

చీకటి పడిపోయి చాలా సేపయింది.

ఆ అక్కా చెల్లెళ్ళిద్దరూ - తమ తమ ఆలోచనల్లో మునిగి ఉన్నారు. ఎవరి ఆలోచనలు వారివి.

సుశీల-చాలా సేపటికి లేచి... ఇకనైనా చీకటిపోగొట్టుకోవాలన్న ధోరణితో - లైటు వేసింది. ఇల్లంతా వెలుగు నిండింది.

"అతను చెప్పేది నిజమే అయి ఉంటుందనిపిస్తోంది నాకు. ఎక్కడో ఏదో పొరబాటు జరిగి ఉంటుంది. లేక పోతే ఇన్నాళ్ళ తర్వాత మళ్ళీవచ్చి... ఇలా చెప్పిపోవటానికి ఇంకో కారణం ఏదీ ఉండివుండదు'' అంది సుశీల, తనలో తాను అనుకొంటున్నట్లుగా.

సుజాత ఒకసారి అక్కకేసి చూసి అంది-''చాలారోజులనుంచీ, నీకో సంగతి చెప్పాలా వద్దా అని ఆలోచిస్తూ ఉండి పోయాను. ఈరోజు అది చెప్పాల్సినపని పడింది. విను, చెప్తాను"

"అదేమిటి?" అనడిగింది సుశీల, "ఈవేళ అందరూ నిజమే చెప్పాలని... నిజం తప్ప వేరేది ఏదీ చెప్పకూడదని నిర్ణయించుకొన్నారా, ఏం?" నవ్వింది.

"ముందో విషయం చెప్పనీ! నీకు తెలీదుగానీ-ఆ దుర్ఘటన జరగటానికి ముందునుంచీ కృష్ణ నాకు తెలుసు..చాలా బాగా తెలుసు. ఎంత బాగా అంటే మేం ఇద్దరం పెళ్ళి చేసుకోదల్చుకున్నంత బాగా"

సుశీల ఆశ్చర్యపోయింది.

"నిజంగానా?...మరిన్నాళ్ళు చెప్పావు కావేం?

''చెప్తే-ఏంజరిగేది? ఏం చేసేవారు? అతను ఆ నేరం చెయ్యలేదని చెప్తే దానివా కోర్టులో? నేరం చేసినా, మన వాడేగదానని కోర్టువరకు వెళ్ళేదానివే



కాదా...ఆలోచించు"

సుశీల జవాబేం ఇవ్వలేదు.

''అయినా, అదికాదు నేను నీకు

చెప్పదల్చుకొన్నది. నేను చెప్పాలనుకున్నది నీ భర్త రవీంద్ర గురించి..." అంటూ రవీంద్ర తనపట్ల ప్రవర్తించిన తీరు అంతా చెప్పింది సుజాత.

సుశీల ముఖం కత్తివేటుకు నెత్తురు లేనంతగా పాలిపోయింది.

అంతా చెప్పాక, "నిజం అంటావా అది?" అనడిగింది.

"నేచెప్పింది నిజం. నమ్మటం నమ్మక పోవటం నీఇష్టం. కానీ...నాకెందుకో రవీంద్ర అంటే సందేహాలే చాలా ఉన్నాయి" అని ఖచ్చితంగా చెప్పింది సుజాత.



## 10

రెండురోజుల తర్వాత-రవీంద్ర కాంప్ నుంచి తిరిగి వచ్చాడు. అంతవరకు ఓపికపట్టిన సుశీల భర్తరాగానే కోపంతో ఎగిరిపడింది. సుజాతతో మీ మిస్‌బిహేవియర్ ఏమిటని ప్రశ్నించింది.

రవీంద్ర అంతాఓపిగ్గా విని చివరకు అన్నాడు, "ఇంత చెప్పింది మీ చెల్లెలు, ఒక్క విషయం చెప్పలేదా?"

"ఏమిటది?"

"ఆరోజు ఇంట్లో మేం ఇద్దరమే ఉన్నాం. ఆ అమ్మాయిని ఏమైనా చెయ్యగల అవకాశం కూడా నాకుంది. కానీ ఆ అమ్మాయిమీద చెయ్యేశానా...అదిగానా, ఆ సంగతి?"

"అదొక్కటే తక్కువయింది ఇంక"

రవీంద్ర నవ్వాడు. "నీదంతా పిచ్చి. నేను ఆ అమ్మాయితో ఆ విషయం ప్రస్తావించిన విషయం రైటే! కానీ నేనన్నది అదికాదు...'పెళ్ళికి తొందర పడు! లేకుంటే అక్క మొగుడిని ఏమైనా చేస్తాను జాగ్రత్త' అంటూ వేళాకోళం ఆడాను. దాన్ని మీ సుజాత నిజమే అనుకున్నట్లుంది కాబోలు. అయినా సుశీలా...ఒక్కమాట నేనలాంటి వాడిననే నీ ఉద్దేశం?"

సుశీల రవీంద్ర ముఖంలోకి పరిశీలనగా చూసింది. భర్త! తనకు బతుకు ప్రసాదించిన ఆ వ్యక్తి...అలా ప్రవర్తించి ఉంటాడంటే ఆమెకు నమ్మబుద్ధి కాలేదు. అనవసరంగా ఆ ప్రసక్తి తెచ్చినందుకు బాధపడుతున్నట్లు నొచ్చుకొంది మనసులో.

ఆతర్వాత నెమ్మదిగా భర్తకుచెప్పింది కృష్ణ వచ్చి మాట్లాడి వెళ్ళిన సంగతి.

"ఫర్గెటిట్ సుశీలా-ఎప్పుడో జరిగిన విషయమది. తప్పు చేశాడో లేదో జరిగిందేదో జరిగిపోయింది. నీకొచ్చిన నష్టం ఏమీలేదు. పెళ్ళిచేసుకొని సుఖంగా కాపురం చేసుకొంటున్నదానివి, ఇంకా ఏమిటి?"

సుశీల నెమ్మదిగా అంది "అవుననుకొంది-కానీ...ఒక నిర్దోషి ఇలా శిక్షల పాలవటంఅన్యాయమేగదా! ఆ ఉసురు మన కుటుంబానికి తగలదంటావా...చెప్పండి"

"అతను తప్పు చేయలేదనే నిర్ణయించుకొన్నట్లుందే నువ్వు! అయినా నీకు తెలిసింది ఏముంది సుశీలా...దోషులంతా అంతే! వారి మనస్తత్వమే అంత! తప్పు చేయనే చేస్తారు, చెయ్యలేదనే అంటారు"

రవీంద్ర ఆ ప్రస్తావన కొట్టివేస్తున్నట్లుగా అన్నాడు.

"మీరెన్ని అయినా చెప్పండి. కానీ ఎందుకో...అతనా నేరంచేసి ఉండడనే అనిపిస్తోంది"

"నీదంతా పిచ్చి సుశీలా! అతను చెయ్యకపోతే ఎవరు చేసి ఉంటారా నేరాన్ని? నేనా?...పోనీ, నేనే అనుకో-పెళ్ళాడాగదా శిక్ష కూడా వేసినట్లే అయింది" అంటూ పకాపకా నవ్వేశాడు రవీంద్ర.

"మీకు ఏదైనా వేళాకోళమే" అంటూ నవ్వింది సుశీల.

"నా మాట విను-ఆ ఛాప్టర్ నీ జీవితంలో ముగిసిందనుకో! అదే ఆలోచించి మనసు పాడుచేసుకోకు. అన్నట్లు చెప్పటం మరిచాను-రేపు మళ్ళీ నేను కేంపు కెళ్ళాలి. బట్టలు అవీ సిద్ధంచేసివుంచు! ఉదయం ఆరింటికే ఇల్లు వదలాల్సి ఉంటుంది"

ఆ రాత్రి! అన్ని రాత్రులలాగే భర్తతోనే గడిపినా, గతంలో ఎన్నడూ చోటు చేసుకోని అసంతృప్తి ఏదో సుశీలలో నిండింది.

కృష్ణకాదు. మరెవ్వరు?

ఎవరు అంతగా తప్పించుకోగలిగిన వ్యక్తి?

ఏ సాక్ష్యమూ లేకుండా ఎలా పోయింది?

సాలెగూటిలో చిక్కుకొని కష్టాల పాలయ్యే ఈగలాగా కృష్ణ ఈ చట్టం వలలో ఎలాపడ్డాడు? ఎందుకు శిక్షకు గురయినాడు?

రాత్రంతా కలత నిదరగానేవుంది ఆమెకు.

మన్నాడు ఉదయం తూర్పు తెల్లవారకుండానే నిద్రలేచింది సుశీల. భర్త చెప్పినట్లు అతని కాంప్‌కు అవసరమైనబట్టలన్నీ సర్ది పెట్టి అతన్ని లేపింది.

రవీంద్ర తయారయి వెళ్ళబోతోంటే అంది సుశీల. "నేనొకసారి ముకుందరావు గారిని సంప్రదిస్తా ఈ విషయంలో!"

"నీ ఇష్టం. వద్దంటే వినేలా లేవు కదా!" అని ఆగి సముదాయిస్తూ అన్నాడు రవీంద్ర. "సుశీలా..ఆలోచించు ఇపుడు గతాన్ని తవ్వుకోవటం ఎందుకు? ఏం లాభం? అర్థంపర్థంలేని ఆలోచనలతో సతమతమవటం తప్ప"

సుశీల ఏమీ అనలేదు.

"సరే...నీ ఇష్టం. అయినా నీకు ఏ ఆలోచన పడితే ఆ ఆలోచనేగానీ ... ముందు వెనుకలు చూసుకోవటం మొదటి నుంచీలేదు. అప్పుడూ అంతే...ఇలాటి విషయం గుట్టుగా భరిస్తారు సాధారణంగా స్త్రీలు. నువ్వేమో కోర్టుకెక్కి కోడై కూశావు. ఆ క్షణంలో నాకేదో తట్టి నీ మెడలో మూడుముళ్లు వేశాను. ఇపుడు ఆ కథ అందరూ మర్చిపోయారు. ఇన్నాళ్ళ తర్వాతనువ్వు 'ఆరోజు నేరస్థుడు అతడు కాదండోయ్' అంటే ప్రజలంతా పిటీషన్ పెట్టి నిన్ను పిచ్చాసుపత్రిలో పారెయ్యాలని ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియాకు విజ్ఞప్తి చేస్తారు. పాస్ట్ ఈజ్ పాస్ట్...దాన్ని కెలకకు! అసలు కృష్ణ నీతో ఈ విషయం ప్రస్తావించాడన్న సంగతే మర్చిపో...అర్థమయిందా?"

తలెత్తి భర్తకేసి పరిశీలనగా చూసి ఊరుకుండిపోయింది సుశీల. రవీంద్ర వెళ్ళిపోయాడు.

అంతేగాని ముకుందరావును కలవటం మాత్రం మానలేదు సుజాతతో కలిసి వెళ్ళింది.

జరిగిందంతా చెప్పింది సుశీల.

క్షణంఆగి అంది సుజాత, "ఇలా అంటున్నానని తప్పుగా అర్థంచేసుకో కండి...కానీ నాకెందుకో రవీంద్రమీదే అనుమానంగా ఉంది. అతనే ఈ పనిచేసి ఉంటాడని నాకు అనుమానం"

సుశీల నివ్వెరపోయింది.

"అదేమిటే, అలాఅంటావ్! నోటికి ఏ హద్దూ లేకుండాపోయింది నీకు! ఆయనకా ఖర్మ దేనికి పడుతుంది? ఆయన నా భర్త... అది గుర్తుంచుకో" అంది తేరుకుంటూ.

"రవీంద్ర నీకు భర్తే! కాదనను! కానీ ఆరోజు అతను నీకు భర్తకాదు... గుర్తుం చుకో! నేరం అతనే చేసివుండొచ్చుకదా! నేరంచేసి ఆ గిల్టీకాన్షస్‌తో నిన్ను పెళ్లాడి ఉంటాడని నా ఉద్దేశం! అంతేగానీ మనం పేరుపెట్టుకున్నట్లు అది ఆదర్శమూకాదు, నా బొందాకాదు" ఖరాఖండిగా అంది సుజాత.

ముకుందరావు నెమ్మదిగా అడిగాడు "సుశీలా...బాగా ఆలోచించి చెప్పు ఆరోజున రవీంద్రను చూసిన గుర్తు నీకుందా?"

సుశీల తడబడింది. తను ఇంటర్వ్యూకు వెడుతోంటే 'లిఫ్ట్ కావాలా మేడం?' అని అడిగిన వ్యక్తి రవీంద్రే కావటం యాదృచ్ఛికమేనేమోగానీ ఆ విషయం దాచిపెట్టలేకపోయింది సుశీల.

"అయితే అతనుకూడా నేరస్థుడు కాగల అవకాశం ఉందమ్మా! కానీ అదొక్క సాక్ష్యం చాలదు! ఆరోజు నువ్వెందరిన్నో చూసివుంటావ్! వాళ్ళం దర్నీకూడా ఇలాగే తప్పుపట్టే అవకాశం ఉంది. నిజంగానే ఒక ఆదర్శంతో అతనా తర్వాత నిన్ను పెళ్ళాడివుంటే ఇప్పుడు అతన్ని దోషిగా నిలబెడితే అన్యాయమే గదా!" అన్నాడు ముకుందరావు.

"మరేంచేద్దామంటారు? అయినా ఒక వేళ ఆయనే అయినా ఇపుడు ఏ కోర్టయినా ఏం చేస్తుంది?" సుశీల ప్రశ్నిం చింది.

ముకుందరావు క్షణంఆగి ఆలోచించి అన్నాడు, "మంచిప్రశ్నే! ఎంతటి కోర్టయినా అక్కడ ఉండేది మనుషులేగదా! వాళ్లు అన్ని నేరాల్నీ, సాక్ష్యాధారాలను బట్టి విచారించగలరేగానీ నిజానిజాలు ఏవో తామే చూసినట్లుగా న్యాయనిర్ణయం చెయ్యలేరుగదా! వాళ్ళూ పొరబడే అవ కాశం ఉంది"

"అసలు ఇది చెప్పండి-కనీసం కృష్ణ ఆ నేరస్థుడు కాకపోవచ్చునని అయినా ఋజువుచేసుకోగల అవకాశం... పోనీ బెనిఫిట్ ఆఫ్ డౌట్ ఇవ్వగల వీలుంది గదా!" అంది సుజాత.

"బెనిఫిట్ ఆఫ్ డౌట్‌కు ఈరోజు అవకాశంలేదు. తీర్పు వెలువడకముందే సాక్ష్యాధారాలు సరిగ్గా లేకపోతే కోర్టు ఆ నిర్ణయానికి రాగల అవకాశంఉంది! కానీ సుజాతా... ఆ రోజు నాముందున్న సాక్ష్యాలన్నీకృష్ణనే దోషిగాచూపించాయి. అందుకే శిక్షవేశాను" అన్నాడు ముకుంద రావు.

"మ రే ం చె య్యా మ ం టా వు మమ్మల్ని?"

"ఇలా చెప్తున్నానని ఏమీ అనుకో కండి! రవీంద్రే తప్పుచేసి ఉంటే, అతను ఆ విషయాన్ని ఒప్పుకొంటే కృష్ణను నిర్దోషిగా ప్రకటించే వీలుకలుగు తుంది"

"అంతేనా?"

"ఇలాంటి కేసు ఎప్పుడోగానీ న్యాయ





స్వాతి

# కథలు నవలల పోటీ

సృజనాత్మక ప్రతిభలో, రచనాపాటవంలో సమర్థులైన రచయితల కృషికి న్యాయం చేకూర్చాలనే లక్ష్యంతో, వినూత్నరీతిలో మూడుఅంచెలుగా కథల /నవలల పరిశీలన జరుగుతోంది.

తొలిరెండుదశల నిష్పాక్షిక పరిశీలనలో నెగ్గని రచనలన్నీ ఆగస్టు ఆఖరివారంలోనే ఆయారచయితలకు త్రిప్పిపంపటం జరిగింది. బహుమతుల నిర్ణయార్థం జరుగుతున్న మూడవదశ పరిశీలన మీరిది చదివేనాటికి పూర్తయి బహుమతి పొందిన రచనలు, రచయితలు, రచయిత్రుల వివరాలతో ప్రకటన వెలువడగలదని ఆశిస్తున్నాం.

మొత్తంమాకు అందినరచనలు:

నవలలు ........................................ 357

కథలు ........................................ 2110

తొలిరెండుదశలలో నెగ్గనివాటిని త్రిప్పిపంపగా బహుమతులకై పరిశీలించదగిన స్థాయిలో తేలిన రచనలు:

నవలలు ........................................ 78

కథలు ........................................ 159

## రు: 1,00,000

## బహుమతులు



విపుల

శాస్త్ర చరిత్రలో ఎదురుకాదు! కేసు విచారించే న్యాయమూర్తినిబట్టి ఉంటుంది. అయిదేళ్లపాటు కృష్ణ జైల్లో ఉన్నాడు. అది పొరబాటున జరిగిన న్యాయనిర్ణయమే. అయితే, దానికి ప్రభుత్వం నష్టపరిహారం ఇచ్చుకోవాల్సిన పరిస్థితి వస్తుంది! కానీ చెప్పలేం-ఇలాంటి కేసులు ఏమవుతాయో! అంతా న్యాయమూర్తి దృష్టిలో వుంది''

''న్యాయశాస్త్ర గ్రంథాలు ఏం చెప్తున్నాయి చెప్పండి!'' అడిగిందే సుశీల.

"అవేం చెప్తాయమ్మా...అవి మార్గదర్శకంగా నిలుస్తాయేగానీ ఇలా ఇది వుండితీరాలని ఎక్కడా చెప్పలేవు! ఈ ప్రపంచంలో ఒక్కో కేసుది ఒక్కోతీరు. అన్ని కేసులూ ఒకతీరున ఉండవు. ఎక్కడో ఏదో తేడా ఉంటుంది. మానభంగాలేకాదు, దోపిడీ దొంగతనాలు అన్నీ వేటికవి ప్రత్యేకంగానే ఉంటాయి. జరిగిన తీరుతెన్నులు పైకి ఒకేలా కనిపించినా అన్నీ ఒకేలా ఉండవు, ఒకేలా జరగవు. కనుక అంతా ఉన్న సాక్ష్యాధారాలనుబట్టి న్యాయశాస్త్ర సూత్రాలకు భాష్యం చెప్పటంలో ఉంటుంది'' విడమర్చి చెప్పాడు ముకుందరావు.

సుశీల,సుజాతలు లేస్తోంటే అన్నాడు ముకుందరావు, ''ఎందుకైనా మంచిదమ్మా మీ మనసులు రేపు మిమ్మల్ని దోషుల్ని చేయకుండా ఒక్కపని చెయ్యండి అంతా ఆ దేవుడికి వదిలేసి, ఆఖరి ప్రయత్నంగా రవీంద్రను ఇంకొక్కసారి అడిగిచూడండి! అతను 'నేనే'నని ఒప్పుకొంటే అప్పుడు ఏం చెయ్యాలో ఆలోచించుకోవచ్చు! అతను 'నేనుకాదు' అంటే ... విషయాన్ని వదిలెయ్యండి! మీరు చెయ్యగలిగేదేమీలేదు''

''ముకుందరావు ఇచ్చిన ఈ సలహా నచ్చింది ఆ ఇద్దరికీ. సుశీల అంది ముకుందరావు ఇంటినుంచి తిరిగివస్తోంటే

ముకుందరావుగారు చెప్పినట్లే చేస్తాను కానీ ... నిజం చెప్తున్నారో అబద్ధం చెప్తున్నారో అనే సందేహం లేకుండా ఉండే పద్ధతి అనుసరిస్తాను''

''ఏం చేస్తావేమిటి?''

''చెప్తాను. కానీ, ఇప్పుడుకాదు'' అంటూ సుశీల ఇంటిముఖం పట్టింది.

రవీంద్ర ఆరోజు సాయంత్రానికే కాంప్‌నుంచి తిరిగివచ్చాడు. రాగానే నిలవేసింది సుశీల, "నిజం చెప్పండి" అంటూ.

"ఏమిటి సుశీలా...ఏమిటి నీకి పిచ్చి పట్టుకొంది?"

''పిచ్చికాదండీ! నా మనసు నన్ను నిలవనీయటంలేను. నిలదీసి ప్రశ్నిస్తోంది అన్యాయం చేసింది ఒక రైతే, శిక్ష ఇంకొకరికా చెప్పండి...?"

"అది అన్యాయమే...కాదనను! కానీ నన్ను ఏం చెయ్యమంటావ్?"

"నిజం చెప్పండి చాలు! మీరు చేశారా లేదా...అంతే నాకు కావాల్సింది"

"ఏమిటి సుశీలా! కట్టుకున్న మగాణ్ణి పట్టుకొని ఏ ఆడదైనా ఇలా అడిగి ఉంటుందా...చెప్పు"

"గతంలో అడిగి ఉండకపోవచ్చు. కానీ ఇపుడు అడుగుతోంది. తప్పేమిటి చెప్పండి?"

"ఏమిటీ...కట్టుకొన్న ఆడదాన్ని ముట్టుకోవటమా తప్పు?"

"కట్టుకొన్నదాన్ని ముట్టుకోవటం తప్పుగాదు! కానీ, కట్టుకోక మునుపు ముట్టుకోవటం తప్పేగదా! అదీ నేను అడుగుతున్నదీ...మీరు జవాబు చెప్ప




కుండా తప్పించుకొంటున్నదీ" సుశీల సూటిగా అంది.

"పెళ్ళికాక మునుపు ఎందరు మగాళ్లు ఎందరు ఆడాళ్ళను ముట్టుకోవటంలేదు చెప్పు. సంఘపరంగా ఆమోదముద్ర పడితే, ఆ నేరం కాస్తా న్యాయంగా మారి పోతోందిగదా-ఇదీ అంతే అనుకో! పెద్దగా పట్టించుకోకు"

"నా ప్రశ్నకు సూటిగా సమాధానం చెప్పండి-ఆరోజు నేరంచేసింది మీరేనా, కాదా? ఇదిగో, మన ఇద్దరి బాబు-వీడి మీద ఒట్టేసి చెప్పండి! చేశారా, చెయ్య లేదా? అబద్ధం చెప్పకండి...మాట మార్చ కండి'' అంటూ బాబును తెచ్చి మధ్యన నిలబెట్టింది సుశీల.

"సరే...అయితే నిజమే చెప్తున్నా. ఆ నేరం చేసింది నేనే" రవీంద్ర ఒప్పు కొన్నాడు.

సుశీల ఆ నిజం వినటానికి అప్పటికే సిద్ధపడివుంది, కాబట్టి నిర్ఘాంతపోలేదు.

కానీ..ఇంతకాలం ఎందుకు దాచినట్లు ఆ నిజాన్ని?

ఎందుకు ఒప్పుకోలేదు ఆనాడే ఈ విషయాన్ని?

ఒక అమాయకుడికి శిక్ష పడిపోతోంటే ఎందుకు ఊరుకొన్నట్లు?

అదే అడిగింది భర్తను.

తలవంచుకుని చెప్పాడు రవీంద్ర- "కొన్ని ప్రశ్నలకు సమాధానాలుండవ్ నాకా నాడు పిరికితనం అడ్డొచ్చింది. నిజంచెప్తే శిక్షపడే సంగతి సరే కానీ సంఘంలో నేను ఏమవుతాను-ఆ సంగతి నన్ను నిజం చెప్పనీయలేదు. అందుకే జరుగుతున్నదంతా చూసినా నోరువిప్ప లేకపోయాను. నా తప్పుకుపరిష్కారంగా నిన్ను పెళ్లాడేందుకు సిద్ధపడ్డాగదా! చేసిన తప్పు ఆ చర్యతో తుడుచుకు పోతుందన్నది నాకు తెలుసు"

సుశీల ఏమీ మాట్లాడలేదు.

ఆమె తలంతా దిమ్ముగా అయిపో యింది. మనసంతా మ్లానమయిపోయింది.

నిర్లిప్తంగా కూర్చుండిపోయింది సుశీల.

జరిగిపోయింది ఎంత తప్పో అన్నది ఆమెను వేధిస్తోంది. తన తప్పుకు భర్త పరిష్కారం వెతుక్కోగలిగాడేగానీ... తానుచేసిన తప్పుకు పరిష్కారం ఏమిటి- అన్న సంగతిఆమెను వేధిస్తోంది. నిర్దోషిని జైలుకుపంపిన తనకు నిష్కృతి ఏమిటని ఆమె ఆలోచించసాగింది.

ఆ ఆలోచనలన్నీ క్రమంగా ఒక రూపు దిద్దుకొన్నాక ఆమె లేచింది.

'ఎక్కడికి వెడుతున్నావు?' అని కూడా అడగలేకపోయాడు రవీంద్ర. అతనికి ఇపుడు భార్య ముఖం కూడా చూసేందుకు ముఖం చెల్లటంలేదు.

చీకట్లో ఒక్కడే ఉండిపోయాడు రవీంద్ర.

సుశీల తిన్నగాలేచి పోలీస్‌స్టేషన్‌కు చేరింది. కాగితం అందుకుని రవీంద్ర తనను మానభంగం చేసినట్లు రాసిచ్చింది

ఇన్‌స్పెక్టర్ ఆ కంప్లయింట్ చదివి నివ్వెరపోయాడు, "మీ భర్తపేరు...?"

''రవీంద్ర!"

''మరి..ఈ క్రైమ్ చేసింది?"

"రవీంద్రే"

"భార్యను భర్త దగ్గరకు తీసుకొంటే దాన్ని రేప్ అనరమ్మా! సంసారం చేసే పద్ధతే అది!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నవ్వుతూ.

"సంసారం ఏదో, రేప్ ఏదో నాకు తెలీకకాదు మీదగ్గరకు వచ్చింది. రవీంద్ర నాతో చేస్తున్న సంసారం గురించికాదు

నేను మీకు కంప్లయింట్ ఇస్తున్నది! అతను నాకు భర్త కాకమునుపు నన్ను రేప్‌చేశాడు. ఈ కంప్లయింట్ దాని గురించి"

ఇన్‌స్పెక్టర్ నవ్వేశాడు. "మీరు ఈ సంగతి ఎవరితోనూ చెప్పకండి. ఇది కనుక బయటపడితే, ఇక ప్రతి ఆడదీ తన భర్త తనను మానభంగం చేశాడని పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదుచేయ నారంభిస్తుంది" అని నవ్వుతూ-"అసలు తప్పు మాదేలెండి, పోలీస్‌స్టేషన్‌లంటే బొత్తిగా భయం తగ్గిపోయింది అందరికీ. ఆ ఇబ్బందివల్లే వస్తున్నాయి అన్ని కష్టాలూ మాకు" అని చికాగ్గా అన్నాడు.

సుశీల ముఖం జేవురించగా అంది - "ఇనస్పెక్టర్‌గారూ ! మీకు చెప్పాల్సిందాన్ని కాను. అయినా చెప్తున్నాను-పెళ్ళిచేసుకొన్నాక కూడా స్త్రీ ఇష్టానికి వ్యతిరేకంగా అనుభవిస్తే ఆ భర్తచేసింది నేరమే అవుతుంది...అదీ రేపే అవుతుంది. కానీ నేను చెప్పేది ఈ రేప్ జరిగింది మా పెళ్ళికిముందు"

"బాగుందండీ మీ పద్ధతి! దొంగలు పడ్డ ఆరునెలలకు కుక్కలు మొరిగాయట. అలావుంది మీ ఫిర్యాదు-ఎప్పుడో ఏళ్ళ క్రితం జరిగిందట మానభంగం! చేసిందేమో మొగుడేనట, ఇపుడు తెలిసిందట ఆవిడకు ఈ సంగతి! అదికేసుగా బుక్‌చేసుకోవాలట. చూడమ్మా...అది నేరమే అయివుండొచ్చుగానీ అలాటి నేరాల్ని విచారించే తీరిక మాకు లేదు. వెళ్ళి మీ ఆయనకే చెప్పండి-ఇంకెప్పుడూ ఇలా చెయ్యొద్దని. సంసారం చేస్తానంటే మాత్రం వద్దనకండి...వెళ్ళిరండి"

సుశీల లేచి నిలబడింది. కోపంగా అంది, "ఇన్‌స్పెక్టర్‌గారూ...మీరుచాలా తెలివిగా మాట్లాడుతున్నారేమో! అది మీ ఇష్టం. కానీ ఒక్క విషయం— నేనో ఫిర్యాదు చేస్తున్నాను. అది నేరమోకాదో అది తప్పో ఒప్పో నిర్ణయించేది కోర్టు. ఫిర్యాదు అందుకొని రిజిస్టర్ చేయాల్సింది మాత్రం మీరు. ఈ కేసు తీసుకొంటారో లేదో అది చెప్పండి చాలు... వెళ్ళిపోతాను"

ఇనస్పెక్టర్ క్షణం ఆగి అన్నాడు, "సర్లెండి.. ఇచ్చి వెళ్ళండి చూస్తాం- ఏం చెయ్యాలో" అంటూ ఆ కాగితం అందుకొని పక్కన పెట్టి 'ఇక మీరు వెళ్లచ్చు' అన్నాడు.

"ఫిర్యాదు ముట్టినట్లు నాకు రసీదు ఇవ్వాలి మీరు. రసీదు ఇవ్వాలని రూలు కూడా ఉంది...ఇస్తారా?" అనడిగింది సుశీల.

ఇన్‌స్పెక్టర్ రసీదు ఇప్పించాడు.

సుశీల ఆ రూమ్‌లోంచి బయట కొస్తోంటే అన్నాడు ఆ ఇన్‌స్పెక్టర్- "ఏం ఆడదిరా నాయనా! అందరు ఆడాళ్లూ ఒక్క తీరు కాదని ఋజువు చేస్తోంది"

సుశీల గిరుక్కున వెనక్కు తిరిగింది "ఇంతక్రితం ఇదే పోలీస్‌స్టేషన్‌లో నరసింహంగారనే ఇనస్పెక్టర్‌గారు ఉండేవారు. ఆయన తర్వాత ఆ కనకపు సింహాసనంలోకి మీరొచ్చి చేరారు. ఇన్‌స్పెక్టర్లందరూ ఒక్కతీరు కాదని అదే ఋజువు చేస్తోంది" అంటూ బయటకు వచ్చింది.

సుశీల వెళ్లిపోయాక ఇనస్పెక్టర్ తన దగ్గరుండే ఇద్దరు కానిస్టేబుల్స్‌ను పంపించాడు రవీంద్రను తీసుకురమ్మని.

సుశీల అటు సుజాత ఇంటికి వెళ్లటంతో తన వెనకనే కానిస్టేబుల్స్ తన ఇంటికి వెళ్లారన్న సంగతి ఆమెకు తెలీనే లేదు.

భార్య తనమీద రేప్ కంప్లయింట్ ఇచ్చిందని విని రవీంద్ర నిర్ఘాంతపోయాడు. ఎంతపని చేసింది సుశీల? ఎక్కడికి వెడుతోందీ వ్యవహారం? అయినా ఇప్పుడు తను ఏ పాపమూ ఎరగనని ఒక్కమాట అనేస్తే...రవీంద్ర కోపంగా పోలీస్‌స్టేషన్‌కు చేరాడు.

"రండిసార్....మీ మిసెస్ మీమీద ఇదిగో ఈ ఫిర్యాదు చేశారు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

రవీంద్ర ఆ ఫిర్యాదు తీసుకొని చదివి పక్కన పెట్టేశాడు.

"కేసు రిజిస్టర్ చెయ్యకూడదని నేనెంతో ప్రయత్నం చేశాను.. కుదిరింది కాదు. రిజిస్టర్ చేసి రిజిస్టర్‌చేసినట్లు రసీదు తీసుకొని కానీ కదిలింది కాదావిడ. అయినా ఒక్కమాట-చదువుకొన్న వాళ్లు మీరు ఇలాంటి చిన్న చిన్న తగవులు పోలీస్ స్టేషన్ వరకు రానివ్వకూడదండీ! ఇలాంటివి పోలీస్‌స్టేషన్‌వరకువస్తే మీకూ ఇబ్బంది మాకూ ఇబ్బంది. కంప్లయింట్ చదివారుగదా. మీరేమైనా స్టేట్‌మెంట్ ఇవ్వదల్చుకొంటే ఇవ్వండి. మామూలుగా రేప్ కేసులో రేప్ చేసినవాడిని వెంటనే నిర్బంధంలోకి తీసుకోవాల్సి ఉంటుంది. కానీ ఈ కేసు జరిగి చాలాకాలమైంది పైగా మీరామె భర్త కూడా. కనుక నేనే కొంచెం స్వతంత్రం తీసుకొంటున్నా. మిమ్మల్ని వదిలిపెడుతున్నా, బట్, పిలిచినపుడు అవసరమైనపుడు మాత్రం కబురుపెడితే వచ్చి కనిపించి వెళ్ళండి, చాలు" అని చెప్పి రవీంద్రను పంపేశాడు ఇన్‌స్పెక్టర్.

రవీంద్ర ఇంటికొచ్చేసరికి సుశీల కూడా ఇంటికి వచ్చివుంది.

"ఏమిటి సుశీలా ఏం పని చేశావ్.. సుఖాన ఉండే కాపురాన్ని తీసుకెళ్ళి మళ్లీ బజారులో పడేశావ్...ఏం బాగుంది చెప్పు" అనడిగాడు.

"నిజమే ... బాగుండలేదు ఒప్పుకుంటాను! కానీ మీరు చేసిన పనిమాత్రం బాగుందా ... చెప్పండి?" అనడిగింది సుశీల.

"నీకేదో దెయ్యంపట్టినట్లుంది! ఈ కేసు కారణంగా నేను జైలుకు వెడితేగానీ నీకు తృప్తికలిగేలాలేదా?" అన్నాడు రవీంద్ర.

సుశీల ఏమీ జవాబివ్వలేదు ఆ ప్రశ్నకు.

"నేను జైలుకువెళ్ళినా అతనికి శిక్ష లేనట్లు అవదుగదా! అనుభవించాల్సిన శిక్ష అతను ఎప్పుడో అనుభవించాడు కూడాను" అని విసుక్కున్నాడు రవీంద్ర.

"చేయాల్సింది ఏదో చేశావు! ఈ ప్రజలు, ఈ పత్రికలు, ఈ న్యాయ వ్యవస్థ-నీకేదో మెచ్చి మేకతోలు కప్పుతుందని ఆశిసున్నావేమో. అదేమీ జరగదు! రేపు ఈ కేసులో తీర్పువచ్చిన రోజున నాలుగు వాక్యాలురాసి నాలుగు పేపర్లు దబ్బు చేసుకొంటాయి! ఆ తర్వాత ఏముందీ...నువ్వు, నీ కథా ఎవరికీ గుర్తుండదు. నీ కుటుంబం ఈ కేసువల్ల నాశనం అయిపోయిందన్నసంగతినికూడా ఎవరూ గుర్తించరు! ఇదంతా చేతులారా నువ్వు చేసుకుంటున్నదేనన్న సంగతిని నువ్వు గుర్తించటం మంచిది"

"అంటే కేస్ విత్‌డ్రా చేసుకోమంటున్నారా నన్ను?"

"తెలివైనదానివి...నువ్వు ఆలోచించుకోవటం మంచిది"

"కోర్టులోకి విచారణకు ఈ విషయం వస్తే మీరేంచెప్తారు దోషిననా...కాననా?"

రవీంద్ర నవ్వేశాడు. "ఆ విషయం నీకెందుకూ చెప్పటం? అయినా సుశీలా....ఒక్క రహస్యం చెప్తా విను-నీకారోజు ఆ దుర్ఘటనవల్ల మతిస్థిమితం తప్పిందని, అప్పటినుంచి ఎవరు కనిపించినా నువ్వు ఏదేదో అంటున్నావని, చివరకు ఈ విధంగా ఆదర్శంతో పెళ్లాడిన భర్తమీదే కేసు పెట్టేస్థితికి కూడా వచ్చావని ఒక్క పిటిషన్ పెట్టి,దానికి ఒక డాక్టర్ సర్టిఫికెట్ కూడా ఎటాచ్ చేస్తే నీ కేసు ఏమవుతుందో ఆలోచించు! కేసు పోతుంది సరికదా నిన్ను తీసుకెళ్ళి మెంటల్ హాస్పిటల్లో కూడా పారేసే అవకాశమూ వస్తుంది నాకు. ఆలోచించుకో ... నన్ను ఆ స్థితికి లాక్కురాకు!"

భర్త సరదాగా అంటున్నా ఆ మాటల్లో నిజం ఉందన్న విషయాన్ని గుర్తించింది సుశీల.

రవీంద్ర నిజంగా తను అలాటిదాన్నని ఒక్క మాట అంటేచాలు, లోకమంతా దాన్ని ప్రతిధ్వనిస్తూ పది మాటలంటుంది. అప్పుడు తన పరిస్థితి మరీ దయనీయం అయిపోతుంది... అనుకుంది సుశీల.

ఆయినా...

కేస్ ఫైల్ చేసింది తను. అది అటో ఇటో తేలాల్సిందేతప్ప తను మాత్రం దాన్ని ఉపసంహరించుకోదు.

ఈ లోకం తనకు పిచ్చే అనుకోనీ, వెర్రే అనుకోనీ. తను ఓడిపోయినా ఫర్వాలేదు. గతంలో గెలిచి ఓడిపోయింది తను! ఈసారి ఓడినా గెలిచినట్లే అవుతుంది. మానసికంగా సంతృప్తిగా నిద్రపోగల అవకాశం లభిస్తుంది తనకు!

అది చాలదూ తనకు!

ఆమాత్రం గెలుపు సరిపోదూ ఈ జన్మకు!!

సుశీల నిర్ణయించుకొంది.




మళ్ళీ కోర్టుకొచ్చింది కథ.

సుశీల తనను తన భర్తే మానభంగం చేశాడని కేసు పెట్టటంతోటే, కృష్ణ తనను అన్యాయంగా కటకటాల పాలుచేశారని, జీవితంలోని విలువైన అయిదేళ్ళకాలం నాశనం అయిపోయిందని– ఇది కేవలం న్యాయవ్యవస్థ, పోలీసు సిబ్బంది వైఫల్యం వల్ల జరిగిందేననీ పేర్కొంటూ తనకు నష్టపరిహారం ఇవ్వాలని పిటీషన్ పెట్టాడు.

గతంలో ఎన్నడూ ఇలా జరగకపోవటంతో ఈ కేసు చాలామందిలో ఆసక్తి పెంచింది.

బోనెక్కిన రవీంద్ర ఆనాడు తను సుశీలను మానభంగం చేసినట్లు ఒప్పుకొన్నాడు.

అయితే రవీంద్ర చేసిన కన్ఫెషన్ స్టేట్‌మెంట్ మాత్రం సంచలనం కలిగించింది

"అందరు మనుషులూ ఈ సృష్టిలో సమమే అంటారు.

పుట్టినపుడు సమానమేకావచ్చుగానీ పెరుగుతోంటే జీవితంలో ప్రతిచోటా అసమానత చోటుచేసుకొంటూ వస్తుంది. అన్నిచోట్ల పేద, ధనిక వర్గాల మధ్య వ్యత్యాసం స్పష్టంగా కనిపిస్తూవుంటుంది. చిన్నతనంలో నేను చదువుకొంటున్న గ్రామంలో మా పక్కింట్లో ఉన్న మోతుబరి భూస్వామి భార్య తమ ఇంట్లోపనిచేసే పాలేరు భార్యనే భర్తకు జంటగా పంపించేదని చెప్పుకొనేవారు. కానీ అదే మోతుబరి ఒకసారి తన భార్యను ఆ పాలేరు ముట్టుకొన్నాడని చెట్టుకు కట్టేసి కొట్టాడు. మిగిలిన అన్ని విషయాల్లో ఎలా ఉన్నా కనీసం సెక్సు విషయంలో కూడా మనుషులంతా సమానులు కారన్న సంగతి అర్థమయింది నాకానాడే.

"ఆ విషయం ఎక్కడో నామెదడు అంతరాంతరాల్లో నిక్షిప్తమైఉంది కాబోలు. ఆ సంగతి నాకు తెలీదు. ఆరోజు ఇంటర్వ్యూకు సుశీల వెడుతున్నరోజున– సుశీల ఒంటరిగా రోడ్డుమీద వెడుతోంటే వెళ్ళి లిఫ్ట్ కావాలా అని అడిగాను. అంతవరకూ ధైర్యంగావున్న సుశీల నన్ను చూసి కొంచెం బెదిరింది. ఆమెలో కనిపించిన బెదురు ఏమిటో, ఎందుకో నాకు అర్థమయింది. ఆమె శారీరకంగా నా కన్నా బలహీనురాలు. మా ఊళ్లో మోతుబరిది ఆర్థికపరమైనబలం. ఇక్కడ నాది శారీరక బలం. అక్కడ అతను చేసింది, చేసేది తప్పని తెలిసినా ఊళ్ళోవాళ్ళెవళ్ళూ కిక్కురుమనేవారుకాదు. ఇక్కడ ఆమెకు నాగురించి ఏమీ తెలీదు. ఎవరో అపరిచితురాలు. పోలీసులకు ఫిర్యాదు చేసినా నా గురించి గుర్తులేం చెబుతుంది. సాధారణంగా మధ్యతరగతి స్త్రీలు ఇలాటి విషయాల గురించి బజారులోకిరారు. జరిగింది అన్యాయమైనా నోరుమూసుకుని పడివుంటారు. సామాజికంగా కూడా వాళ్లు బలహీనులు కావటం దీనికి కారణం. ఇలా అన్నీ ఆలోచించుకొని...ఆరాత్రి ఆమెమీద దాడిచేశాను, ఒంటరిగానే...




ఒంటరిగా ఉన్న సుశీల నా దాడికి భయపడింది. ఆమె తేరుకొనే లోపునే ఆమెను ఆక్రమించుకొన్నాను. మత్తుమందిచ్చి అనుభవించాను. రాత్రిపూట చీకటిచాటున జరిగిన ఆ దారుణం చీకట్లోనే ఉండిపోతుందనుకున్నాను. కానీ సుశీల దాన్ని కోర్టుకు తెచ్చింది. కానీ దోషిగా వేరే వ్యక్తిని నిలబెట్టేసరికి నివ్వెరపోయాను. ఆమె స్వయంగా దోషి ఫలానా అని చెప్పటంతో పోలీసులకు కూడా పెద్ద శ్రమలేకుండాపోయింది. దురదృష్టవశాత్తు అతనూ...'సాక్ష్యాన్ని నాశనం చేస్తున్నప్పుడు' పోలీసులకు దొరికాడు. ఫలితం-అతను 'నేను నిర్దోషినని' చెప్పుకొంటున్నా జైలుకు వెళ్ళాల్సి రావటం. ఆలోచనారహితంగా తప్పు చేశానేగానీ, అది తప్పని నాకు తెలుసు. ఆ నేరం చేసినందుకు నన్ను నేను క్షమించుకోలేననీ తెలుసు. అందుకే ఉభయతారకంగా ఉంటుందని సుశీలకు మాంగల్యం కట్టాను. ఆమెను పెళ్ళాడాను. నా తప్పుకు ఆ 'శిక్ష' సరిపోతుందనే అనుకొన్నాను. ఇపుడైనా నా భార్యకు మతిస్థిమితం తప్పిందనో, ఆరోజు నేనసలు ఈ ఊళ్లోనే లేనని ఎలిబీ సృష్టించో... ఈ కేసులోంచి తప్పించుకోవచ్చు. కానీ ఒక ఉన్నతాదర్శంతో నా భార్య సుశీల ఈకేసు మళ్ళీ మీముందుకు తెచ్చింది-నిర్దోషికి ఏకారణంగా శిక్షపడినా తప్పే. అతను నిర్దోషి అనికనీసం ఈనాడైనా ప్రపంచానికి తెలిస్తే చాలునని నా భార్య తపన. ఆమె తపన అర్థం చేసుకొన్నానుకాబట్టే నిజం ఒప్పుకొంటున్నాను ... నేరం చేసినట్లు అంగీకరిస్తున్నాను" అన్నాడు రవీంద్ర.

"మానభంగం అనేది స్త్రీల పాలిట మచ్చఅయి వాళ్ళను వేధిస్తోంది. ప్రపంచంలో జరుగుతున్న అనేక నేరాలలాటిదే అదీనన్న విషయాన్ని స్త్రీలందరూ గుర్తించాలన్న ఉద్దేశం సుశీలది. ఆమె ఉద్దేశం సరైనదేనని నేను భావిస్తున్నాను. అందుకే దానికి గుర్తింపుగా కూడా నేరాన్ని అంగీకరిస్తున్నాను" అన్నాడు రవీంద్ర.

న్యాయమూర్తిగా ముకుందరావు మళ్ళీ తన న్యాయ నిర్ణయం వినిపించాల్సి వచ్చింది.

"ఇది న్యాయ చరిత్రలోనే ఒక అపూర్వమైన విషయం. తన భర్తనే ఒక భార్య న్యాయస్థానంలో నిలదీసిన సంఘటనలు చాలా అరుదుగా ఉంటాయి. ఇలా న్యాయంకోసం భర్తనైనాసరే విడిచిపెట్టక, సామాన్యమైన ప్రేమానురాగాలకు, వ్యామోహాలకు లొంగక న్యాయం కోసం పోరాడుతూ ఎంతో ధైర్యసాహసాలు చూపిన సుశీలను అభినందిస్తున్నాను.

"ఇక ఈకేసులో న్యాయాన్యాయాల గురించి చెప్పాలంటే.... పద్ధెనిమిదిపర్వాల భారతమే రాయాల్సివస్తుంది. స్థూలంగా చెప్పాలంటే- ఈకేసు సాంఘికపరమైన, దాంపత్యపరమైన, నైతికపరమైన ప్రశ్నలెన్నిటినో ఎత్తి చూపిస్తోంది. సంఘ సంస్కర్తలను, మేధావులను ఆలోచించమని ప్రశ్నిస్తోంది. మానభంగం అంటే ఏమిటి? దాంపత్యజీవితంలో జరిగే శారీరక కలయికకు, దీనికి తేడా ఏమిటి - అన్న సునితమైన్న ప్రశ్న తలెత్తేలా చేస్తోంది. క్రియ ఒకటే అయినపుడు అది ఒకసారి నేరంఅయి, ఇంకోసారి నేరం కాకుండా ఎలా రూపాంతరం చెందుతోంది. కేవలం మాంగల్యం కట్టటం ఒక్కటే

దీనికి కారణమా? కాకుంటే ఆమె అంగీ కారమే దీనికి ప్రాథమికావసరమా?

"శారీరక సంపర్కంలో సుఖించాలని ప్రతిజీవీ ఆలోచన చేస్తుంది. ఈ కోరికకు లింగకాల దేశమాన పరిస్థితులేవీ అడ్డు రావు...ఉండవు. ఉన్నట్లయితే వాటిని ఛేదించుకొనే ప్రయత్నమే చేస్తాడు మనిషి. అలాటి స్థితిలో స్త్రీగనుక సహక రించితే అది నేరం కాకుండా, చట్టం దృష్టికి రాకుండా కనుమరుగవుతోంది. స్త్రీ అభ్యంతరం వ్యక్తంచేసినపుడు అది నేరమవుతోంది. ఈ నేరం చేయటానికి ఒక మనిషి ఉద్యుక్తుడవుతున్నాడంటే దానికి వెనక ఎన్నో సాంఘిక, మానసిక కారణాలు ఉన్నాయి. కేవలం ఒక క్షణంలో ఏ వ్యక్తీ మానభంగం చేసేంత బలహీనతకు లోనుకాడు. ఇక్కడ నిందితుడూ అంతే! చాలాకాలంగా అతని మెదడులో ముద్రితమైన అనేక కారణాలు ఒక్కసారి అతన్ని, అతని మానసిక బలాన్ని అధిగమించాయి. అతన్ని పూర్తిగా లోబర్చుకొని అతనిచేత ఈ నేరం చేయించాయి.

"నేరం చేసినవాడికి శిక్ష విధించమం టోంది ఈ సంఘం...ఎందుకు? ఆ శిక్షా కాలంలో అతను పశ్చాత్తాపపడతాడని, మానసిక సంస్కరణకు లోనవుతాడని,ఏ చట్టమైనా ఏ న్యాయశాస్త్రమైనా ఇదే కోరు తుంది. ఎంతటి కరుడుకట్టిన నేరస్థుడైనా మానసిక పరివర్తన చెందాలని, అలా పరి వర్తన చెందినవారికి మళ్ళీ ఈ సంఘంలో స్థానం కల్పించాలనీ మేధావులు తమ ఆశ వ్యక్తంచేస్తుంటారు. అది న్యాయ శాస్త్రలక్ష్యాలలో ఒకటి. ఆధునిక జీవ నంలో మనిషి ఎదుర్కొంటున్న సమ స్యలు అనేకానేకం ఉన్నాయి! ఈ సమ స్యలకు లోనయిన వ్యక్తి ఒక్కోసారి వ్యక్తిగా పతనంకాగల ప్రమాదం ఉంది. అలా ప్రమాదంలో పడిన వ్యక్తిని రక్షించుకోవాల్సిన బాధ్యతా మనమీదే ఉంది.

"ఈ నేరం చేసినవాడు రవీంద్ర. న్యాయశాస్త్రం అదిలించి అతన్ని బెది రించే లోపునే అతను సంస్కరణకు లోనయ్యాడు. తనంత తానుగా బాధితు రాలికి నష్టపరిహారంకూడా చెల్లించాడు. న్యాయశాస్త్రంఅభిలషించేమార్పు అతనిలో ముందే వచ్చింది. అయితే నేరాన్ని చట్టం దృష్టితో కప్పిపుచ్చినందుకు మాత్రమేఅతనికి శిక్షవేయాల్సి ఉంటుంది. ఈ కేసులోని విచిత్రమైన పరిస్థితులు దృష్టిలో ఉంచుకొని, అతను నేరంచేసినా అతనిపై ఉదారవైఖరిప్రకటిస్తూ ఈకోర్టు లేచేంతవరకు అతనికి కారాగారశిక్ష విధి స్తున్నాను.

"ఇక మిగిలింది- కృష్ణకు నష్టపరి హారం చెల్లించటం. కృష్ణ నిర్దోషి అన్నది ఇపుడు నిర్ద్వంద ంగా ఋజువైన సత్యం. నిర్దోషిఅయిన కృష్ణ కటకటాలవెనుక జైలుశిక్ష అనుభవించాల్సి వచ్చింది. దానికి కారణాలు ఏవైనా ప్రభుత్వంవారు ఉదార వైఖరితో తగిన నష్టపరిహారం చెల్లించా లని ఈ కోర్టు ఆదేశాలు జారీచేస్తోంది" అంటూ తన తీర్పు వినిపించారు ముకుంద రావు.

న్యాయమూర్తి తన తీర్పు వినిపించి లేవటంతో సభలోనివారందరూ కూడా లేచారు.

అప్పటివరకు 'శిక్ష' అనుభవించిన రవీంద్ర చిరునవ్వుతో సుశీలనుచేరాడు

సజలనయనాలతో సుశీల భర్తకేసి చూసింది. రవీంద్ర సాదరంగా సుశీలను

దగ్గరకు చేర్చుకొన్నాడు.

సుజాత సుశీల దగ్గరకొచ్చి పిలిచింది.

కృష్ణ నవ్వుతూ రవీంద్ర భుజంమీద చెయ్యివేశాడు. "కోర్టువారు వేసిన శిక్ష అనుభవించి వచ్చాను. దోషిని కాబట్టి మీరూ ఏదైనా శిక్షవేస్తే అదీ అనుభవిస్తాను" అన్నాడు రవీంద్ర. "సారీ కృష్ణా..పిరికిపందగా ఒకనాడు చట్టానికి చిక్కకుండా పారిపోయే ప్రయత్నం జేశాను. కానీ నా ఆత్మ నన్ను నిలవ నీయలేదు. అందుకే నిజంచెప్పి న్యాయ స్థానంముందు-దానికన్నా ముందు నా ఆత్మసాక్షిముందు తలవంచి నిలబడ్డాను. నువ్వు కూడా క్షమింకానంటేనే నాకు తృప్తి" అన్నాడు

"మీరు పెద్ద పెద్దమాటలంటున్నారు. నాకు వాటికి అర్థంతెలీదు! అందుకు మీరే నన్ను క్షమిస్తే సరిపోతుంది'' అని నవ్వేశాడు కృష్ణ.

ఆ మర్నాడు నలుగురూ వెళ్లి ముకుందరావుగారిని కలిసి వచ్చారు. ''ఇంకా ఆలస్యందేనికి...మీ ఇద్దరు కూడా మాంగల్యబంధంతో ఏకం అయిపోండి'' అంటూ సలహా ఇచ్చాడు ముకుందరావు.

"సుజాత పెళ్ళికి ఒప్పుకోకపోతే నాకు చెప్పు కృష్ణా! ఆమె ఒప్పుకోవటానికి ఓ తేలిక చిట్కా నేను చెప్తాను'' అన్నాడు రవీంద్ర.

"ఎటొచ్చీ చిట్కా ఖరీదు-అయిదేళ్ళ జైలుశిక్ష అని మాత్రం గుర్తుంచుకోండి"

"రెండోసారి అదే నేరంమీద కోర్టు కొస్తే అయిదేళ్ళతో సరిపెట్టదు చట్టం. పదేళ్ళపాటు వడ్డించే వీలుంటుంది" నవ్వుతూ అన్నాడు ముకుందరావు.

''ఆ జైలుకన్నా కటకటాలులేని కాపురం జైలే మేలేమోలెండి" కృష్ణ మాటలకు అందరూ నవ్వారు.

* * *

గదంతా అగరువత్తుల పొగ పలచగా వ్యాపించివుంది. గదిమధ్యలో మల్లెపూల మాలలతో అలంకరించిన పట్టె మంచం. మంచానికి పక్కనే చిన్న టేబిల్ మీద పెద్ద పళ్ళెంలో తినుబండారాలు, పళ్ళు.

కృష్ణ సుజాతకేసి చూశాడు.

తెల్లచీరలోవున్న సుజాత అందంగా ఉంది. ఒక్క రవ్వ సుజాతవైపు జరిగి, ఆమె భుజంమీద చెయ్యివెయ్యబోయి ఆగిపోయాడు కృష్ణ.

సుజాత ఆశ్చర్యంగా చూసింది.

"ఏం...ఆగిపోయావే...రేం?" అనడిగింది.

కృష్ణ నవ్వాడు. "ముట్టుకొంటే ఏం తప్పోనని" అన్నాడు.

"పెళ్లాన్ని ముట్టుకోవటం తప్పేమీ కాదు...ముట్టుకోకపోవటమే నేరం"

"ఏమో..పెళ్ళాన్ని ముట్టుకొన్నాడని రవీంద్రకు శిక్షపడింది. కన్నెపిల్లను ముట్టుకోనందుకూ నాకు శిక్షపడింది! ఈ దేశంలో ఆడపిల్లను ముట్టుకొన్నా, ముట్టుకోకపోయినా కూడా నేరంలాగేవుంది" అన్నాడు కృష్ణ.

సుజాత నవ్వింది- "కట్టుకోకముందు పట్టుకున్నందుకే రవీంద్రకి శిక్షపడింది. కట్టుకొన్నా ఇంకా ముట్టుకోకపోతే మీకూ శిక్షపడుతుంది! అరెస్టుచేస్తేగానీ అబ్బాయిగారు మాటవినేలాలేరు. అరెస్టుచేసి చీకటికొట్లో పారేస్తే అపుడు తెలుస్తుంది-ఏది న్యాయమో...ఏది నేరమో"

సుజాతను ఆపై మాట్లాడనివ్వలేదు కృష్ణ.

ఆ గదిలో-ఆపైన...అందం, సుఖం ఆప్యాయంగా ఊసులు - కలబోసుకొన్నాయి.





# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతి నెలా చతురలో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. "చతుర సమీక్ష" శీర్షికలో పాల్గొనే పాఠకులు 'చతుర'లో ప్రచురించే నవలపై ఏనెల కానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల తమకు ఆ నవల నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. పాఠకులు గమనించవలసిన మరికొన్ని ముఖ్యాంశాలు:

1. "చతుర సమీక్ష"కు పంపే మీ రచన అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేలా పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్‌ను జతపరచాలి.
4. కవర్‌పై "చతుర సమీక్ష"కు అని పేర్కొనాలి.

మాకు అందిన పాఠకుల సమీక్షలలో ఉత్తమమైనవిగా మేము ఎంపిక చేసిన మూడింటిని ప్రచురించి రు. 100, రు. 75, రు. 50 చొప్పున నగదు బహుమతులు పంపగలం.

ఇక విరివిగా ఈ శీర్షికలో పాల్గొని బహుమతులు అందుకోనేవంతు పాఠకులదే!

---

**కూపన్**

అక్టోబర్ 'చతుర' నవల : దోషి...?

సమీక్షకుని పేరు..............................

చిరునామా..............................

..............................

..............................

## చతుర ఫీచర్

# అభివృద్ధిని అరికట్టే నమ్మకాలు

భారతదేశం అత్యంత ప్రాచీన నాగరికతకు నిలయం. ఖండాంతరాలలో మనిషి ఆటవిక జీవితం గడిపే సమయంలో ఇక్కడ వస్త్రాలు నేశారు. అక్కడ మనిషి జంతు మాంసాన్ని పచ్చిగానే తినేసే సమయంలో ఇక్కడ వరి అన్నం తినేవారు. అక్కడ రాళ్ళనే డబ్బుకు బదులుగా వాడేటప్పుడు ఇక్కడ రత్నరాసులను వీధుల్లో అమ్మేవారు. అక్కడి మనిషి మాట అనేది నేర్చుకొనే సమయంలో ఇక్కడ మనం సంగీతానికి ప్రాణం పోశాం. వాళ్ళు అక్షరాలు దిద్దుకునే రోజుల్లో మన ఉపనిషత్తులు ఉద్భవించాయి. ఇంతటి నాగరికతతో ప్రపంచాన్నే జాగృతం చేయగల్గిన మనదేశం పరదేశాలనుంచి సైతం పొగడ్త లందుకుంది.

నాగరికతా చరిత్రలో ఇలా ప్రముఖ స్థానం పొందిన మనదేశం వర్తమానంలో ఆర్థికంగా, సామాజికంగా, వైజ్ఞానికంగా చివరికి రాజకీయంగాకూడా ఎంతో వెనుకబడి వుండటం విషాదకరంగా కనిపించక మానదు.

ఈనాటి మనిషి విజ్ఞానాభివృద్ధిని సాధించటంలో కాలాన్ని ప్రామాణికంగా తీసుకున్నాడు. దానితోనే ప్రయాణమయి ఇప్పుడు గ్రహాంతరాలను సైతం అధిగమిస్తున్నాడు. కాని అనవసరపు చింతలకు పాత చింతకాయలకు అధిక ప్రాధాన్యత నిచ్చి కనబడిన రాళ్ళకు, కనపడని దేవతలకు మొక్కుతూ ఆ దేవుడిమీదే భారాన్ని వదలి విజ్ఞానపు జ్యోతిని గాలిలో వదిలేస్తున్నాం మనం. జార్ పరిపాలనా నిరంకుశత్వ కోరల నుండి బయటపడిన అతి పేద దేశం రష్యా కేవలం ఇరవై సంవత్సరాల వ్యవధిలో అమెరికాకు సాటిగా తయారై మరో సూపర్‌పవర్‌గా నిలబడింది. అణుబాంబు దాడిలో నిర్వీర్యమైన జపాన్ అతి తక్కువ కాలంలో నిలదొక్కుకుని ఎలక్ట్రానిక్స్ రంగంలో తన ప్రత్యేకతను నిరూపించుకుంది. ఒక చిన్న ద్వీపంగా మిగిలిన స్విట్జర్లాండ్ నేడు ప్రపంచ దేశాలకు సరిపడా గడియారాలకు ఉత్పత్తి కేంద్రమయింది.

బ్రిటిషువారి దోపిడికి పోయింది పోగా మిగిలిన పేద భారతదేశాన్ని మనం అభివృద్ధిపరచాలంటే కాలంతోపందెంవేసి పరుగుదీయాల్సివుంది. కానీ, దురదృష్టవశాత్తూ మనం మన సాంప్రదాయకంగా వస్తున్న కొన్ని ఛాందస భావాలకు కట్టుబడి గ్రహశాంతులతో, పూజలతో కాలం గడుపుతున్నాం. మనదేశంలో పాతుకుపోయి మన రక్తంలో ప్రవహిస్తున్న మూఢనమ్మకాలు అనేకం.

ప్రకృతిని సర్వవిజ్ఞానానికి మూల కేంద్రంగా భావించి, దాన్ని పరిశోధించి ఆ ప్రకృతినుండి తమ జీవనానికి కావలసిన

వనరులు, విజ్ఞానానికి కావలసిన ఇంధనాలను కనుగొంటున్న కాలం ఇది. కాని, మనం ప్రకృతిని ఒక దేవతగా పూజిస్తున్నాం. దానిలో వచ్చే సహజ పరిణామాలను దైవాంశసంభూతాలుగా నమ్మి మన విలువైన సమయాన్నీ, వనరులనూ దుర్వినియోగం చేస్తున్నాం.

పని చేయడానికి ఒక క్రమ నియమానుసారంగా కాలాన్ని విభజించి ఏకాగ్రతతో, క్రమశిక్షణతో కాలాన్ని వినియోగించుకుంటున్నాడు ఆధునిక మానవుడు. కానీ మనదేశంలో మాత్రం ఏ కార్యానికైనా బయలుదేరేముందు మీన మేషాలు లెక్కించటం మనకు అలవాటయి పోయిన దుర్గుణం. సుముహూర్తాలు, దుర్ముహూర్తాలు అంటూ కాలాన్ని చంపేస్తుంటాం మనం. రాహుకాలాలు, యమగండాలు అంటూ మనలాగే డాక్టర్లు కూడా భయపడితే ఇహ ప్రమాదపరిస్థితులలో వున్న రోగులను ఎవరు రక్షిస్తారు?

సుముహూర్తంలో బయలుదేరినా ప్రమాదాలలో మరణించినవారెంతమంది లేరు! విదేశస్థులు ఎన్నో ముఖ్యమయిన పనులను దుర్ముహూర్తాల్లోనే ప్రారంభించినా, దిగ్విజయంగానే వాటిని ముగిస్తున్నారే-మరి, దుర్ముహూర్త కీడు వారికి ఎందుకు జరగటంలేదు? రైలు ప్రయాణ వేళలు ఈ ముహూర్తాలననుసరించి పెడితే, మానవుని ప్రయాణం ఎంతవరకు సాగుతుంది? శూన్య, ఆషాఢ మాసాలంటూ పనులూ, ప్రయాణాలూ వాయిదా వేయనారంభిస్తే బతకగలమా? వాయిదా వేయనివారు బతకటం లేదా?

పరమపావన పుణ్యతీర్థంగా ప్రఖ్యాతి పొందింది మన కాశీ. అక్కడ గంగా నదిలో మూడు మునకలువేస్తే పాపాలన్నీ హరించిపోతాయి అనే నమ్మకం మనకుంది. కాని ఈనాటి కాశీ క్షేత్రాన్ని పుణ్యంకోసం సందర్శించబోతే ఆ దేవాలయాలవద్ద పోటీలుపడి గుళ్ళలో జొరబడే భక్తులు, భక్తుల సంఖ్యను మించిన యాచకులు..అక్కడి దగా, మోసాలు చూస్తుంటే ఏహ్యభావం కలుగుతుంది తప్ప భక్తి పెరగదు. అక్కడి ఘాట్‌లలో భక్తుల్తో పాటు రోగులు, మురికి బట్టలవాళ్ళుకూడా అలాగే స్నానాలు కానిస్తారు. శాస్త్రోక్తంగా కర్మలు జరిపి వదిలిన అస్థికలు భక్తులను తాకుతూపోతుంటే పుణ్యం సంగతి ఏమోగానీ, కొత్తరోగాలుమాత్రం రాకమానవు. ఆ ప్రవాహపు నీటినే రాగి చెంబుల్లో పోసి రోడ్డు పక్కన పెట్టి అమ్ముతుంటారు. అదే పవిత్ర జలంగా భావించి కొంటారు భక్తులు.

మన బలహీనతలను పరులు సొమ్ము చేసుకోవటంలో మనకున్న నమ్మకాలతో పోటీ పడుతున్నది జ్యోతిషం. ఇది వేదాంగాలలో అయిదవది. నిజానికిది యజ్ఞయాగాదిక్రతువుల నిర్ణయకాలాన్ని, వాటి ఫలితాల్ని నిర్ణయించి చెప్పేది మాత్రమే. దీని ప్రస్తావన జ్యోతిర్వేదంలో వుందని చెప్పినా, అది భవిష్యత్తు గురించి చెప్పగలదని ఏ వేదంలోనూలేదు. ఖగోళ శాస్త్రాన్ని, గణిత శాస్త్రాన్ని తీసుకొని వాటికి వింత రూపాలనిచ్చి మనలను నమ్మించయత్నిస్తున్నారు జ్యోతిష పండితులు. పురాణాలలో సైతంయుద్ధాలు తదితరకార్యాలూ, క్రతువులు నిర్వహించే కాలాన్నే చెప్పించుకున్నారుగానీ, ఎవరు గెలుస్తారు అనేది చెప్పిన దాఖలాలులేవు. ఇలాంటి విద్యనే శాస్త్రంగా గుర్తించి విశ్వవిద్యాలయాలలో రీసెర్చి కోసం, పాశ్చా

ప్రణాళికలలో దీనిని చేర్చవలసినదిగా వాదిస్తున్నారు 'జ్యోతిష శాస్త్రజ్ఞులు'.

ఖగోళ శాస్త్రం ప్రకారం చంద్రుని భ్రమణంలో అది సూర్యునికీ, భూమికీ మధ్య వచ్చినపుడు సూర్యగ్రహణం, సూర్య చంద్రులకు మధ్య భూమి వచ్చినపుడు చంద్రగ్రహణం ఏర్పడతాయని వైజ్ఞానికంగా ఋజువుచేశారు. అయినా ఆ సమయాలలో రాహువు సూర్య చంద్రులని మింగి తరువాత విడిచేస్తుందని మనవాళ్ళు కథలు అల్లారు. గ్రహణ సమయాలలో కార్యాలు ప్రారంభించక పోవటం మనదేశీయుల ప్రత్యేకత. తోకచుక్కలు కనపడినపుడు ఎవరో ఒకరు మరణించటం ఖాయమని తేల్చటం, అష్టగ్రహకూటమి వల్ల ప్రపంచ నాశనం తథ్యమని నమ్ముతూండటం మనలను ఎన్ని రకాలుగానో వెనుకకే లాక్కొని పోతున్నాయి. 1962 నాటి అష్టగ్రహ కూటమి వల్ల ప్రపంచం నాశనమయిందా? గాంధీ, నెహ్రూ, కెన్నడీలు ఏ తోకచుక్క కన్పడినపుడు మరణించారు? 1908లో మోర్‌హౌస్, 1910లో హేలీ, 1919లో పాన్స్‌వినెక్, 1941లో 1941సి తోకచుక్కలు కన్పడినాయికదా! వాటి ప్రభావాలు ఏ విధంగా కనిపించాయి? అలాంటపుడు 1986లో రాబోయే హేలీ తోకచుక్క వల్ల మాత్రం అనర్థాలేమి ఉంటాయి?

ఆకాశంలోని నక్షత్రాలు స్వయం ప్రకాశక గ్రహాలనీ, సూర్యుడొక పెద్ద నక్షత్రమనీ విజ్ఞానశాస్త్రం ఋజువులతో సహా చూపిస్తోంది. కాని మనం అవి సప్తర్షులనీ, అరుంధతి అనీ ఇష్టమైన పేర్లు పెట్టుకొని కొత్త దంపతులకు ఏదో ఓ నక్షత్రానికి మొక్కించటంలాటి పనులతో విజ్ఞానాన్ని కాలదన్నుకుంటున్నాం. దీనికి తోడు స్వర్గలోకానికి పితృదేవతలు చేరాలనే తపనతో డబ్బు, కాలం వృథా చేసి సంతర్పణలు చేయటం లాంటివి బాహాటంగానే చేస్తున్నాం.

రాత్రిళ్ళు కలలో పూర్వుల ఆత్మలు కనిపించాయనీ, శూన్యంలోకి చూసినపుడు ఏవేవో అస్పష్ట ఆకారాలు గోచరించాయనీ, అవి మాట్లాడం, మనం వినటం జరిగిందనీ కూడా నమ్ముతాం. వీటిని వీలుగా తీసుకొని బలహీన మనస్కులతో ఆడుకొని డబ్బు గుంజేవాళ్ళు నిజానికి గొప్ప సైకాలజిస్టులు! మన పరిస్థితికి అనుగుణంగా బెదరగొట్టి, వాళ్ళు హూనం చేసే నిజమైన దయ్యాలు వీరే! వీరి ప్రభావంలోంచి బయటపడి వివేకంగా ప్రవర్తించకపోతే మన బతుక్కి, అభ్యుదయానికి అర్థం లేదు.

ఈ అజ్ఞానాంధకారంలో వున్నంత కాలం మనం మన శక్తిని గుర్తించలేం. మనోధైర్యంతో జీవనాన్ని సాగించలేం. క్షణం క్షణం భయాందోళనలు, అనవసరపు భక్తిధ్యానాలూ, మూఢ నమ్మకాలతో లేనిపోని సమస్యలను కొనితెచ్చుకోవడం మాని మన సమాజాభివృద్ధికి, ఆధునిక వైజ్ఞానిక నాగరికతకు మనవంతు కృషి చేసి మిగిలినవారికి ఆదర్శంగా మారి మన నాగరికతకు కొత్త తొడుగులు వేసి, మారుతున్న గాలులకు మన అభ్యుదయ తెరచాపలను ఎగురవేయగలగాలి!

— కస్తూరి రాజశేఖర్

**Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications**
Printed at Colorama Printers Pvt Ltd. Hyderabad. Tel. 220728 CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 482.

# గ్లూకోన్-డి సూపర్‌హీరో.

ఉక్కపోస్తూ అలుపు
పుట్టించే రోజున కూడా
ఉరకలు వేసే శక్తి.




అలుపు తెచ్చే వేసవి రోజున మీ అబ్బాయికి కావలసింది గ్లూకోన్–డి: గ్లూకోజు, విటమిన్ డి, కాల్షియం ఫాస్ఫేట్లు గల తక్షణ శక్తినిచ్చే పానీయం.

గ్లూకోన్–డిని పళ్లరసం, పాలు, టీ, కాఫీ, లేదా నీళ్లలో కలిపారంటే కుటుంబం మొత్తానికి ఒక ఉల్లాస పానీయంగా తయారై పోతుంది. 100, 200, 500 గ్రాముల ప్యాకులలో లభిస్తుంది. గ్లాక్సో వారి గ్లూకోన్–డి.

అసలైన, కొత్త, ఘుమఘుమల ప్యాక్ కోసం చూడండి.

**గ్లూకోన్-డి** ®

సూపర్‌హీరో అమితంగా ఇష్టపడే శక్తినిచ్చే పానీయం.

GLL-2389

